





# విదుర నీతి

✍

ఆవంచ సత్యనారాయణ

**విక్టరీ పబ్లిషర్స్**

డోర్. నెం. 30-17-18, వారణాశివారి వీధి, సీతారాంపురం,

విజయవాడ- 520 002. ఫోన్ : 0866 - 2444156.




# విదుర నీతి



ప్రథమ ముద్రణ :
జూన్ 2013

**వెల. రూ. 80/-**

**సోల్ డిస్ట్రిబ్యూటర్స్**

**శ్రీ వెంకటేశ్వర బుక్ డిపో**
30-17-3A, వారణాశివారి వీధి,
సీతారాంపురం, విజయవాడ - 2.
**ఫోన్ : 0866 - 2444156**



**సాయి వెంకటేశ్వర బుక్ డిపో**
26-27-77, బాటా షోరూమ్ ఎదురు,
గాంధీనగర్, విజయవాడ - 520 003.
**ఫోన్ : (0866) 2570192, 2570309**



**సాయి వెంకటేశ్వర బుక్ డిపో**
ప్లాట్ నెం. 3, 103, 2-4-1085,
సాయిలక్ష్మీ నికేతన్,
రామకృష్ణా హాస్పటల్ ఎదురువీధి,
కాచిగూడ కుమార్ థియేటర్ దగ్గర,
నింబోలి అడ్డ, హైదరాబాదు - 500027.
**ఫోన్ : (040) 65528228, 24653879**
**(ఫాక్స్) 24745257, సెల్ : 9346771314**

**మనవి :** మాచే ప్రచురించబడిన అన్ని రకముల పుస్తకములు అన్ని ప్రముఖ బుక్ షాపు లలోను, విశాలాంధ్ర మరియు ప్రజాశక్తి బుక్ హౌస్ అన్ని బ్రాంచి లలోను లభించును. లభించని యెడల మమ్ములను నేరుగా సంప్రదించగలరు. పుస్తకాలలో ఏవైనా లోపాలు, తప్పులు ఉన్నా తెలియచేసిన తదుపరిముద్రణలో సరిచేయగలం. ఏవిషయమైన **ramakumarimmadisetty@yahoo.com** మెయిల్‌కు తెలియ జేయవచ్చును. మీకు కావలసిన పుస్తకాలకు : **SBI online A/c. No. 31712393082 సాయి వెంకటేశ్వర బుక్ డిపో, విజయవాడ** పేరున జమచేసి, మీకు దగ్గర గల ట్రాన్స్‌పోర్టు వివరాలు తెలుపవలెను.

***Published by :* విక్టరీ పబ్లిషర్స్, విజయవాడ**





Ln. I.Ramakumar
PMJF

భారతీయ ధార్మిక విషయాలన్నీ వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు మొదలైన వానిలో సంపూర్ణంగా ప్రతిఫలిస్తున్నాయి. భారతీయ ధర్మమే మానవధర్మము లేక సనాతన ధర్మము అని పిలువబడుతున్నది. ఈ ధర్మము వైదిక జీవన విధానం మీద ఆధారపడి ఉన్నది. కానీ ఈ సనాతన ధర్మాన్ని ఈనాడు మనం హిందూ ధర్మం అంటున్నాము. ఇతర దేశీయులు కొందరు 'స' బదులు 'హ' ఉచ్చరిస్తారు కాబట్టి సింధూ ప్రాంతంలో తొలుత ఉన్న ఆర్యులు అవలంబించిన వైదిక జీవన విధానం 'సింధూ' ధర్మం బదులు 'హిందూ' ధర్మం అయింది. దానిని ఆదరించేవారు, ఆచరించేవారు హిందువులు అయినారు. ఇతర ధర్మాల వారికి వారివారివి మతాలు. 'మతము' అంటే ఒక పాక్షిక వాదము అని మాత్రమే అర్థం. వారికి వారిదే మతము కావచ్చు. ఎందుకంటే వారి మతాలు ఒక నిశ్చితమైన నమ్మకం మీద ఆధారపడి ఏర్పడిన సంస్థాగత విధానాలు. కానీ హిందువులు అవలంబించేది అలాంటి మతం కాదు. ఇది కరుడుగట్టిన కొన్ని నమ్మకాల ఆధారంగా ఏర్పడినది కాదు. ఇది ధర్మం- అంటే ఆచరించవలసిన జీవన విధానం. అలాగే ఇది ఒక గ్రంథం ఆధారంగానో లేక ఒక మనుష్యుడు ప్రబోధించిన బోధనలమీదనో ఆధారపడినది కాదు. ఇది శాశ్వత విలువల ప్రాతిపదికన ఏర్పడిన ఆధ్యాత్మిక, అపౌరుషేయ (మనిషి అయినవాడు ఎవనిచేత కానిది) జ్ఞానంవల్ల ఏర్పడిన, అవిచ్ఛిన్న పరంపరచేత ఏర్పడిన వ్యవస్థ. ఈ రకమైన ఆలోచనా విధానం ఎప్పుడూ క్రొత్త ఆవిష్కారాలను సహజంగానే స్వీకరించి వ్యష్టిగతమైన మనస్సును సమిష్టివైపుగా ప్రయాణించేటట్లు చేస్తుంది. తనకు నచ్చిన దారిని అనుసరించే వెసులుబాటును కల్పిస్తుంది. అదే హిందూ ధర్మపు ప్రత్యేకత.

శబ్దము లేక 'శ్రుతి' లేక అనుశ్రుత పూర్వకంగా వచ్చే 'శాస్త్రం' లేక 'సంస్కృతి' యొక్క ప్రభావ జన్యమైన వాక్కు కాలాన్ని బట్టి పూర్తిగా మారదు. ఈ శబ్దమే పురాణం. పురాణం అంటే ప్రాచీనమైనది అని అర్థం. ప్రజాపతి బ్రహ్మకు వేదం కంటే ముందే స్మరణకు వచ్చిన శబ్దములే అనాదిగా వచ్చిన అపౌరుషేయ పురాణాలు. దీనినే వ్యాసుడు 18 భాగాలుగా విభజనచేసి వానికి పౌరుషేయ రూపాన్ని ఇచ్చాడు. భారతీయ జీవన విధానము, భక్తిమార్గం

లేక కర్మయోగం మొదలైనవాని చక్కని సమన్వయం 'అష్టాదశ' సంఖ్య గల ఈ పురాణాలలోనే లభిస్తుంది.

ఇలాంటి అనేక విషయాలచేత పరిపుష్టమైన పురాణాలలో ఏమి ఉన్నదో తెలుసుకొనడం విద్యావంతులైనవారి అందరి కర్తవ్యం. అందుకే మేము అష్టాదశ పురాణాలను తేటతెలుగు వచనంలో అందరికి అందుబాటులోకి తీసుకొని రావాలని భావించాం. అదే విధంగా వివిధ పురాణాలు, మహాభారతం ఇతిహాస, కావ్య గ్రంథాలలో గల నీతులను తెలుసుకొనటం ఆధునిక కాలంలో చాలా అవసరం అని గ్రహించటం జరిగింది. అందుకే కొన్ని నీతి గ్రంథాలను ప్రచురించాలని సంకల్పించాం. ఈ గ్రంథాలలో ముందుగా చాలా సులభము, అనుభవంలో అనుసరించదగిన చాణక్యనీతి గ్రంథం మొదటగా మాచే ప్రచురించబడింది. ఆ పుస్తకము పలువురి ప్రశంసలకు పాత్రమై, మూడునెలలు తిరిగే లోపల రెండవ ముద్రణ కూడా పొందటం మా అదృష్టం. ఇదే క్రమంలో ఇప్పుడు 'విదురనీతిని' ప్రచురిస్తున్నాము. తెలుగువారికి ప్రీతిపాత్రమైన, వ్యాసభారతభాగం అయిన ఈ పుస్తకాన్ని కూడా తెలుగు వారందరు ఆదరించి, ఈ గ్రంథం చేత ప్రేరేపణ పొందగలరని మా ఆకాంక్ష.

ఎందరో తెలుగువారు మాచే ప్రచురింపబడిన పురాణాలను ఆదరించి మమ్ములను కృతార్థులను చేస్తున్నారు. తెలుగువారి ప్రతి ఇంటిని మా పురాణాలు అలంకరించినట్లే ఈ పుస్తకం కూడా ఆదరణ పొందాలని మా కోరిక. అది నెరవేరగలదని భావిస్తూ.... అందుకు మీ సహకారాన్ని అర్థిస్తూ....

ఇట్లు

I. Rama Kumar

విజయవాడ
తేది 18-10-2013.

(ఇమ్మడిశెట్టి రామకుమార్)
మేనేజింగ్ ట్రస్టీ
**ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు ఛారిటబుల్ ట్రస్ట్**
విజయవాడ

# అంతరంగం

యదిహాస్తితదన్యత్రయన్నేహాస్తినతత్ క్వచిత్ – అనియు

సీ : ధర్మతత్త్వజ్ఞుల్ ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదుల్ వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభుల్ మహాకావ్యమనియు
లాక్షిణికులు సర్వలక్ష్య సంగ్రహమని,
యైతిహాసికు లితిహాసమనియు
బరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబనిమహి గొనియాడుచుండ

గీ : వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతంబు *భారతం (1-1-31)*

*(అని భారతంలో ఉన్నదే మరెక్కడైనా ఉంటుందని, ఇందులో లేనిది ఇంకెక్కడా ఉండదని వ్యాసమహర్షి ఘంటాపథంగా చెప్పాడు)*

అలాంటి మహాభారతాన్ని గురించి ఒకరోజు విక్టరీ పబ్లిషర్స్ అధినేతలు శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్‌గారితో యథాలాపంగా మాట్లాడుతుండగా "విదురనీతిని" గురించిన ప్రసక్తి వచ్చింది. విదురనీతి మనం కూడా ప్రచురిస్తే ఎలా ఉంటుంది? అని ఆయన ప్రశ్నించారు. అప్పటి వరకూ భారతాన్ని కేవలం కథాత్మకంగానే చదివిన వాడిని కాబట్టి భారతంలోని విదురనీతి, సనత్సుజాతీయము, యక్షప్రశ్నలు, భగవద్గీత వంటి విషయాలను లోతుగా తెలుసుకోవటం అవసరమే కదా అని నాకు అనిపించింది. అందుకే శ్రీ రామకుమార్‌గారు ప్రస్తావించిన "విదురనీతిని" గురించి అధ్యయనం చేద్దాం అనుకున్న వెంటనే విదురనీతి గల ఉద్యోగపర్వం తిక్కన తెలుగు భారతంలో పరిశీలించినప్పుడు చాలా అసంతృప్తికి లోనైనాను.

అందుకు కారణం, సంస్కృత మూలభారతంలో ఎనిమిది అధ్యాయాలుగా దాదాపు 500 శ్లోకాలకు పైగా ఉన్నా "విదురనీతి" భాగాన్ని తిక్కన మహాకవి తెలుగులో రెండు పద్యాలలో ముగించి వేశాడు. అయితే దీని అర్థం తిక్కన భారత అనువాదం సరిగా చేయలేదని కాదు, ఆ మహాను భావుడు తెలుగు సాహిత్య వినీలాకాశంలో సహస్రభాను సమానుడు. గ్రంథ విస్తరభీతిచేత బహుశః విదురనీతిని తిక్కన మహాకవి సంగ్రహించి ఉండవచ్చు. కానీ "విదురనీతి" లేకపోవటం నాలాంటి వారికి అసంతృప్తి కలిగించి దాని అన్వేషణ ప్రారంభించాను. ఆ విధంగా సంస్కృత వ్యాసభారత ఉద్యోగపర్వంలోని 33 వ అధ్యాయం నుంచి 40వ అధ్యాయం వరకు విదురనీతిని ఆంగ్లము, హిందీ, తాత్పర్యాలలో అధ్యయనం చేయటం జరిగింది. ఈ విదురనీతి అనువాదంలో వివిధ తెలుగు గ్రంథాల సహాయం కూడా తీసికొనటం జరిగింది. ఆ గ్రంథాల ప్రచురణ కర్తలకు, వేయికైమోద్పులు అర్పిస్తున్నాను.

కొందరికైనా మంచి మార్గం చూపి, ఎందరికో మనశ్శాంతిని చేకూర్చగల్గే ఈ పుస్తకం పదిమందికి మార్గగామి కాగలదని నా విశ్వాసం. దీనిని ఈ విధంగా పుస్తక రూపంలో తీసుకొని రావటానికి ముఖ్యకారకులైన విక్టరీ పబ్లిషర్స్ అధినేత శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్ గారికి, వారి కుటుంబానికి ఆయురారోగ్య, ఐశ్వర్య, సౌభాగ్యాలను కలిగించాలని భగవంతునికి నా అభ్యర్థన.

*ఆవంచ సత్యనారాయణ*

**ఆశ్వయుజ శుద్ధ పౌర్ణమి**
**18-10-2013**



# విదురుడు ఎవరు?

**భా**రతీయ సాహిత్యంలోనే కాకుండా ప్రపంచసాహిత్యంలో కూడా ఋగ్వేదం అతి ప్రాచీనమైనది. అయితే ప్రపంచంలోని సాహిత్య గ్రంథాలన్నింటిలోనూ అతి బృహత్తరమైనది. వ్యాసకృత సంస్కృత మహాభారతం. మహాభారతం మానవుడి జీవితాన్ని పరిపూర్ణంగా అర్థం చేసుకుని విశ్లేషించిన గ్రంథం. అందుకనే ఇప్పటివరకూ వచ్చిన ఏ సాహిత్య గ్రంథం, నీతి గ్రంథమూ మహాభారతానికి సాటిరావు.

తాను పాండవులతో సంధి చేసుకొనవలయునో లేక యుద్ధానికి సిద్ధపడి కురుక్షేత్ర మహా సంగ్రామానికి కారణభూతుడు కావలెనా? అని సందిగ్ధంలో ఉన్న సమయంలో కురు చక్రవర్తి ధృతరాష్ట్రునికి, ఆతనికి ఒక విధముగా సవతి తమ్ముడైన విదురుడు బోధించిన నీతియే విదురనీతి అని ప్రసిద్ధి చెందింది. విదురనీతిని గురించి తెలుసుకొనబోయే ముందు విదురుని గురించి కొంత తెలుసుకొందాం.

ఈ విదురనీతి మహాభారతంలోని ఐదవదైన ఉద్యోగపర్వంలో, ముప్పై మూడవ అధ్యాయం నుంచి నలభైయవ అధ్యాయం వరకు అంటే ఎనిమిది అధ్యాయాలలో విస్తరింపబడింది. ఈ ఎనిమిది అధ్యాయాలలోనూ ఒక మనుష్యుడు మనుష్యునిగా రాణించి ధర్మార్థ కామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థాల సాధన కోసం అనుసరించవలసిన నీతి విషయాలన్నీ సంపూర్తిగా వివరించబడ్డాయి. ఆ ఎనిమిది అధ్యాయాలలోని విషయాలు ఈ విధంగా ఉంటాయి.

33వ అధ్యాయం – ధృతరాష్ట్రుడు విదురునికై పంపుట – విదురుడు వచ్చి ధృతరాష్ట్రునితో సంభాషించుట.

34వ అధ్యాయం – ధృతరాష్ట్రుని కోరికపై విదురుడు నీతియుక్త వచనములను పల్కుట.

35వ అధ్యాయం - విదురుడు కేశినికై సుధన్వునితో విరోచనునికి కలిగిన వివాదమును తెల్పుచూ ధృతరాష్ట్రునికి ధర్మోపదేశము చేయుట.

36వ అధ్యాయం - దత్తాత్రేయుడు, సాధ్యదేవతల సంభాషణను వివరించుచూ మహాకులీనుల లక్షణములను విదురుడు ధృతరాష్ట్రునికి వివరించుట.

37వ అధ్యాయం - ధృతరాష్ట్రునికి విదురుని హితోపదేశం

38వ అధ్యాయం - విదురుడు నీతిని తప్పినకలుగుప్రమాదములను వివరించుట.

39వ అధ్యాయం - ధృతరాష్ట్రునికి విదురుడు నీతియుక్త కర్తవ్యోపపదేశము చేయుట.

40వ అధ్యాయం - ధర్మ మాహాత్మ్య ప్రతిపాదనము, ధర్మమును పాటింప వలసినదిగా విదురుని హితబోధ

## విదురుడు

విశిష్టకృతియైన మహాభారత సంహితలో విదురుడు చాలా ప్రాముఖ్యత గల వ్యక్తి. ఒక రకంగా కురువంశరాజులైన ధృతరాష్ట్ర పాండురాజులకు ఆయన సవతి తమ్ముని వంటివాడు. విచిత్రవీర్యుడు సంతానహీనుడుగా మరణించిన సమయంలో ఆతని తల్లి సత్యవతి తన కుమారుడైన వ్యాసమహర్షిని తలచుకొనినంతట, ఆయన తన యెదుట ప్రత్యక్షము కాగా తన కుమారుని భార్యలైన అంబిక, అంబాలికలకు నియోగ విధానమున పుత్రప్రాప్తి కలిగించి కురువంశానికి ఉత్తర వారసులను ప్రసాదించవలసినదిగా కోరగా, అంబిక వ్యాసుని చూడగానే భయంతో కనులు మూసుకొన్న కారణము చేత ఆమెకు కన్నులే లేని అనగా గ్రుడ్డివాడైన ధృతరాష్ట్రుడు జన్మింప అంబాలిక వ్యాసుని చూచి భయంతో తెల్లబోగా ఆమెకు పాండురోగి అయిన పాండురాజు జన్మించాడు. తర్వాత ఆ రాణులు వ్యాసుని వద్దకు తమ దాసిని పంపగా ఆమె వ్యాసుని భక్తితో సేవించినది. ఆ కారణము చేత ఆమెకు విదురుడు జన్మించాడు. మహా ధర్మమూర్తి, జ్ఞానసంపన్నుడు అయినప్పటికీ, దాసీ పుత్రుడైన కారణము చేత విదురునికి రాజ్యార్హత లేకుండా పోయింది. కొన్ని ఐతిహ్యాల ప్రకారం మాండవ్య మహామునిని కొరత వేసిన శిక్షకు కారణమైనందున

యమధర్మరాజును ఆ మహాముని మానవునిగా జన్మించమని శపించాడని అందుచేత విదురుడు యమధర్మరాజు అవతారమని తెలుస్తున్నది. విదురుడు బాల్యం నుంచి భీష్ముని సంరక్షణలో పెంచబడ్డాడు. ఆయనకు రాజ్యార్హత లేనందువలన సోదరుడైన ధృతరాష్ట్ర పాండురాజులకు మంత్రిగా నియమింపబడ్డాడు. వాస్తవానికి అంధుడైన ధృతరాష్ట్రుడు రాజైన తర్వాత విదురుడే రాజ్య సంబంధమైన సమస్త రాజ్య వ్యవహారములను చక్కపెడుతూ దుర్యోధనునికి యుక్తవయస్సు వచ్చునంత వరకూ రాజ్యభారాన్ని వహించాడు. ఒక అభిప్రాయం ప్రకారం విదురుడు ధృతరాష్ట్రుడు, పాండురాజు ఇద్దరు సోదరుల కంటే పెద్దవాడని భీష్ముడు ఒకసారి ముగ్గురు రాజకుమారులకు తగిన భార్యలను తెలుప వలసినదిగా కోరగా విదురుడు తనకు ఒక యాదవ బాలికను ధృతరాష్ట్రునకు గాంధారిని, పాండురాజుకు మాద్రిని వారి వయసుల ప్రకారం నిర్ణయించాడని తెలుస్తున్నది. విదురుని జన్మను గురించి మరికొన్ని ఐహిత్యాలు ప్రచారంలో ఉన్నాయి. ఆయన మిత్రావరుణుల జంటకు బదులుగా ధర్ముడే విదురునిగా అవతారం దాల్చారని ఒక గాథ.

విదురుడు నిరంతరం ప్రజా సంక్షేమాన్ని ఆకాంక్షించినవాడు కావున, ఆయనకు గల విశేష ధర్మజ్ఞానము చేతనే అనేకమార్లు పాండవులను హతమార్చటానికి దుర్యోధనుడు పన్నిన కుయుక్తులను ముందుగనే ధృతరాష్ట్రునికి తెల్పి ఆయనను హెచ్చరించి వానిని విఫలం చేశాడని అలాగే పాండవులను లక్క ఇంటిలో ఉంచి దహనం చేసి అంతమొందించాలనే దుర్యోధనుని కుట్ర విదురుని వలననే భగ్నమైనదని తెలుస్తున్నది. రాజనీతికి, సమగ్ర జ్ఞానానికి విదురుడు ప్రతిరూపం.

శ్రీకృష్ణుడు తన ఎడ విదురునికి గల భక్తి ప్రజాక్షేమము యెడల గల ఆసక్తి అన్ని విషయములలోనూ ఆయనకు గల జ్ఞానసంపత్తి కృష్ణుని మనస్సును చూరగొన్నది. శ్రీకృష్ణుడు కేవలం మానవమాత్రుడు కాదని ఆయన సాక్షాన్మహా విష్ణువు అపరావతారమని మహా భారత వృతాంత్తంలోని కథలో తెలిసిన ఏడుగురిలోను ఆయన ఒకడు. శ్రీకృష్ణుడు పాండవుల పక్షాన దూతగా హస్తినాపురానికి వచ్చినప్పుడు ఆయనకు తన రాజగృహంలో ఆతిథ్యం ఇవ్వచూపిన దుర్యోధనుని అభ్యర్థనను నిరాకరించి, కౌరవ పాండవులకు తటస్థుడు అయినందున విదురుని గృహములో ఆతిథ్యం స్వీకరిస్తానని తెలియజేస్తాడు. నిండు కౌరవ సభలో కౌరవులు ద్రౌపదిని అవమానించినప్పుడు దుశ్శాశనుడు ఆమె వలువలను ఊడ్చిన సమయంలో నూర్గురు కౌరవులలో ఒకడైన వికర్ణుడు, విదురుడు మాత్రమే ఆ చర్యను నిరసించారు, అడ్డు చెప్పారు. శ్రీ కృష్ణుడు విదురుని సత్యానికి అధిపతిగా భావించేవాడు. శ్రీ కృష్ణుడు విదురుని గృహములో ఆ రాత్రి బస చేయడానికి దుర్యోధనుని సౌధములో

బస నిరాకరించడానికి ధృతరాష్ట్రుని మనస్సులో గల ఆంతర్యాలే కారణం. శ్రీ కృష్ణుడు హస్తినాపురానికి దూతగా రాగా దుర్యోధనుడు ఆయన సహచరులు కృష్ణునికి అతి ఆడంబరంతో స్వాగత సత్కారాలను ఏర్పాటు చేశారు. సర్వ రుచికర పదార్థాలతో విందు ఏర్పాటు చేసి శ్రీ కృష్ణుడు ఆ పదార్థాలను తృప్తిగా తినిన తర్వాత తమకు సహాయకుడు కాగలడని దుర్యోధనుడు ఆశించాడు. దుర్యోధనుని కుయుక్తిని ముందే పసిగట్టిన శ్రీ కృష్ణుడు అందుకు నిరాకరించి, విదురుని గృహంలో బస చేశాడు. తన విందును శ్రీ కృష్ణుడు స్వీకరించి తృప్తి చెందేటట్లైతే ఆతని నుంచి వరం తీసుకొని తన వైపుకు కృష్ణుని త్రిప్పుకొని పాండవులను సర్వనాశనం చేయవచ్చుననే దుర్యోధనుని దురూహ ఆ విధముగా భగ్నమైపోయింది. విదురుడు తనకు ఇచ్చే ఆతిథ్యము ప్రేమతోనూ అభిమానంతోనూ ఉంటుందనే ఆయన విదురుని అభ్యర్థనను అంగీకరించాడు. శ్రీకృష్ణుడు తన భక్తులను అభిమానించేవాడే కదా!

కురుక్షేత్ర యుద్ధం కొద్ది కాలంలోనే మొదలవుతుందనే విషయం స్పష్టమైన తరువాత విదురుడు ధృతరాష్ట్రునికి నీతిని ఉపదేశించి, ధర్మ విషయాలను బోధించటానికి తాను అర్హుడు కానని మరణాన్ని గురించిన విషయాలను తెలియజేయడానికి సనత్సుజాతుని ఆరాధించి, అతనితో ధృతరాష్ట్రునికి హితబోధ చేయించాడు. కురుక్షేత్ర యుద్ధం జరగటానికి పూర్తిగా విముఖుడైనందున విదురుడు తన మంత్రిత్వాన్ని విసర్జించాడు. 18 రోజుల మహాభారత యుద్ధం ముగిసిన తర్వాత విజేతయైన ధర్మరాజు సర్వ అధికారాలతో విదురుని ప్రధానామాత్యునిగా నియమించాడు. అయినా యుద్ధ బీభత్సం, తన వయస్సులను పరిగణనలోనికి తీసుకొనిన విదురుడు పరిపాలనలో భాగం పంచుకోవడానికి ఇష్టపడలేదు. ఆ తర్వాత కొద్దికాలానికే ఆయన తన సోదరుడైన ధృతరాష్ట్రుడు వదినలైన గాంధారీ, కుంతులతో ఆశ్రమవాసాన్ని స్వీకరించి వానప్రస్థ జీవనం గడపడానికి అరణ్యంలోకి వెళ్ళిపోయారు. అక్కడ కొంతకాలం పాటు తీవ్రంగా తపస్సు చేసి రాజవనప్రస్థులలో అందరి కంటే ముందుగా మరణం చెందాడు.

రాజనీతిని గురించిన అనేక విషయాలతో కూడిన విదుర, ధృతరాష్ట్ర సంవాదమైన విదురనీతి ఒక రకంగా చాణక్య నీతికి ఇంకా అసంఖ్యాక నీతిగ్రంథాలకు ఆధారప్రాయ రచన అని భావించవచ్చు.

విదురుడు సత్యానికి విధేయతకు పక్షపాతరహిత విధానాలకు దూతగా ధర్మప్రతినిధిగా భావించవచ్చు. విదురుడు మహాభారతం యొక్క ఆంతరిక భావాత్మకతకు ప్రతినిధి.





# నీతిశాస్త్రాల ఉద్భవము - వికాసము

**భా**రతీయ వాఙ్మయంలో నీతిశాస్త్రాలకు అత్యంత ప్రాముఖ్యత ఉన్నది. మనకు సర్వప్రామాణికాలైన వేదాలలోనే నీతిని గురించిన హితోపదేశము ప్రముఖంగా కన్పిస్తుందంటే మిగిలిన వానిని గురించి చెప్పవలసిన అవసరమే లేదు. అందుకని ఈ సందర్భంలో భారతీయ నీతిశాస్త్రాలు ఎలా ఉద్భవించాయి? అభివృద్ధి చెందాయి? అనే విషయాన్ని గురించిన లఘు ప్రస్తావన అప్రస్తుతం కాదనుకుంటాను.

మహాభయంకరమైన పదునెనిమిది రోజులపాటు జరిగిన భారత యుద్ధం సమాప్తమైనది. ధర్మరాజు రాజ్యాభిషిక్తుడైనాడు. ఆ సమయానికి ఇంకా భీష్మ పితామహుడు ఉత్తరాయణం కోసం ఎదురుచూస్తూ అంపశయ్య మీద మరణం కోసం ప్రతీక్షిస్తూ ఉన్నాడు. ధర్మరాజు అంపశయ్య మీద ఉన్న భీష్ముని దగ్గరకు శ్రీకృష్ణునితోనూ తన పరివారంతోనూ రాజనీతిని గురించి తెలుసుకొనటానికి చేరుకొని ఆయనను రాజనీతిని గురించి ప్రశ్నించాడు. అప్పుడు భీష్మ పితామహుడు వారందరికీ ఈ విధంగా చెప్పాడు.

ప్రపంచం ఉద్భవించిన తర్వాత యుగాల ఆరంభానికి ముందు కృతయుగంలో మొదట ఒక రాజుగానీ, రాజ్యం గానీ, రాజ్యాంగం గానీ, కనీసం రాజు అనే పేరు కూడా ఉండని కాలం అది. దండం లేదు. దండించేవాడు లేడు. ప్రతి విషయం పవిత్రత, దయ, ధర్మం మీదనే ఆధారపడి ఉండేవి. నరులంతా ధర్మంతోనే ఒకరికొకరు రక్షించుకొంటుండేవారు. ప్రతివాడు రెండవవానికి తనకు చేతనైనంత సహాయం చేసేవాడు. ప్రతికార్యము ఎట్టి అపవాదు లేక ధర్మపూరితంగా ఉండేది. ఎవరు తప్పు పనులు చేసేవారు కాదు. కాబట్టి భయం అనేది లేకుండా ఉండేది. ప్రతివారు ప్రకృతిని అనుసరించి తమ సహజసిద్ధ గుణాలతో కార్యాలను నిర్వర్తించేవారు. అది ధర్మయుగం.

అయితే రోజులన్నీ ఇలాగే గడచిపోలేదు. కొంతకాలం తర్వాత ప్రజలలో కోరికలు పెరిగాయి. వారిని మోహం ఆవేశించింది. జనులు పెద్దల ఆజ్ఞలను ఎదిరించడం మొదలు పెట్టారు. కొందరు వేదాధ్యయనం చేయటానికి ఇష్టపడలేదు. ఇంకా కొందరు యజ్ఞాలు చేయటం మానివేశారు. ఈ పరిస్థితులను చూసిన దేవతలకు చాలా దిగులు కలిగింది. అంటే ప్రజలలో విలువలు పతనమై పోయినవన్నమాట. దేవతలు దిగులుతో బ్రహ్మ దగ్గరికి పోయి తమ బాధలను వివరించారు. బ్రహ్మ వారి మాటలను విని ఓదార్చి కొంతసేపు ధ్యాన నిమీలిత నేత్రుడైనాడు. కొద్దిసేపు తర్వాత కన్నులు తెరిచి వారితో నేను ప్రజలనందరినీ సన్మార్గంలో నడపటానికి ఒక క్రొత్త ధర్మశాస్త్రాన్ని సృష్టించాను. అందులో లక్ష అధ్యాయాలు ఉన్నాయి అని చెప్పాడు. లక్ష అధ్యాయాలు అంటే లక్ష శ్లోకాలుగా మనం భావించవచ్చు.

**తతో అధ్యాయ సహస్రాణామ్ శతం చక్రే స్వబుద్ధిజం–** ***(భారతం శాంతి పర్వం 59/29)***

భీష్ముడు కొద్దిసేపు ఆగి మరల తనను ఆశ్రయించిన దేవతలతో ఆ కొత్త ధర్మశాస్త్రము పేరు నీతిశాస్త్రము. అందులో వేదత్రయి (ఋగ్, యజుర్, సామవేదము) లోని జ్ఞానకాండము, కర్మకాండము, కృషి (వ్యవసాయము) వ్యాపారము, దండనీతి అను అంశాలు ఉంటాయని తెల్పాడు.

**త్రై చాన్వీక్షకి చైవ వార్తాచ భరతర్షభః**

**దండనీతిశ్చ విపులా విద్యాస్తత్ర నిర్దేశితః** ***(భారతం – శాంతిపర్వం 59/33)***

ఆ నీతి శాస్త్రములో (ధర్మాశ్చార్థశ్చ కామశ్చ మోక్షశ్చ అత్ర అనువర్ణితా) – ధర్మార్థ కామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థములు చెప్పబడ్డాయి. అంతేగాక ఆ విషయాలతోపాటు ప్రపంచం సత్యపథం నుంచి తొలగకుండా ఉండటానికి అవసరమైన విధానాలు, కారణాలు, కూడా బ్రహ్మచెప్పిన ఈ నీతి శాస్త్రంలో ఉన్నాయి.

అని భీష్ముడు చెప్పి పాండుపుత్రులారా! ఆ నీతి శాస్త్రము శిక్ష న్యాయము చరిత్ర తపస్సు జ్ఞానము, అహింస, వృద్ధోపసేవ, ధర్మము, స్వచ్ఛత, దయ, జాలి అనే విషయాలు మాత్రమే గాక యజ్ఞములు, తీర్థయాత్రలు, పాలకుల యొక్క విధులు – అధికారములు కూడా చెప్పబడ్డాయి. ఇంతకంటే ఎక్కువ నేనేమి చెప్పగలను? ఈ ప్రపంచంపై గల సర్వ విషయములను బ్రహ్మ ఆ శాస్త్రమునందు తెలిపి ఉన్నాడు. అని ధర్మరాజుకు బోధించాడు.

లోకమంతా సన్మార్గం నుండి చలింపకుండా నిలిచే ఉపాయాలన్నీ ఆ నీతిశాస్త్రంలో బ్రహ్మ వర్ణించాడు. చాలా చర్చోపచర్చలు జరిగిన తర్వాత బ్రహ్మ ఆ నీతి శాస్త్రమును శివునికి అప్పగించాడు. పిమ్మట దానిని ఎక్కువమంది నేర్చుకొనటానికి తేలికగా గ్రహించటానికి వీలుగా శివుడు శాస్త్రాన్ని సంగ్రహించి దానికి 'విశాలాక్షి' అని పేరు పెట్టాడు. విశాలాక్షి అంటే పెద్దగా అవగాహన చేసుకొనటానికి కావలసిన సమ్యక్‌దృష్టిని కలిగించేది అని అర్థం. ఆ గ్రంథంలో పదివేల అధ్యాయాలు లేక శ్లోకాలు ఉన్నాయి. శివుడు ఆ గ్రంథాన్ని భద్రంగా ఉంచటం కోసం ఇంద్రునికి అప్పగించాడు. ఇంద్రుడు దానిని సంగ్రహపరచి 'బాహుదాంతక' అనే పేరుతో అయిదు వేల అధ్యాయాలు లేక శ్లోకాలుగా సంక్షిప్తీకరించాడు, ఇంద్రుని నుంచి ఆ నీతి శాస్త్రము బృహస్పతికి చేరుకొనగా ఆయన దానిని తిరిగి మూడువేల అధ్యాయాలతో  సంక్షిప్తీకరించాడు. బృహస్పతి సంగ్రహించిన ఆ నీతిశాస్త్రానికి 'బార్హస్పత్యం' అని పేరు. ఆ బార్హస్పత్యాన్ని యోగాచార్యుడు, మహాయశస్వి అయిన శుక్రుడు అమిత ప్రజ్ఞతో దానిని వేయి అధ్యాయాలకు సంగ్రహం చేశాడు. అయితే బ్రహ్మ నుంచి వచ్చిన నీతిశాస్త్రం నుంచి బృహస్పతి నీతి శాస్త్రము వరకూ నేడు లభ్యం కావడం లేదు. కానీ బృహస్పతి నీతిశాస్త్రములోని కొన్ని శ్లోకాలు మహాభారతంలోనూ వివిధ పురాణాలలోనూ లభ్యమవుతున్నాయి.

కానీ ఆ గ్రంథాలలోని చాలా శ్లోకాలు శుక్రనీతిలోనూ, విదురనీతిలోనూ లభ్యమవుతు న్నాయి. ప్రస్తుతం లభ్యమవుతున్న శుక్రనీతిలో ఒకటి రాజ్యకృతాధికారము, రెండు యువరాజు లక్షణము, మూడు నృపరాష్ట్ర లక్షణము, నాలుగు సుహృద నిరూపణము ఐదు కోశ నిరూపణము, ఆరు విద్య, కళా నిరూపణము, ఏడు లోకధర్మ నిరూపణము, ఎనిమిది రాజధర్మ నిరూపణము, తొమ్మిది దుర్గ నిరూపణము, పది సేనా నిరూపణము అనే పది అధ్యాయాలు ఉన్నాయి. శుక్రాచార్యుని నీతిలో లభ్యమయ్యే అనేక విషయాలు ఆధునిక మానసిక శాస్త్రజ్ఞులును, సామాజిక శాస్త్రజ్ఞులునూ కూడా ప్రభావితం చేస్తున్నాయి. అయితే ఇవి లెక్కలేనంత ప్రాచీన కాలానివి అని మనం గుర్తుంచుకోవాలి. ఉదాహరణకు "నైకః సుఖి న శ్రద్ధా విస్త్రబ్ధోనచ శంకితః" (సుఖాన్ని ఒక్కడివే అనుభవించవద్దు, అందర్నీ విశ్వసింపవద్దు) అందరిపైనా అవిశ్వాసము ఉంచుకొనకూడదు. ఉదాహరించిన ఈ ఒక్క నీతే ఆధునిక భౌతికవాదులు కూడా అంగీకరించవలసినదే కదా!

ఈ విధముగా చరిత్ర కందని కాలంలో ఆ నీతి ధర్మములను గురించిన శాస్త్ర జ్ఞానము విస్తృత రూపంలో మొదలైనది. అది చివరకు మనుష్యునికి చేరింది. అయితే విచిత్రం ఏమిటంటే దానిని భద్రముగా ఉంచి, పఠించి, బోధించి, దాని సూత్రాలను

అనుసరించవలసిన ఆధునిక మానవులు దానిని పూర్తిగా విస్మరించారు. అయితే ప్రాచీన కాలంలోనూ, మధ్య యుగాలలోనూ ఆ సూత్రాలను చాలావరకు యధాతథంగా అనుసరించారు. అని చెప్పటానికి బోలెడు నిరూపిత అంశాలు ఉన్నాయి. ఆనాడు ఈ విషయాలనే పదిమంది కలిసిన సభలలో చర్చించేవారు. అనేక గ్రంథాల రూపంలో పఠింపచేసేవారు. మనకు మహాదేవుడైన శివుడు పేరులోనే నీతికి నిలబడే వాడనీ అర్థం. సత్యం, శివం, సుందరం అనే దానిలోని సత్యం అనగా నిజాయితీ, శివం అనగా నీతి సుందరం అనగా సభ్యత, సరైన ప్రవర్తన. విదురనీతి కూడా మహాభారతంలోని భాగమే అని దాని ప్రాముఖ్యతను గురించి ఇంతకు ముందే వివరించబడింది. విదురనీతి చాలా వరకూ ధృతరాష్ట్రునికి విదురునికి సంభాషణ రూపంలో ఉంటుంది. వివిధ మహాభారత ప్రతులలో విదురనీతిలోని పాఠాలు వివిధ రకాలుగా కన్పిస్తున్నాయి. శ్లోకాలను ఎన్నుకోవడంలో కూడా అందులోని విషయము, రూపంలోనూ తేడాలున్నాయి. అయిన అవి అంత ప్రాముఖ్యమైనవి కావు. అవి ఒక రకంగా వేదవ్యాసుని నీతి బోధలే అని భావించవచ్చు. అయితే ఆయన బోధనలన్నీ ఆయన రచించిన పుస్తకాలలో ఉండటం వల్ల ఆ సందర్భంలోని పాత్రల పేర్లతో గానీ లేక ఆ పుస్తకాల పేర్లతోగానీ వ్యవహరింప బడుతున్నాయి గానీ వ్యాసునివి అని ఎక్కడా కన్పించదు.

మహాభారతంలోని భగవద్గీత రామాయణం ఇంకా అనేక ఇతర గ్రంథాలలోని నీతి బోధలు ఆ గ్రంథంలోని విషయాలుగానీ, ప్రత్యేక నీతి గ్రంథాలుగా పరిగణింపబడుట లేదు.

## నీతి అంటే ఏమిటి?

నీతి అనే పదానికి అనేక అర్థాలు ఉన్నాయి. నీతి అనగా మోయుట, ఇచ్చుట, చూపించుట, దారి చూపుట బోధించుట అనేవి ఆ అర్థాలు. "నీయతే సంలాభ్యంతే ఉభాదాయ ఇతివ" అని నీతికి నిర్వచనం. అమరకోశంలో 'నీతి' అను పదము పేర్కొనబడలేదు. శబ్దరత్నాకరములో నీతి పదమునకు 1. న్యాయము 2. పొందించుట అను అర్థములు ఈయబడినవి. సంస్కృత వ్యాకరణాన్ని అనుసరించి "నీ" అనే ధాతువుకు "తి" ప్రత్యయం చేరినప్పుడు నీతి అనే పదం ఏర్పడుతుంది. దాని అర్థం తీసుకొను, చేయు ముందుకు పోవుట. కొన్ని నిత్యసత్యాలను తెలుపుతూ నీతి బోధలు జనులను సరియైన పథములో నడిచేటట్టు చేస్తాయి. ఉదాహరణకు

**సర్పః క్రూరః ఖలః క్రూరః సర్పాత్ క్రూరతాః కరః**
**మంత్రః ఔషధివశః సరః కలః కేనా నివారయేత్**

అనే ఈ శ్లోకం... ఖలునకు నిలువెల్ల విషము గదరా అనే సుమతి శతకపద్యానికి మూలం గదా. వ్యక్తి జీవితము మన ధార్మిక గ్రంథాలలో నిబంధించిన సూత్రాలను అనుసరించి గడపడమే నీతి అనబడుతుంది.

సర్వజనులకునూ, సర్వకాల సర్వావస్థలలోనూ వర్తించు ప్రవర్తనా విధానమే నీతి. నీతి శాశ్వతమైన విలువలు కలది. అందుకు కారణము అది మన శృతిస్మృతులపై ఆధారపడి ధర్మార్థ కామమోక్షముల సాధనకు తోడ్పడుతుంది. అందువలననే భారతీయ వాఙ్మయంలలో అనేక నీతి గ్రంథములు వెలశాయి. ఉదాహరణకు మనస్మృతి, వ్యాసస్మృతి, విదురనీతి, పంచతంత్రము మొదలగునవి. అటువంటిదే

అన్ని శాస్త్రాలకు నీతి శాస్త్రముతో ఏదో ఒక రకమైన సంబంధం ఉన్నది. నీతి శాస్త్రము అనగా నరునికి హితకరమైన అహితమైన కార్యముల మధ్య గల భేదమును తెల్పు శాస్త్రము అని అర్థం. మానవుని జీవితములో "కర్మ" అనునది అతి ప్రధాన విషయము. అందువలననే "ఆచారః ప్రథమోధర్మః" కర్మ, ప్రవర్తన ఈ రెండు ప్రథమ ధర్మములు. కేవలము అధ్యయనము ఒక్కటే ముఖ్యము కాదు. "ఆచార హీనః నపునాతి వేదాః" జీవితంలో ధర్మపరముగా కర్మలను చేయుట అవసరము. వేదములను అధ్యయనము చేసిన వాడైననూ దానియందలి బోధనలను ఆచరించని వాడు హీనుడే. సంస్కృత భాషలో అగణ్యముగా నీతి శాస్త్రగ్రంథములు కలవు. ఇవి కొన్ని సూత్రరూపముగను, కొన్ని శ్లోకరూపముగను మరికొన్ని కథారూపములలోనూ లభ్యమగుచున్నవి. మానవ జీవితమును, సంతోషకరము, శాంతియుతము, సంస్కార భరితము, సంస్కృతీమయము, శాంత రూపములో గడిపి దైవత్వమును పొంది ముక్తినొంది భగవంతునిలో ఐక్యమగుటయే ఆ నీతి గ్రంథముల లక్ష్యము. ఆ గ్రంథములన్నియూ సులభశైలిలో ఉండి తేలికగా గ్రాహ్యమగుచూ అంతే తేలికగా కంఠస్థము చేయుటకు వీలుగా ఉండి ఆ విషయములను మనస్సులో ఉంచుకొని సందర్భము వచ్చినప్పుడు ఇతరులకు బోధ చేయు శైలిలో ఉండును.

కాలము గడుచుకొద్దీ నీతి గ్రంథములు విస్తృతముగా అభివృద్ధి చెందినది. వానిలో చాలా గ్రంథములు తెలుగులోనికి కూడా అనువాదము పొందినవి. వీనిలో ముఖ్యమైనవి చాణిక్యనీతి, పంచతంత్రము మొదలగునవి. కాలక్రమముగా నీతిని బోధించు గ్రంథములు

విశేషముగా వృద్ధి పొందినవి. విష్ణుశర్మ రచించిన పంచతంత్రము క్రీస్తునకు పూర్వము రెండు శతాబ్దములకు ముందే గ్రీకు, పహ్లావి, మొదలగు భాషలలోనికి అనువాదము పొందినదనిన దాని ఘనతను అర్థము చేసుకొనవచ్చును. ప్రస్తుతము సంస్కృతములో గల ముఖ్య నీతి గ్రంథములు పంచతంత్రము, నారాయణభట్టు హితోపదేశం, బృహత్కథ, భేతాళ పంచవింశతి, బృహత్కథామంజరి, బోధిసత్త్వావధానము రాజతరంగిణి, విక్రమార్క చరిత్ర, శుకసప్తతి, భర్తృహరి, సుభాషిత త్రిశతిలే కాక ఇంకనూ వందలకొలది గ్రంథములు కొన్ని ముద్రితములుగనూ కొన్ని అముద్రితములుగనూ లభ్యమగుచున్నవి. వీనిలో ఎన్నో గ్రంథములు తిక్కన కాలము నుంచి నేటి వరకు తెలుగులోనికి పద్యకావ్యములుగా, వచన ద్విపద శతక కావ్యములుగాను అనువదింపబడినవి. వాటి అన్నింటిని గూర్చి వివరముగా తెల్పుటకు ఇది సందర్భము కాదు.

ఈ సందర్భమున మరియొక ముఖ్య విషయమును పాఠకులకు తెలుపవలసిన కర్తవ్యము కలదు. తిక్కన తెలుగు భారతమున ఉద్యోగపర్వములో కేవలము ఒకటి రెండు పద్యములలోనే విదురనీతిని గురించి చెప్పుటచే విదురనీతి ప్రాముఖ్యత గుర్తించిన కీర్తిశేషులు శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు మొత్తము విదురనీతి గ్రంథమును పద్యకావ్యముగా రచించి 1902 వ సం॥లోనే మూడు ఆశ్వాసాలు గ్రంథంగా ప్రకటించిరి.

ఈ విదురనీతిని చదివి అందలి నీతిని గ్రహించి తమ తమ జీవితములను సార్థకవంతములుగా చేసుకొందురని మా ఆకాంక్ష.



ఓం శ్రీ గణేశాయ నమః        శ్రీః        ఓం నమశ్శివాయ

వేదవ్యాసాయనమః

# విదురనీతి

**శ్రీ వేదవ్యాస మహర్షి ప్రణీతమైన శ్రీమన్మహాభారతంలోని ఉద్యోగపర్వం 33వ అధ్యాయం నుంచి స్వీకరించబడినది...**

✣ ✣ ✣

**ద్వాఃస్థం ప్రాహ మహాప్రాజ్ఞో ధృతరాష్ట్రో మహీపతిః**
**విదురం ద్రష్టుమిచ్ఛామి తమిహానయ మాచిరమ్** 1

వైశంపాయనుడు జనమేజయ మహారాజుతో తదుపరి వృత్తాంతం తెలియజేస్తూ

మహాప్రాజ్ఞుడైన ధృతరాష్ట్ర మహారాజు ద్వారం వద్ద నిలిచి ఉన్న సేవకునితో "నేను విదురుని చూడాలనుకొంటున్నాను. వెంటనే ఆయనను పిలుచుకొని రావలసినది" అని చెప్పాడు.

**ప్రహితో ధృతరాష్ట్రేణ దూతః క్షత్తారమబ్రవీత్**
**ఈశ్వరస్త్వాం మహారాజో మహాప్రాజ్ఞ దిదృక్షతి** 2

ధృతరాష్ట్రునిచే పంపబడిన ఆ దూత విదురునితో "మహాప్రాజ్ఞా! మన మహారాజు మిమ్ములను చూడాలనుకొంటున్నాడు' అని చెప్పాడు.

**ఏవముక్తస్తు విదురః ప్రాప్యరాజనివేశనమ్**
**అబ్రవీద్ధృతరాష్ట్రాయ ద్వాఃస్థ మాం ప్రతివేదయ** 3

ఆ విధంగా ద్వారపాలకుడు చెప్పగానే, విదురుడు రాజభవనానికి చేరుకొని, "ద్వారపాలకా! నేను వచ్చిన విషయాన్ని ధృతరాష్ట్రునికి తెలియజేయి' అని పలికాడు.

**విదురో ౽యమనుప్రాప్తో రాజేంద్ర తవ శాసనాత్**
**ద్రష్టుమిచ్ఛతి తే పాదౌ కిం కరోతు ప్రశాధి మామ్** 4

పిమ్మట ఆ ద్వారపాలకుడు ధృతరాష్ట్రుని వద్దకు పోయి ఆయనతో "రాజేంద్రా! మీ ఆజ్ఞప్రకారము విదురుడు ఇక్కడకు చేరుకొని ఉన్నాడు. ఆయన మీ పాదాలను దర్శించుకోవాలనుకొంటున్నాడు. అందుకు ఏమి చేయవలయునో నాకు ఆజ్ఞ ఇవ్వండి" అని విన్నవించాడు.

**ప్రవేశయ మహాప్రాజ్ఞం విదురం దీర్ఘదర్శినమ్**
**అహం హి విదురస్యాస్య నాకాల్యో జాతు దర్శనే** **5**

అనంతరం ధృతరాష్ట్రుడు "మహాప్రాజ్ఞుడు అనగా గొప్ప జ్ఞానం కలవాడు, ముందు చూపు కలవాడైన విదురుని వెంటనే ప్రవేశపెట్టు. నేను విదురుని చూడటానికి ఎన్నడూ కాదనను సంసిద్ధుని కాకుండా ఉండను" అని చెప్పాడు.

**ప్రవిశాన్తః పురం క్షత్తర్మహారాజస్య ధీమతః**
**న హి తే దర్శనేఽకాల్యో జాతు రాజా బ్రవీతి మామ్** **6**

వెంటనే ఆ ద్వారపాలకుడు బయటకుపోయి విదురునితో "విదురా! మహా బుద్ధిశాలియైన ధృతరాష్ట్ర మహారాజు అంతఃపురంలోనికి వెంటనే ప్రవేశించు. నిన్ను చూడటానికి ఎన్నడూ అడ్డం చెప్పనని రాజు నాతో అన్నాడు" అని తెలియజేశాడు.

**తతః ప్రవిశ్య విదురో ధృతరాష్ట్ర నివేశనమ్**
**అబ్రవీత్ప్రాంజ్జ నిర్వాక్యం చిన్తయానం నరాధిపమ్** **7**

తరువాత వృత్తాంతాన్ని తెలుపుతూ వైశంపాయనుడు, ఈ విధంగా తెల్పాడు. ధృతరాష్ట్రుని అంతఃపురంలోనికి ప్రవేశించిన విదురుడు చేతులు జోడించి అప్పటి వరకును ఆలోచనలలో నిమగ్నుడై ఉన్న ధృతరాష్ట్రునితో

**విదురోఽహం మహాప్రాజ్ఞ సమ్ప్రాప్తస్తవ శాసనాత్**
**యది కిం చన కర్తవ్యమయమస్మి ప్రశాధి మామ్** **8**

"మహారాజా! నేను విదురుడను. మీరు ఆజ్ఞాపించగా ఇచ్చటకు వచ్చి చేరుకున్నాను. నా కర్తవ్యం ఏమిటో ఆజ్ఞాపించు. నిర్వర్తించటానికి సిద్ధంగా ఉన్నాను" అని చెప్పాడు.

**సంజయో విదుర ప్రాప్తో గర్హయిత్వా చ మాం గతః**
**అజాతశత్రోః శ్వో వాక్యం సభామధ్యే స వక్ష్యతి** **9**
**తస్యాద్య కురువీరస్య న విజ్ఞాతం వచో మయా**
**తన్మే దహతి గాత్రాణి తదకార్షీత్ప్రజాగరమ్** **10**

**జాగ్రతో దహ్యమానస్య శ్రేయో యదిహ పశ్యసి**
**తద్బ్రూహి త్వం హి నస్తాత ధర్మార్థకుశలో హ్యసి** 11

**యతః ప్రాప్తః సంజయః పాండవేభ్యో**
**న మే యథావన్మనసః ప్రశాంతిః**
**సర్వేంద్రియాణ్యప్రకృతిం గతాని**
**కిం వక్ష్యతీత్యేవ హి మేఽద్య చింతా** 12

**తన్మే బ్రూహి విదుర త్వం యథావన్ మనీషితం సర్వమజాతశత్రోః**
**యథా చ నస్తాత హితం భవేచ్చ ప్రజాశ్చ సర్వాః సుఖితాః భవేయుః** 13

విదురుని చూచిన ధృతరాష్ట్రుడు "విదురా! బుద్ధిశాలి అయిన సంజయుడు తిరిగి వచ్చి నన్ను నిందించి వెళ్ళిపోయినాడు. అతడు రేపు సభలో అజాతశత్రుడగు ధర్మరాజు చెప్పిన మాటలను చెప్పునట. కురువీరుడైన ఆ ధర్మరాజు మాటలు ఏమియో ఇప్పటికీ నాకు తెలియటం లేదు. అది నా శరీరాన్ని కాల్చివేస్తున్నది. నాకు నిద్ర పట్టనీయటం లేదు. నాయనా! నీవు ధర్మార్ధ విషయాలలో నిపుణుడవు. నిద్రపట్టక తపిస్తున్న నాకు మేలు కలిగించే దానిని తెలియజేయి. సంజయుడు పాండవుల దగ్గర నుండి వచ్చినప్పటి నుండి నా మనస్సునకు మునుపటి ప్రశాంతతలేదు. అన్ని ఇంద్రియాలు సరిగా పనిచేయటం లేదు. ఆ సంజయుడు ఏమి చెప్పగలడో అని నాకిప్పుడు ఎంతో చింతగా ఉన్నది. అందువలన విదురా! నీవు నిద్రలేక దహింపబడుచున్న ఒక వ్యక్తికి ఏది మంచి చేస్తుందో ఆ విషయం నాకు తెలియజేయి" అని అడిగాడు.

**అభియుక్తం బలవతా దుర్బలం హీనసాధనమ్**
**హృతస్వం కామినం చోరమావిశన్తి ప్రజాగరాః**

**కచ్చిదేతైర్మహాదోషైర్న స్పృష్టోఽసి నరాధిప**
**కచ్చిన్న పరవిత్తేషు గృధ్యన్నిపరితప్యసే** 14

ధృతరాష్ట్రునితో విదురుడు "బలవంతుడు పైన పడుతున్న బలహీనునికి, తన సొమ్మును అంతటిని పోగొట్టుకొన్న వానికి, కాముకుడైన వానికి, దొంగకు నిద్ర పట్టదు. అందువలన రాజా! నీవు ఈ తప్పులలో దేనినీ చేయలేదు కదా! ఇతరుల సొమ్ముకు నీవు ఆశపడటం లేదు కదా !" అని అన్నాడు.

**శ్రోతుమిచ్ఛామి తే ధర్మ్యం పరం నైఃశ్రేయసం వచః**
**అస్మిన్రాజర్షివంశే హి త్వమేకః ప్రాజ్ఞసంమతః** **15**

మరల ధృతరాష్ట్రుడు "నేను ధర్మబద్ధమై, ఉత్తమశుభాన్ని కలిగించే నీ మాటలను వినాలనుకొంటున్నాను. ఈ రాజర్షి వంశంలో నీవు ఒక్కడవే జ్ఞానుల (పండితుల) మన్నన పొందినవాడవు" అని పల్కాడు.

**రాజా లక్షణసంపన్నస్త్రైలోక్యస్యాధిపో భవేత్**
**ప్రేష్యస్తే ప్రేషితశ్చైవ ధృతరాష్ట్ర యుధిష్ఠిరః**

తిరిగి విదురుడు "రాజా! మంచి లక్షణాలుగల యుధిష్ఠిరమహారాజు మూడు లోకాలకు ప్రభువు కాదగినవాడు. నీ ఆదేశాలను పాటించేవాడు. కానీ, అలాంటివాడిని అడవులకు పంపావు.

**విపరీత తరశ్చ త్వం భాగధేయే న సంమతః**
**అర్చిషాం ప్రక్షయాచ్చైవ ధర్మాత్మా ధర్మకోవిదః**

నీవు ధర్మాత్ముడవు. ధర్మతత్త్వం తెలిసినవాడవు. కానీ నీవు కంటిచూపు లేనందువలన ఆ ధర్మజుని విషయంలో గుర్తింప లేక ఎంతో విపరీతంగా ప్రవర్తించావు. రాజ్యభాగం ఇవ్వటానికి అంగీకరించలేదు.

**ఆనృశంస్యాదనుక్రోశాద్ధర్మాసత్యా త్పరాక్రమాత్**
**గురుత్వాత్త్వయి సంప్రేక్ష్య బహూన్క్లేశాంస్థితిక్షతే**

ఎటువంటి వైరభావం లేకపోవటం, దయ, ధర్మం, సత్యం, పరాక్రమం కలిగి ఉన్నప్పటికీ, నీ పెద్దరికం యెడ గల భక్తి చేత ఆ ధర్మరాజు చాలా క్లేశాలను ఓర్చు కొంటున్నాడు.

**దుర్యోధనే సౌబలే చ కర్ణే దుఃశాసనే తథా**
**ఏతేష్వైశ్వర్యమాధాయ కథం త్వం భూతిమిచ్ఛసి**

దుర్యోధనుడు, సౌబలుడైన శకుని, కర్ణుడు, దుశ్శాసనులపై రాజ్యభారాన్ని ఉంచి, ఇంకా మంచి కలగాలని నీవు ఏ విధంగా అనుకొంటున్నావు?

**ఆత్మజ్ఞానం సమారంభస్తితిక్షా ధర్మనిత్యతా**
**యమర్థాన్నాపకర్షన్తి స వై పండిత ఉచ్యతే**

ఆత్మజ్ఞానము, ప్రయత్నము, దుఃఖాలను ఓర్చుకొనగలిగిన శక్తి, ధర్మానికే ఎల్లవేళలా కట్టుబడి ఉండటం అనేవి ఎవనిని పురుషార్థం నుండి మరలించవో అతడే పండితుడు (జ్ఞాని)

**నిషేవతే ప్రశస్తాని నిన్దితాని నసేవతే**
**అనాస్తికః శ్రద్ధధాన ఏతత్పండిత లక్షణమ్ 16**

మంచిపనులు చేయటం, నిందింపదగిన పనులను చేయకుండా ఉండటం, నాస్తికుడు కాకపోవటం, చేసే పనుల యెడ శ్రద్ధ కలిగి ఉండటం అనేవి పండితుని లేక జ్ఞాని యొక్క లక్షణాలు.

**క్రోధో హర్షశ్చ దర్పశ్చ హ్రీస్తంభో మాన్య మానితా**
**యమర్థాన్నాపకర్షన్తి స వై పండిత ఉచ్యతే 17**

కోపము, అధికమైన సంతోషము, గర్వము, సిగ్గు, బిడియం లేక బిగుసుకొని పోవటం, తనకు తానే పూజ్యుడను అనుకోటం అనే ఈ లక్షణాలు ఎవనిని పురుషార్థం నుంచి దూరం చేయవో, అతడే పండితుడు (జ్ఞాని) అనబడతాడు.

**యస్య కృత్యం న జానన్తి మన్త్రం మన్త్రితం పరే**
**కృతమేవాస్య జానన్తి స వై పండిత ఉచ్యతే 18**

ఎవడు చేయాలనుకొన్న పనిని ఆలోచనను ఇతరులు తెలుసుకొనలేకుండా, అతడు చేసిన పనిని మాత్రమే తెలుసుకొనగలుగునట్లు చేయగలడో అతడే పండితుడు (జ్ఞాని) అని చెప్పబడతాడు.

**యస్య కృత్యం న విఘ్నంతి శీతముష్ణం భయం రతిః**
**సమృద్ధిరసమృద్ధిర్వా స వై పండిత ఉచ్యతే 19**

ఎవడు చేయబోయే పనిని శీతము (చలి), ఉష్ణము (వేడి), భయము, రాగము (అభిమానం) కలిమి, లేమి అనేవి ఆటంకపరచలేవో, అతడే పండితుడు (జ్ఞాని) అని చెప్పబడతాడు.

**యస్య సంసారిణీ ప్రజ్ఞా ధర్మార్థావనువర్తతే**
**కామాదర్థం వృణీతే యః స వై పండిత ఉచ్యతే 20**

ఎవని ప్రసరించే బుద్ధి ధర్మార్థాలను అనుసరించి ఉంటుందో, శారీరక సుఖానుభవం కన్నా పురుషార్థాన్నే ఎవడు కోరుకుంటాడో అతడే పండితుడు (జ్ఞాని) అనబడతాడు.

**యథాశక్తి చికీర్షన్తి యథాశక్తి చ కుర్వతే**
**న కించిదవమన్యన్తే పండితా భరతర్షభ** **21**

భరత వంశీకుడా! ధృతరాష్ట్ర మహారాజా! వివేకంతో పరిణితి చెందిన బుద్ధిగల ఏ మానవుడు తన శక్తిని అనుసరించి పనులను చేయాలని అనుకొంటాడో, తన శక్తికి తగినట్లుగా చేస్తాడో, దేనిని చులకనగా భావించడో, అటువంటి మనుష్యుడే పండితుడు (జ్ఞాని),

**క్షిప్రం విజానాతి ఛిరంశ్రుణోతి, విజ్ఞాయ చార్థం భజతేన కామాత్**
**నా సంపృష్టో వ్యైపయుంక్తే పరార్థే, తత్రప్రజ్ఞానం ప్రథమం పండితస్య** **22**

ఏ విషయమును అయినా సులభంగా వెంటనే అర్థం చేసుకొనేవాడు, ఎంతసేపైనా చెప్పిన విషయాన్ని ఓర్పుతో వినేవాడు ప్రయోజనాన్ని కోరికతో కాక చక్కగా గమనించి పొందగోరేవాడు, ఇతరులు తనను అడుగనిదే ఇతరుల విషయాలు మాట్లాడనివాడు – అట్టివాని బుద్ధియే పండితునికి ప్రథమ (గుర్తు) చిహ్నం.

**నాప్రాప్యమభివాంఛంతి నష్టం నేచ్ఛన్తి శోచితుమ్**
**ఆపత్సు చ న ముహ్యంతి నరాః పండిత బుద్ధయః** **23**

పండిత (జ్ఞాన) బుద్ధిగల మానవుడు సాధ్యంకాని లక్ష్యాలను సాధించాలని కోరుకొనడు, పోయినవాని కోసం, పోగొట్టుకొనబడిన వాని కోసం దుఃఖించడు. ఆపదలలో చిక్కుకొన్నప్పుడు కంగారుచెందడు.

**నిశ్చింత్య యః ప్రక్రమతే నాన్తర్వసతి కర్మణః**
**అవంధ్య కాలో వశ్యాత్మా స వై పండిత ఉచ్యతే** **24**

తాను సాధించగలనని నిశ్చయించుకొనిన పనికి పూనుకొని, ఆ పని పూర్తి కావటానికి శ్రమిస్తూ అది పూర్తి అయ్యేంత వరకు విశ్రమించనివాడు, సమయాన్ని వృథా కానీయనివాడు, తన మనసును అదుపులో ఉంచుకొనువాడే పండితుడు (జ్ఞాని) అని చెప్పబడతాడు.

**ఆర్యకర్మణి రాజ్యన్తే భూతికర్మాణి కుర్వతే**
**హితం చ నాభ్యసూయన్తి పండితా భరతర్షభ** **25**

భరతవంశోత్తమా! శుభకర్మల యెడల ఆసక్తి కలిగిఉండేవాడు, సంపదలను ఇచ్చే పనులు చేసేవాడు, మంచి చేసేవారిని తప్పు పట్టనివాడు పండితుడు (జ్ఞాని అని చెప్పబడతాడు.

**న హృష్యత్యాత్మసంమానే, నావమానేన తప్యతే**
**గాంగో హ్రద ఇవాక్షోభ్యో యః స పండిత ఉచ్యతే** **26**

తనను సత్కరించినప్పుడు పొంగిపోనివాడు, అవమానం కలిగినప్పుడు క్రుంగి పోనివాడు, గంగమడుగు వలె నిశ్చలంగా ఉన్నవాడే పండితుడు (జ్ఞాని) అని చెప్పబడతాడు.

**తత్త్వజ్ఞః సర్వభూతానాం యోగజ్ఞః సర్వకర్మణామ్**
**ఉపాయజ్ఞో మనుష్యాణాం నరః పండిత ఉచ్యతే** **27**

సర్వభూతముల యదార్థస్థితిని తెలిసినవాడు అనగా ప్రతిదీనశించిపోవునదే అని గ్రహించినవాడు, సర్వకార్యములను చేయుటను గురించిన విషయములు తెలిసినవాడు, మనుష్యులు తమ లక్ష్యములను సాధించుకొనటానికి చేసే లేక అవలంబించే సర్వవిధములైన విషయాలను గ్రహించగలిగినవాడే పండితుడు లేక జ్ఞాని అనబడతాడు.

**ప్రవృత్త వాక్చిత్రకథ ఊహవాన్ప్రతిభానవాన్**
**ఆశు గ్రంథస్య వక్తా చ స వై పండిత ఉచ్యతే** **28**

అనేక విషయాలను గురించి అనర్గళంగా మాట్లాడగల్గినవాడు, జనులలో ప్రచారంలో ఉన్న వృత్తాంతాలను తెలిసిఉండి, సమయస్ఫూర్తితో, ఊహతో మాట్లాడగల్గి, అప్పటి కప్పుడు ఏ గ్రంథాన్నైనా చెప్పగల్గి, గ్రంథాలలో చెప్పబడిన విషయాలను అన్వయించ గల్గిన ప్రజ్ఞగలవాడు (జ్ఞాని) పండితుడు అనబడతాడు.

**శ్రుతం ప్రజ్ఞానుగం యస్య ప్రజ్ఞా చైవ శ్రుతానుగా**
**అసంభిన్నార్థ మర్యాదః పండితాఖ్యాం లభేత సః** **29**

ఎవని శాస్త్రజ్ఞానము బుద్ధిని అనుసరించియు, బుద్ధిగా శాస్త్రజ్ఞానాన్ని అనుసరిస్తూ ఉంటుందో, ఎవడు ఎన్నడును పెద్దల వాక్యాన్ని మీరక వారికి గౌరవం ఇస్తాడో, అతడినే పండితుడు (జ్ఞాని) అని అంటారు.

**అశ్రుతశ్చ సమున్నద్ధో దరిద్రశ్చ మహామనాః**
**అర్థాంశ్చాకర్మణా ప్రేప్సుర్మూఢ ఇత్యుచ్యతే బుధైః** **30**

ఎట్టి విద్య లేక శాస్త్రజ్ఞానం లేకుండా, మిడిసిపడేవాడు, తాను దరిద్రుడై ఉండి కూడా సాధింపరాని కోరికలు గలవాడు. తాను ఎటువంటి కృషి, కష్టము చేయకుండా ధనాన్ని పొందాలనుకొనేవాడు మూర్ఖుడు అనబడతాడు.

**స్వమర్థం యః పరిత్యజ్య పరార్థమనుతిష్ఠతి**
**మిథ్యా చరతి మితార్థే యశ్చమూఢః స ఉచ్యతే 31**

తనకు సంబంధించిన పనిని పట్టించుకొనకుండా అశ్రద్ధచేసి ఇతరుల పనుల యెడ శ్రద్ధతో ఉండేవాడు తన స్నేహితుల పనులను సాధించుటలో మోసపూరిత విధానాలు అవలంబించేవాడు, అనగా స్నేహితుడిని మోసగించేవాడు మూఢుడు అనబడతాడు.

**అకామాం కామయతి యః కామయానాం పరిత్యజేత్**
**బలవంతం చ యో ద్వేష్టి తమాహుర్మూఢ చేతసమ్ 32**

కోరదగని వానిని తనకు కావలయునని కోరుకొనేవాడు, తనకు సహజంగా పొందగల్గినవానిని నిరాకరించటం చేసేవాడు. తనకంటె బలవంతుడైన వారితో విరోధం తెచ్చుకొనేవాడు మూర్ఖుడు అనబడతాడు.

**అమిత్రం కురుతే మిత్రం మిత్రం ద్వేష్టి హినాస్తి చ**
**కర్మ చారభతే దుష్టం తమాహుర్మూఢచేతసమ్ 33**

తనను ఇష్టపడనివారిని ఇష్టపడే అనగా తన శత్రువులను మిత్రులుగా భావించేవాడు, తనను ఇష్టపడేవారిని అనగా తన మిత్రులను శత్రువులుగా భావించి దూరం చేసుకొనేవాడు, దుర్మార్గాలైన పనులను ఆచరించేవాడు మూఢుడు అనబడతాడు.

**సంసారయతి కృత్యాని సర్వత్ర విచికిత్సతే**
**చిరం కరోతి క్షిప్రార్థే స మూఢో భరతర్షభ 34**

భరతవంశపుంగవా! తన పనులను ఇతరులకు అప్పగించేవాడు, ప్రతి విషయంలోను సందేహపడేవాడు, కొద్దికాలంలోనే పూర్తి కావలసిన పనులను సాగదీసి, ఆలశ్యంగా చేసేవాడు మూఢుడు అని పిలువబడుతాడు.

**శ్రాద్ధం పితృభ్యో న దదాతి దైవతాని నార్చతి**
**సుహృన్మిత్రం నలభతే తమాహుర్మూఢచేతసమ్**

తన పితరులకు శ్రాద్ధకర్మచేయనివాడు, దేవతలను పూజించనివాడు, మంచి హృదయం గల మిత్రుని పొందలేని వాడు మూఢుడు అని చెప్పబడతాడు.

**అనాహూతః ప్రవిశతి అపృష్టో బహు భాషతే**
**విశ్వసత్యప్రమత్తేషు మూఢ చేతా నరాధమః 35**

పిలవకుండానే లోపలికి ప్రవేశించేవాడు, అడగకుండానే ఎక్కువగా అనవసరంగా మాట్లాడేవాడు, నమ్మతగని వారిని నమ్మేవాడు అయిన అధముడైన మనుష్యుని మూర్ఖబుద్ధి అని పిలుస్తారు.

**పరం క్షిపతి దోషేణ వర్తమానః స్వయంతథా**
**యశ్చ క్రుధ్యత్యనీశః సన్స చ మూఢతమో నరః 36**

తాను తప్పు చేస్తూనే, ఆ తప్పును ఇతరులలో ఎత్తి చూపేవాడు. అసమర్థుడు అయి కూడా కోపాన్ని ప్రదర్శించేవాడు అయిన నరుడు మూర్ఖులలో పెద్ద మూర్ఖుడు అన బడతాడు.

**ఆత్మనో బలమజ్ఞాయ ధర్మార్థపరివర్జితమ్**
**అలభ్యమిచ్ఛన్నైష్కర్మ్యాన్మూఢ బుద్ధిరిహోచ్యతే 37**

తనకు గల బలమెంతో తెలిసికొనకుండా ఉండేవాడు, ధర్మార్థాలకు విరుద్ధమైనదానిని కోరుకొనేవాడు, పనిచేయకనే దుర్లభమైన దానిని కోరుకొనేవాడు ఈ లోకంలో మూర్ఖుడు అని చెప్పబడతాడు.

**అశిష్యం శాస్తి యో రాజాన్యశ్చ శూన్యముపాసతే**
**కదర్థం భజతే యశ్చ తమాహుర్మూఢ చేతసమ్ 38**

రాజా! ఏ నరుడు శిక్షించతగని వానిని శిక్షిస్తాడో, లేక అర్హత లేనివానికి బోధిస్తాడో, వారికి తెలియకుండానే ప్రార్థనచేయునో, దరిద్రుని సేవించునో, లోభిని పట్టుకొని వ్రేలాడేవానిని మూఢబుద్ధి అంటారు.

**అర్థం మహాన్తమాసాద్య విద్యామైశ్వర్యమేవ వా**
**విచరత్యసమున్నద్ధో యః స పణ్డిత ఉచ్యతే 39**

విస్తారంగా ధనం సంపాదించి, సంపదను, అఖండమైన విద్యకు సముపార్జించినను తనను తాను అధికునిగా భావించక, గర్వపడక ఉండు మనుష్యుడే పండితుడు (జ్ఞాని) అని చెప్పబడుతున్నాడు.

**ఏకః సంపన్న మశ్నాతి వస్తే వాసశ్చ శోభనమ్**
**యో ఽసంవిభజ్య భృత్యేభ్యః కో నృశంసతరస్తతః 40**

ఒక నరుడు విస్తారమైన సంపద కలిగి ఉండి కూడా, తాను పోషించవలసిన వారికి పోషణ కల్పించకుండా, తాను ఒక్కడు భోజనం చేస్తూ, తానే అందమైన వస్త్రాలను

ధరిస్తూ, తనను ఆశ్రయించిఉన్న వారికి పోషణ కల్పించకుండా, తాను ఒక్కడు భోజనం చేస్తూ, తానే అందమైన వస్త్రాలను ధరిస్తూ, తనను ఆశ్రయించిఉన్నవారికి ఏమీ విదపక ఊరకఉండే వానికన్నా గొప్ప క్రూరుడు ఎవడూ కాదు.

**ఏకః పాపాని కురుతే ఫలం భుంక్తే మహాజనః**
**భోక్తారో విప్రముచ్యంతే కర్తా దోషేణ లిప్యతే** **41**

ఒక వ్యక్తి పాపాలు చేయగా, దాని ఫలాన్ని అనేకులు అనుభవిస్తారు. అయినా చివరకు పాపాలు చేసినవాడే ఆ పాపం వలన కలిగే దోషం అంటి పెట్టుకొని ఉంటుండగా, ఆతడు చేసిన పాపాకర్మల ఫలాన్ని అనుభవించిన వారు మాత్రం పాపం నుంచి విడుదల అవుతారు.

**ఏకం హన్యాన్న వాహన్యాదిషుర్ముక్తో ధనుష్మతా**
**బుద్ధిర్బుద్ధిమతోత్సృష్టా హన్యాద్రాష్ట్రం సరాజకమ్** **42**

ఒక విలుకాడు బాణం వేయగా, అది కనీసం ఒక్క మనుష్యుని అయినా చంపుతుందో చంపదో కాని, ఒక మేధోవంతుడు (బుద్ధిశాలి) తన మేధతో ప్రయోగించిన బుద్ధి (రాజనీతి) రాజుతో పాటు, రాజ్యాన్ని లేక దేశాన్ని కూడా నాశనం చేస్తుంది.

**ఏకయా ద్వే వినిశ్చిత్యా త్రీంశ్చతుర్భిర్వశే కురు**
**పంచ జిత్వా విదిత్వా షట్సప్త హిత్వా సుఖీభవ** **43**

ఒకదానితో (అనగా బుద్ధితో) రెండు (చేయతగినది, చేయతగనిది)ను నిశ్చయించుకొని, ముగ్గురి (అనగా శత్రువు మిత్రుడు, తటస్థుడు)ని, నాల్గింటి (సామ, దాన భేద దండోపాయముల)తో మనసును అదుపులోనికి తెచ్చుకొని, ఐదింటి (జ్ఞానేంద్రియములు నాలుక, మాట, కన్ను, చెవి, ముక్కు, చర్మము)ని జయించి ఆరింటి (అనగా సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైధీభావ, సమాశ్రయములు)ని తెలుసుకొని, ఏడింటి (స్త్రీ, జూదం, వేట, మద్యపానం, పరుషంగా మాట్లాడటం, కఠినంగా దండించటం, ధనాన్ని చెడుగా ఖర్చు చేయటం)ని విడిచి సుఖం కలవాడివి కమ్ము.

**ఏకం విషరసో హంతి శస్త్రైణైకశ్చ వధ్యతే**
**సరాష్ట్రం స ప్రజం హంతి రాజానం మన్త్రవిస్రవః** **44**

విష పదార్థం ఒకడినే అంటే త్రాగిన వాడినే చంపుతుంది. అదేవిధంగా ఆయుధం ఒకడినే అనగా ఎవని మీద పడిన వానినే చంపుతుంది. కానీ రాజు–మంత్రుల

రహస్యాలోచన (మంత్రిమండలి నిర్ణయం) దేశము, దేశప్రజలతో సహా రాజును నశింపజేస్తుంది.

**ఏకః స్వాదు న భుంజీత ఏకశ్చార్థాన్న చింతయేత్**
**ఏకో న గచ్ఛేదధ్వానం నైకః సుప్తేషు జాగృయాత్ 45**

రుచి గల పదార్థాన్ని ఒక్కడే తినగూడదు. ఏదైనా ఒక విషయాన్ని గురించి ఒక్కడే నిశ్చయించకూడదు. ఒంటరిగా మార్గంలో ప్రయాణించకూడదు. అందరు నిద్రిస్తుండగా తానొక్కడే మేలుకొని ఉండకూడదు.

**ఏకమేవాద్వితీయం తద్యద్రాజన్నావబుధ్యసే**
**సత్యం స్వర్గస్య సోపానం పారావారస్య నౌరివ 46**

ఓ రాజా! సముద్రందాటటానికి నావ వలె సత్యమొక్కటే స్వర్గానికి సోపానం. రెండవది వేరు ఇతరం లేదు. దానిని నీవు తెలుసుకొనలేక ఉన్నావు.

**ఏకః క్షమావతాం దోషో ద్వితీయో నోపలభ్యతే**
**యదేనం క్షమయా యుక్తమశక్తం మన్యతే జనః 47**

ఓర్పు గల వారిని ప్రజలు చేతకానివాడు లేక బలహీనుడు అంటారు. ఓర్పు గలవారి విషయంలో ఇది ఒక్కటే తప్పు లేక లోపం. ఇక ఆ ఓర్పు గలవారిలో రెండవ తప్పే లభ్యం కాదు అనగా కనిపించదు.

**సోఽస్య దోషో న మంతవ్యః క్షమాహి పరమం బలమ్**
**క్షమా గుణో హ్యసక్తానాం శక్తానాం భూషణం తథా**

ఓర్పు గల వానిని ప్రజలు చేతకానివాడని అనే దోషం లెక్కలోనికి తీసుకొనరాదు. ఎందుకనగా క్షమయే గొప్ప బలం. అసమర్థులకు ఓర్పు అనేది సుగుణం (మంచిది). బలవంతులకు ఓర్పు అలంకారము.

**క్షమా వశీకృతిర్లోకే క్షమయా కిం న సాధ్యతే**
**శాంతి శంఖః కరే యస్య కిం కరిష్యతి దుర్జనః**

ఈ లోకంలో ఓర్పు అన్నింటిని వశం చేసుకుంటుంది. ఓర్పుతో సాధించలేనిది ఏమీ ఉండదు. చేతిలో శాంతి రూపమైన కత్తి ఉన్నవాడిని ఎట్టి దుర్మార్గుడైననూ ఏమీ చేయలేడు.

**అతృణే పతితో వహ్నిః స్వయమేవోపశామ్యతి**
**అక్షమావాన్పరం దోషైరాత్మానం చైవ యోజయేత్**

గడ్డి లేని నేలపై పడిన అగ్ని తనంత తానే చల్లారిపోతుంది. ఓర్పు లేనివాడు తననూ, ఇతరులను కూడా తప్పులతో జతపరుస్తాడు అనగా తానూ తప్పులు చేస్తాడు. ఇతరుల చేత చేయిస్తాడు.

**ఏకో ధర్మః పరం శ్రేయః క్షమైకా శాంతిరుత్తమా**
**విద్యైకా పరమా దృష్టిరహింసైకా సుఖావహా 48**

ధర్మం ఒక్కటే పరమశ్రేయస్సును కలిగిస్తుంది. ఓర్పు ఒక్కటే ఉత్తమమైన శాంతినిస్తుంది. విద్య ఒక్కటే అంతులేని తృప్తినిస్తుంది. అహింస ఒక్కటే సుఖాన్ని కలిగిస్తుంది.

**ద్వా విమౌ గ్రసతే భూమిః సర్పోబిలశయానివ**
**రాజానం చావిరోద్ధారం బ్రాహ్మణం చాప్రవాసినమ్ 49**

కన్నంలో (పుట్ట) ఉండే ప్రాణు (ఎలుక)లను పాములు మ్రింగివేస్తాయి. అదేవిధంగా శత్రువుపై పగ సాధించని రాజును, ఇతర దేశాల (ప్రాంతాల)లో పర్యటనచేయని బ్రాహ్మణుని ఈ భూమి మ్రింగివేస్తుంది. అనగా వారు పుట్టినచోటే ఎట్టి కీర్తిని పొందక నశించిపోతారు.

**ద్వేకర్మణీ నరః కుర్వన్నస్మింల్లోకే విరోచతే**
**అబ్రువన్పరుషం కిం చిదసతో నార్థయంస్తథా 50**

ఈ లోకంలో ఏ మాత్రం కఠినంగా మాట్లాడక పోవటం, అదే విధంగా చెడ్డవారిని సేవించకపోవటం అనే రెండింటినీ ఆచరించేవాడు ఎంతో ప్రకాశిస్తాడు.

**ద్వావిమౌ పురుష వ్యాఘ్ర పరప్రత్యయ కారిణౌ**
**స్త్రియః కామిత కామిన్యో లోకః పూజిత పూజకః 51**

పురుషశ్రేష్ఠా! ధృతరాష్ట్ర మహారాజ! ఇతర స్త్రీలు కోరిన పురుషుని కోరుకునే స్త్రీలు, ఇతరులు పూజించే వానిని పూజించే వ్యక్తి ఈ రెండు రకాలైన నరులు ఇతరుల నమ్మకాన్ని బట్టే నడచుకుంటారు. వారికి వారి స్వంత అభిప్రాయాలు ఉండవు.

**ద్వావిమౌ కంటకౌ తీక్షణౌ శరీరపరిశోషణౌ**
**యశ్చాధనః కామయతే యశ్చ కుప్యత్యనీశ్వరః 52**

ధనం లేకుండా కోరికలు కోరుకొనేవాడు, తనకు తగినంతగా శక్తి సామర్థ్యాలు లేకపోయినా, కోపం తెచ్చుకొనేవాడు, వీరు ఇద్దరు పదునైన ముళ్ళవలె తమ శరీరాలను తామే శుష్కింప చేసికొంటారు.

**ద్వావేవ న విరాజతే విపరీతేన కర్మణా**
**గృహస్థశ్చ నిరారంభః కార్యవాంశ్చైవ భిక్షుకః**

పనులను ఆరంభించని అనగా పనిచేయని గృహస్థుడును, పనులు చేయుచుండెడి భిక్షుకుడు లేక సన్యాసి, ఈ ఇద్దరూ కూడా తమ విపరీత ప్రవృత్తి చేత ప్రకాశించరు.

**ద్వావిమౌ పురుషౌ రాజాన్స్వర్గస్య పరి తిష్ఠతః**
**ప్రభుశ్చ క్షమయా యుక్తో దరద్రశ్చ ప్రదానవాన్ 53**

రాజా! శక్తివంతుడైయుండి కూడా ఓర్పు గలవాడు, దరిద్రుడైనను దానగుణం గలవాడు. అనే గుణాలు గల ఈ ఇద్దరు స్వర్గానికి పై స్థానంలో నిలుస్తారు.

**న్యాయాగతస్య ద్రవ్యస్య బోద్ధవ్యౌ ద్వావతిక్రమౌ**
**అపాత్రే ప్రతిపత్తిశ్చ పాత్రే చాప్రతిపాదనమ్ 54**

అనర్హునికి దానంగా ధనం ఇవ్వటం, అర్హుడైన వానికి దానం ఇవ్వకపోవటం అనే రెండు పనులు న్యాయంగా సంపాదించి కూడబెట్టిన ధనానికి రెండు విధాల చేటును తీసికొనివస్తాయి.

**ద్వావంభసి నివేష్టవ్యౌ గవే బద్ధ్వా దృఢం శిలామ్**
**ధనవంతమదాతారం దరిద్రం చాతపస్వినమ్**

ధనవంతుడై ఉండి దానం చేయనివానిని, పేదవాడై యుండి తపస్సు చేయని లేక గర్వపడు వానిని ఈ ఇద్దరిని మెడకు పెద్ద బండరాయిని గట్టి నీటిలోనికి త్రోసివేయవలెను.

**ద్వావిమౌ పురుషవ్యాఘ్రు సూర్యమండల భేదినౌ**
**పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖో హతః**

ఓ పురుషశ్రేష్ఠా! యోగమునందు విశిష్ఠుడైన సన్యాసి యుద్ధము చేయుచు శత్రువు కెదురొడ్డి పోరాడి యుద్ధరంగమున మరణించిన మూఢుడు. ఈ ఇద్దరును సూర్య మండలమును ఛేదించుకొని ఉత్తమగతులను పొందగల్గుదురు.

**త్రయో న్యాయామనుష్యాణం శ్రూయంతే భరతర్షభ**
**కనీయాన్మధ్యమః శ్రేష్ఠ ఇతివేదవిదో విదుః 55**

భరతర్షభ! పనులను సాధించటంలో ఉత్తమ, మధ్యమ, అధమములనే మూడు విధానాలు మనుష్యులకు ఉన్నాయని వేదవేత్తలు తెల్పుతున్నారు.

**త్రివిధాః పురుషా రాజాన్నుత్త మాధమ మధ్యమాః**
**నియోజయేద్యథావత్తాంస్త్రివిధేష్వేవ కర్మసు** 56

రాజా! మనుష్యులలో ఉత్తములు, మధ్యములు, అధములనే మూడు రకాలవారు ఉంటారు. అందువలన వారి వారి యోగ్యతలను అనుసరించి మూడు విధాలైన ఆయా పనులలోనే నియమించవలయును.

**త్రయ ఏవాధనా రాజన్భార్యా దాసస్తథా సుతః**
**యత్తే సమధిగచ్ఛన్తి యస్య తే తస్య తద్ధనమ్** 57

రాజా! భార్య, సేవకుడు, కుమారుడు ఈ ముగ్గురు ధనానికి అధికారం కలవారు కారు. వారు సంపాదించిన ధనం, ఎవరి అధికారంలో వారు ఉన్నారో వారికే చెందుతుంది.

**హరణం చ పరస్వానాం పరదారాభిమర్శనమ్**
**సుహృదశ్చ పరిత్యాగస్త్రయో దోషా క్షయావహాః**

ఇతరుల ధనాన్ని దొంగిలించటం, ఇతరుల భార్యలతో సంపర్కం పెట్టుకొనటం, మంచి మనసు గల స్నేహితులను వదలుకొనటం అనే ఈ మూడు దోషాలు మానవుని క్షీణింపచేస్తాయి.

**త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః**
**కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్**

కామం, క్రోధం, లోభం అనే మూడు నరక ద్వారాలు. అంతేగాక తనను నాశనం చేస్తాయి. అందువలన ఈ మూడింటిని వదలివేయాలి.

**వరప్రదానం రాజ్యంచ పుత్రజన్మచ భారత**
**శత్రోశ్చమోక్షణం కృచ్ఛ్రాత్రీణి చైకం చ తత్సమమ్**

భరత! ఇతరులకు వరమివ్వటం, రాజ్యాన్ని పాలించటం, కొడుకును పొందటం అనేవి మూడు తనకు శత్రువు అయినవాడిని కష్టం నుండి తప్పించటం అనేదానితో సమానమైనది. అనగా శత్రువును ఆపదనుండి తప్పించటం ఉత్కృష్టమైనది అని భావము.

**భక్తంచ భజమానంచచ తవాస్మీతి వాదినమ్**
**త్రీనేతాన్ శరణం ప్రాప్తాన్విషమేఽపి న సంత్యజేత్**

తనకు భక్తుడుగా ఉన్నవాడు, తనను సేవిస్తున్నవాడు, నేను నీ వాడను అంటూ దగ్గరకు చేరి, తన శరణుచేరిన ఈ ముగ్గురిని, తాను కష్టంలో ఉన్నప్పుడు కూడా విడువకూడదు.

**చత్వారి రాజ్ఞా తు మహాబలేన, వర్జ్యాన్యాహుః పండితస్తాని విద్యాత్**
**అల్పప్రజ్ఞైః సహమంత్రం న కుర్యాన్, న దీర్ఘసూత్రైరలసైశ్చారణైశ్చ 58**

ఎంత బలవంతుడైనవాడైనా రాజు తెలివితక్కువవారితోను, పనిని సాగదీసే వారితోను అనగా తరువాత చేయవచ్చునులే అని వాయిదా వేసే వారితోను, తొందరపాటుతో పనులు చేసే వారితోను, ఎప్పుడూ పొగుడుతూ ఉంటే స్తోత్ర పాఠకులతోను ఈ నాలుగు రకాల వారితోను రహస్య సమాలోచన చేయకూడదని పండితులైనవారు వారిని గుర్తించాలని తెల్పుతున్నారు.

**చత్వారితే తాత గృహే వసంతు, శ్రియాభిజుష్టస్య గృహస్థ ధర్మే**
**వృద్ధోజ్ఞాతి రవసన్నః కులీనః, సఖాదరిద్రో భగినీ చానపత్యా 59**

రాజా! సంపద కలిగిఉండి గృహస్థ ధర్మంలో ఉన్నవారు తమ ఇంటిలో వృద్ధుడైన దాయాది, కష్టాలలో ఉన్న ఉత్తమ వంశానికి చెందినవాడు, పేదరికంతో బాధపడుతున్న మిత్రుడు, సంతానం లేని సోదరి. ఈ నలుగురిని తనతో పాటు ఉంచుకొనవచ్చును.

**చత్వార్యాహ మహారాజ సద్యస్కాని బృహస్పతిః**
**పృచ్ఛతే త్రిదశేంద్రాయ తానీమాని నిబోధమే 60**

**దేవతానాంచ సంకల్పమను భావంచ ధీమతామ్**
**వినయం కృతవిద్యానాం వినాశం పాపకర్మణామ్ 61**

మహారాజా! దేవేంద్రుడు తమ దేవతల గురువైన బృహస్పతిని అప్పటికప్పుడు ఫలాన్ని ఇచ్చే నాలుగు విషయాలను తెలుపమనగా, ఆయన 1. దేవతల సంకల్పం 2. బుద్ధిమంతుల ప్రభావం. 3. విద్వాంసుల వినయము లేక అణకువ 4. పాపులైన వారి వినాశనము అనే నాల్గు సత్ఫలితం ఇస్తాయి అని తెలియజేశాడు.

**చత్వారి కర్మాణ్యభయంకరాణి**
**భయం ప్రయచ్ఛన్త్య యథాకృతాని**
**మానాగ్ని హోత్రం ఉత మానమౌనం**
**మానేనాధీతయుత మానయజ్ఞః**

నాలుగు పనులు భయాన్ని తొలగించివేస్తాయి. తగిన విధంగా ఆచరించకపోతే అవే భయాన్ని కలుగజేస్తాయి. అవి నాలుగు : ఆదరంతో అగ్నిని ఉపాసించటం, ఆదరంతో మౌనం పాటించటం, ఆదరంతో అధ్యయనం చేయటం ఆదరంతో యజ్ఞం చేయటం. ఇవే ఆర్భాటంతో, అనాదరంతో చేస్తే భయం కలిగిస్తాయి.

**పంచాగ్నయో మనుష్యేణ పరిచర్యా ప్రయత్నతః**
**పితా మాతాగ్నిరాత్మాచ గురుశ్చ భరతర్షభ** **62**

భరతవంశోత్తమ! తండ్రి, తల్లి, అగ్ని, ఆత్మ, గురువు అనే ఈ అయిదు అగ్నులను మానవుడు తగినంత ప్రయత్నంతో సేవించాలి.

**పంచైవ పూజయంల్లోకే యశః ప్రాప్నోతి కేవలమ్**
**దేవాన్పితౄన్మనుష్యాంశ్చ భిక్షూనతిథిపంచమాన్** **63**

దేవతలను, పితరులను, మనుష్యులను, సన్యాసులను, అతిథులను– ఈ అయిదుగురిని పూజిస్తే చాలు. మానవుడు ఈ లోకంలో కీర్తిని పొందుతాడు.

**పంచత్వామను గమిష్యంతి యత్ర యత్ర గమిష్యసి**
**మిత్రాణ్యమిత్రా మధ్యస్థా ఉపజీవ్యోపజీవినః** **64**

నీవు ఎచ్చటకు పోయినా అక్కడకు మిత్రులు, శత్రువులు, తటస్థంగాఉండేవారు. నీకు ఆశ్రయం ఇచ్చేవారు, నీ నుంచి ఆశ్రయం పొందేవారు అనే అయిదుగురు నీ వెనువెంటనే ఉండి నిన్ను అనుసరిస్తుంటారు.

**పంచేంద్రియస్య మర్త్యస్య ఛిద్రం చేదేకమింద్రియమ్**
**తతోఽస్య స్రవతి ప్రజ్ఞా దృతేః పాదాదివోదకమ్** **65**

అయిదు జ్ఞానేంద్రియాలు గల మానవునికి ఆ అయిదింటిలో ఏ ఒక్కటి పాడైనా, దాని వలన అతడి తెలివి అంతా తోలుతిత్తి నుండి కారే నీటి వలె కారిపోతుంది అనగా వ్యర్థం అయిపోతుంది.

**షడ్దోషాః పురుషేణేహ హాతవ్యా భూతిమిచ్ఛతా**
**నిద్రా తంద్రీ భయం క్రోధ ఆలస్యం దీర్ఘసూత్రతా** **66**

ఈ లోకంలో సంపదను కోరుకొనే వ్యక్తి నిద్ర, కునికిపాట్లు పడటం, భయం, కోపం, సోమరితనం, ప్రతి దానిని తరువాత చేయవచ్చులే అనే సాచివేతతనం అనే ఈ ఆరు దోషాలను విడచివేయాలి.

**షడిమాన్పురుషో జహ్యాద్భిన్నాం నావమివార్ణవే**
**అప్రవక్తారమాచార్యమనధీయానమృత్విజమ్** **67**

**అరక్షితారం రాజానం భార్యాంచాప్రియ వాదినీమ్**
**గ్రామకారం చ గోపాలం వనకామంచ వాపితమ్** **68**

పగిలిన నావను సముద్రంలో వదలివేసినట్లుగా బోధించని గురువును, మంత్రోచ్చారణ చేయని ఋత్విక్కును, ప్రజలనుకాపాడని రాజును, ప్రియంగా మాట్లాడని భార్యను, గ్రామంలో ఉండాలనుకొనే గోపాలకుని (పశువులను మేసేవానిని) అడవిలో ఉండగోరే మంగలిని – ఈ ఆరుగురుని మానవుడు విడిచిపెట్టివేయవలెను.

**షడేవ తు గుణాః పుంసాం న హాతవ్యాః కదాచన**
**సత్యం దానమనాలస్యమనసూయా క్షమాధృతిః 69**

మానవుడు నిజంచెప్పటం, దానంచేయటం, సోమరితనం లేకపోవటం, అసూయ లేకపోవటం, ఓర్పు, బుద్ధి చాంచల్యం లేకపోవటం అనే ఆరు గుణాలను ఎన్నడు విడిచిపెట్టకూడదు.

**అర్థాగమో నిత్యమరోగితా చ, ప్రియాచ భార్యా ప్రియవాదినీ చ**
**వశ్యశ్చ పుత్రోఽర్థకరీ చ విద్యా, షట్ జీవలోకస్య సుఖాని రాజన్**

రాజా! ధనలాభము, రోగం లేకపోవటం, అనుకూలవతియైన భార్య, ప్రియంగా మాట్లాడే భార్య, అదుపులో ఉండే కుమారుడు, ధనం ఇచ్చే విద్య – ఈ ఆరు ఈ మనుష్యలోకంలో సుఖాన్ని కల్గించేవి.

**షణ్ణామాత్మని నిత్యానామైశ్వర్యం యోఽధిగచ్ఛతి**
**న స పాపైః కుతోఽనర్థైర్యుజ్యతే విజితేంద్రియః 70**

మనస్సులో ఎల్లవేళల ఉండే ఆరింటిపై అనగా కామక్రోధ లోభమోహ మద మాత్సర్యాలపై అదుపుకలిగిన ఇంద్రియ నిగ్రహం అనే సంపద గలవాని దగ్గరకు పాపాలు కూడా చేరవు. ఇక పాపాల వలన కలిగే అనర్థాలు ఏ విధంగా కలుగుతాయి?

**షడిమేషట్సు జీవంతి సప్తమో నోపలభ్యతే**
**చోరాః ప్రమత్తే జీవంతి వ్యాధితేషు చికిత్సకాః 71**

**ప్రమదాః కామయానేషు యజమానేషు యాజకాః**
**రాజా వివదమానేషు నిత్యం మూర్ఖేషు పండితాః 72**

ఆరు విధములైన వారు ఉన్నందువలన ఆరు రకాల వ్యక్తులు బ్రతుకుతున్నారు. ఏడవ రకానికి చెందిన వాడే దొరకటం లేదు. ఏమరుపాటు కలిగినవాని వలన అనగా అజాగ్రత్తగా ఉండేవాని వలన దొంగలు, రోగుల వలన వైద్యులు, కామప్రవృత్తి గల వారి

వలన కామినులు, యజ్ఞకర్తలు అనగా యజ్ఞాలు చేయించే వారి వలన పురోహితులు, తగవులాడుకొనేవారి వలన రాజులు, మూర్ఖుల వలన పండితులు జీవిస్తున్నారు.

**షడిమాని వినశ్యంతి ముహూర్త మనవేక్షణాత్**
**గావః సేవా కృషిర్భార్యా విద్యా వృషలసంగతిః**

గోవులు, సేవకవృత్తి, వ్యవసాయము, భార్య, విద్య, అధర్మపరులతో కలయిక – అనే ఈ ఆరూ ముహూర్తకాలం పట్టించుకొనకుండా ఉంటే చాలు– నశించిపోతాయి.

**షడేతే హ్యవమన్యంతే నిత్యం పూర్వోపకారిణమ్**
**ఆచార్యం శిక్షితాశిష్యాః కృతదారశ్చ మాతరమ్**

**నారి విగతకామస్తు కృతార్థాశ్చ ప్రయోజకమ్**
**నావం నిస్తీర్ణకాంతారా నాతురాశ్చ చికిత్సకమ్**

చదువు పూర్తి చేసుకొనిన శిష్యులు గురువును, పెండ్లి అయిన కుమారులు తమ తల్లిని, కోరికలు తీర్చుకొనిన తరువాత స్త్రీని, పనిని సాధించుకొనినవారు అందుకు సహాయపడినవారిని, ఏరుదాటిన తరువాత నావను, వ్యాధినయం అయిన తరువాత వైద్యుడిని – ఈ ఆరుగురు ముందుగా తమకు ఉపకారం చేసినవారిని వదలివేస్తారు.

**ఆరోగ్యమానృణ్యమవిప్రవాసః సద్భిర్మనుష్యైః సహ సంప్రయోగః**
**స్వప్రత్యయా వృత్తిరభీత వాసః షట్ జీవలోకస్య సుఖాని రాజన్**

ఓ రాజా! రోగాలేమీ లేకుండా ఆరోగ్యంగా ఉండటం, అప్పులు లేకుండా ఉండటం, దేశం కాని దేశంలో అనగా పరదేశంలో నివసించక ఉండటం అనగా స్వదేశంలోనే నివాసం ఉండటం, ఉత్తములైన మనుష్యులతో కలసి ఉండటం, స్వతంత్రవృత్తితో జీవించటం, భయం లేకుండా జీవించటం, అనే ఈ ఆరు ఈ లోకంలో సుఖాన్ని ఇస్తాయి.

**ఈర్ష్యుర్ఘృణీ నసంతుష్టః క్రోధనో నిత్యశంకితః**
**పరభాగ్యోపజీవి చ షడేతే నిత్యదుఃఖితాః**

ఈర్ష్యావంతుడు అనగా ఈర్ష్య పడేవాడు, దీనుడు, తృప్తి లేనివాడు (సంతోషం లేనివాడు), ముక్కోపి, ఎల్లప్పుడు శంకిస్తూ (అనుమానపడుతూ) ఉండేవాడు – అనే ఈ ఆరుగురు ఎల్లప్పుడూ దుఃఖంతోటే ఉంటారు.

**సప్తదోషాః సదారాజ్ఞా హాతవ్యా వ్యసనోదయాః**
**ప్రాయశో యైర్వినశ్యన్తి కృతమూలాశ్చ పార్థివాః**

**స్త్రియోఽక్షా మృగయా పానం వాక్పారుష్యం చ పంచమమ్**
**మహచ్చ దండపారుష్యమర్థదూషణమేవ చ 74**

దుఃఖాలను కలిగించేవి అయిన స్త్రీలపై ఆసక్తి, జూదము, వేటాడటం, మద్యపానం కఠినంగా మాట్లాడటం, చాలా కఠినంగా శిక్షించటం, ధనాన్ని అనవసరంగా ఖర్చు చేయటం. అనే ఈ ఏడు దోషాలను రాజు విడిచిపెట్టవలెను. ఈ దోషాలు ఉండటం వలననే బాగా స్థిరపడిన రాజులు కూడా తరచుగా నశించిపోతారు.

**అష్టౌ పూర్వనిమిత్తాని నరస్య వినశిష్యతః**
**బ్రాహ్మణాన్ప్రథమం ద్వేష్టి బ్రాహ్మణైశ్చ విరుధ్యతే 75**

**బ్రాహ్మణ స్వాని చాదత్తే బ్రాహ్మణాంశ్చ జిఘాంసతి**
**రమతే నిందయా చైషాం ప్రశంసాం నాభినందతి 76**

**నైతాన్స్మరతి కృత్యేషు యాచితశ్చాభ్యసూయతి**
**ఏతాన్దోషాన్నరః ప్రాజ్ఞో బుద్ధ్యా బుద్ధ్వా వివర్జయేత్ 77**

నశించబోయే మానవునికి ముందుగా కనిపించే శకునాలవంటివి ఎనిమిది ఉన్నాయి. అవి. 1. మొదట బ్రాహ్మణులను ద్వేషించటం 2. బ్రాహ్మణులతో తగవుపడటం 3. బ్రాహ్మణుల సొమ్ము కాజేయటం, 4.బ్రాహ్మణులను చంపవలెననుకొనటం 5. బ్రాహ్మణులను నిందించటం చేత ఆనందించటం 6. బ్రాహ్మణుల ప్రశంసను మెచ్చుకొనలేకపోవటం, 7. యజ్ఞయాగాదులను స్మరించలేకపోవటం, 8. ఏదైనా యాచించినప్పుడు లేక వారు అడిగినప్పుడు వారిపై దోషారోపణ చేయటం. అందువలన బుద్ధిశాలి అయిన మానవుడు వీటిని దోషాలుగా గుర్తించి విడిచిపెట్టాలి.

**అష్టావిమాని హర్షస్య నవ నీతాని భారత**
**వర్తమానాని దృశ్యంతే తాన్యేవ సుసుఖాన్యపి 78**

**సమాగమశ్చ సఖిభిర్మహాంశ్చైవ ధనాగమః**
**పుత్రేణ చ పరిష్వంగః సన్నిపాతశ్చ మైథునే 79**

**సమయేచ ప్రియాలాపః స్వయూథేషు చ సంనతిః**
**అభిప్రేతస్య లాభశ్చ పూజా చ జనసంసది 80**

భారత! మిత్రులను కలుసుకొనటం, ధనలాభం కలగటం, కొడుకు యొక్క కౌగిలింత, రతిలో కలిగే సుఖం, సమయానికి తగినట్లుగా ప్రియంగా మాట్లాడటం, తనవారిలో

ఉన్నతస్థితి, కోరుకొన్న వస్తువు లభ్యం కావటం, జనసమూహంలో సత్కారం పొందటం. అనే ఈ ఎనిమిది మానవునికి సంతోషకారణాలు. అవియే తనకు సుఖాన్ని కలిగించేవి కూడా కాగలవు. అందువలన అవి తప్పక పొందతగినవి.

**అష్టౌ గుణాః పురుషం దీపయంతి ప్రజ్ఞా చ కౌల్యం చ దమః శ్రుతం చ**
**పరాక్రమశ్చ బహుభాషితా చ దానం యథాశక్తి కృతజ్ఞతా చ**

గొప్ప తెలివితేటలు కలిగిఉండటం, సత్కులంలో పుట్టటం, ఇంద్రియ నిగ్రహము, శాస్త్రములలో పాండిత్యము, పరాక్రమము, మితంగా మాట్లాడటం, చేసిన మేలు మరచిపోకపోవటం – అనే ఈ ఎనిమిది గుణాలు మానవుని కీర్తిని పెంపొందింపచేస్తాయి.

**నవద్వారమిదం వేశ్మ త్రిస్థూణం పంచసాక్షికమ్**
**క్షేత్రజ్ఞాధిష్టితం విద్వాన్యోవేద స పరః కవిః** 81

తొమ్మిది ద్వారాలు (తొమ్మిది రంధ్రాలు), మూడుస్తంభాలు (సత్త్వ, రజ, స్తమోగుణాలు మూడు), ఐదుగురు సాక్షులు (ఐదు జ్ఞానేంద్రియాలు) కల ఆత్మకు (అనగా క్షేత్రజ్ఞునికి) నివాసమైన ఈ శరీరరూపమైన ఇంటిని తెలుసుకొనిన వాడు గొప్ప జ్ఞాని.

**దశ ధర్మం న జానంతి ధృతరాష్ట్ర నిబోధ తాన్**
**మత్తః ప్రమత్త ఉన్మత్తః శ్రాంతఃక్రుద్ధో బుభుక్షితః** 82

**త్వరమాణశ్చ భీరుశ్చ లుబ్ధః కామీ చ తే దశ**
**తస్మాదేతేషు భావేషు న ప్రసజ్జేత పండితః** 83

ధృతరాష్ట్ర! మత్తెక్కినవాడు, జాగరూకత లేనివాడు, పిచ్చివాడు, అలసిపోయినవాడు, కోపంతో ఉన్నవాడు, ఆకలిగొన్నవాడు, తొందరపాటుకలవాడు, పిసినారి, భయస్థుడు, కాముకుడు. వీరు పదిమంది ధర్మాన్ని గుర్తించలేరు కాబట్టి పండితుడైనవాడు వీరితో కలువకూడదు.

**అత్రైవోదాహరంతీమమితిహాసం పురాతనమ్**
**పుత్రార్థమసురేంద్రేణ గీతం చైవ సుధన్వనా** 84

ఈ సందర్భంలో రాక్షసరాజు ప్రహ్లాదుడు సుధన్వునితో కలసి తన కొడుకు కొరకై చెప్పిన పురాతనమైన ఇతిహాసం ఒకదానిని ఉదాహరిస్తున్నాడు. దానిని వినుము.

**యః కామమన్యూ ప్రజహాతి రాజా పాత్రే ప్రతిష్ఠాపయతే ధనంచ**
**విశేషవిచ్ఛ్రుతవాన్ క్షిప్రకారీ తం సర్వలోకః కురుతే ప్రమాణమ్** 85

కామక్రోధాలను విడిచినరాజును, అర్హత కలవానికి ధనమిచ్చేవానిని, విశేషంగా తెలిసిన వానిని, శాస్త్రజ్ఞానం కల వానిని, కర్తవ్యాన్ని త్వరగా పూర్తి చేసేవానిని, లోకమంతా ప్రమాణంగా స్వీకరిస్తుంది.

**జానాతి విశ్వాసయితుం మనుష్యాన్ విజ్ఞాత దోషేషు దధాతి దండమ్**
**జానాతి మాత్రాం చ తథాక్షమాం చ తం తాదృశం శ్రీర్జుషతే సమగ్రా 86**

మనుష్యులను నమ్మించటం తెలిసినవానిని, నేరం రుజువైన వారికి తగిన శిక్ష విధించే వానిని, శిక్ష యొక్క స్థాయి తెలిసినవానిని, అట్లే ఓర్పును గురించి తెలిసినవానిని సమగ్రమైన సంపద చేరుకుంటుంది.

**సుదుర్బలం నావజానాతి కంచిద్యుక్తో రిపుం సేవతే బుద్ధిపూర్వమ్**
**న విగ్రహం రోచయతే బలస్థైః కాలేచ యో విక్రమతే స ధీరః 87**

బలహీనుని అవమానించనివాడు, నిరంతరం జాగ్రత్త కలవాడై బుద్ధిపూర్వకంగా శత్రువుతో వ్యవహరించేవాడు, తనకంటె బలవంతులతో విరోధం పెట్టుకొనక అవకాశం కోసం ఎదురుచూచేవాడు, సమయం వచ్చినప్పుడు తన పరాక్రమమును ప్రదర్శించేవాడు. ఇట్టివాడు ధీరుడు అనబడతాడు.

**ప్రాప్యాపదం న వ్యథతే కదా చిదుద్యోగమన్విచ్ఛతి చాప్రమత్తః**
**దుఃఖం చ కాలే సహతే జితాత్మా దురంధరస్తస్య జితాః సపత్నాః 88**

కార్యభారం గల మహాత్ముడు ఆపదలో చిక్కుకున్నప్పుడు కూడా ఏ మాత్రం బాధపడక, జాగరూకుడై, కార్యసాధనకై ప్రయత్నం చేస్తాడు. సమయాన్ని అనుసరించి దుఃఖాన్ని అదుపులో ఉంచుకుంటాడు. అట్టివాడు తప్పక శత్రువులను జయించి తీరుతాడు.

**అనర్థకం విప్రవాసం గృహేభ్యః పాపైః సంధిం పరదారాభిమర్శమ్**
**దంభం స్తైన్యం పైశునం మద్యపానం న సేవతే యః స సుఖీ సదైవ 89**

ఇల్లు విడిచి ప్రయోజనం లేకుండా విదేశాలలో నివసించటం, పాపులతో కలవటము, పరస్త్రీల పొందు కలిగి ఉండటం, డాంబికత (దంభం), దొంగతనం, లోభిత్వం (లేక) పిసినారితనం, మద్యపానం చేయటం- అనే వీనికి లోబడని మనుష్యుడు ఎల్లప్పుడూ సుఖపడేవాడే కాగలడు.

**న సంరంభేణారభతే ఽర్థవర్గమాకారితః శంసతి తథ్యమేవ**
**న మాత్రార్థే రోచయతే వివాదం నా పూజితః కుప్యతి చాప్యమూఢః 90**

కోపంతో పురుషార్థాలైన ధర్మ, అర్థ, కామాలను మొదలుపెట్టనివాడు, అడిగినప్పుడు తప్పక సత్యాన్నే చెప్పేవాడు, స్నేహితులతో అయినా ఎన్నడు వివాదం పెట్టకొననివాడు, తనను గౌరవించకపోయినా, కోపగించుకొననివాడు వివేకవంతుడు అనిపించుకుంటాడు.

**న యోఽభ్యసూయత్యనుకంపతే చ న దుర్బలః ప్రాతిభావ్యం కరోతి**
**నాత్యాహ కించితక్షమతే వివాదం సర్వత్ర తాదృగ్లభతే ప్రశంసామ్ 91**

ఇతరుల యెడ వివేకం కోల్పోక ఉండువాడు ఇతరుల తప్పులను ఎన్ననివాడు, అందరిపై దయ చూపేవాడు, బలహీనుడై ఇతరులతో తగవుపడనివాడు, కొద్దిగా కూడా అధికంగా మాటలాడనివాడు, వివాదంలో ఓర్పు కలిగి ఉండేవాడు, అంతటను ప్రశంసింపబడతాడు.

**యో నోద్ధతం కురుతే జాతు వేషం న పౌరుషేణాపి వికత్థతేఽన్యాన్**
**న మూర్ఛితః కటుకాన్యాహ కించిత్ప్రియం సదా తం కురుతే జనోఽపి 92**

ఒక్కసారైనా ఎన్నడూ తన దర్పం ప్రదర్శించే వేషం వెయ్యనివానిని, పరాక్రమం కలిగి ఉండి కూడా ఇతరుల ఎదుట ఆత్మస్తుతి చేసికొననివానిని, ఒళ్ళు తెలియని ఆవేశంతో కఠినమైన మాటలు ఒకసారి కూడా మాట్లాడనివానిని జనులు ఎల్లకాలము ప్రేమిస్తారు.

**న వైరముద్దీపయతి ప్రశాంతం న దర్పమారోహతి నాస్తమేతి**
**న దుర్గతోఽస్మీతి కరోతి మన్యుం తమార్య, శీలం పరమాహురగ్ర్యమ్ 93**

చల్లారిపోయిన వైరమును మరలరగిలించని వానిని, పొగరెక్కని వానిని, క్రుంగిపోని వానిని, తనకు చెడు దాపురించిందని భావిస్తూ చేయకూడని పని చేయకుండా ఉండేవానిని, శుభమైన ప్రవర్తన కలవానిని పెద్దలు "ఇతడు అందరిలోను శ్రేష్ఠుడు" అని అంటారు.

**న స్వే సుఖే వై కురుతే ప్రహర్షం నాన్యస్య దుఃఖే భవతి ప్రతీతః**
**దత్త్వా న పశ్చాత్కురుతే ఽనుతాపం న కథ్యతే సత్పురుషార్యశీలః 94**

తన సుఖానికి పొంగిపోనివాడును, ఇతరుల దుఃఖానికి సంతోషపడనివాడును, ఇతరులకు దానం చేసి పశ్చాత్తాప పడనివాడును అయినవాడు సజ్జనులలో సత్ప్రవర్తన కలవాడు.

**దేశాచారాన్సమయాజ్ఞాతిధర్మాన్ బుభూషతే యస్తు పరావరజ్ఞః**
**స తత్ర తత్రాధిగతః సదైవ మహాజనస్యాధిపత్యం కరోతి 95**

వివిధ దేశాల ఆచారాలను, వివిధ ప్రదేశాల భాషలను, వివిధ జాతుల కట్టుబాట్లను, వారి ధర్మాలను లేక మత విషయాలను అవగాహన చేసుకొన్నవాడు, హెచ్చుతగ్గుల భేదాన్ని తెలుసుకొన్నవాడు. ఎక్కడకు వెళ్ళినా, జనసమూహంపై తన ఆధిక్యాన్ని ఎల్లప్పుడు స్థాపించుకొనగల్గుతాడు.

**దంభం మోహం మత్సరం పాపకృత్యం రాజద్విష్టం పైశునం పూగవైరమ్**
**మత్తోన్మత్తై ర్దుర్జనైశ్చాపి వాదం యః ప్రజ్ఞావాన్వర్జయేత్స ప్రధానః 96**

ఆడంబరము, మోహము, ద్వేషం (ఈర్ష్య), పాపపు పనిచేయటం, రాజద్రోహం తలపెట్టటం, పిసినారితనం, సంఘువైరం, త్రాగి ఉన్నవారితో, పొగరుబోతులతో, పిచ్చివారితో, చెడ్డవారితో వాదం చేయటం– అనే వీనిని అన్నింటిని వదలుకొనినవాడు తనవారి అందరిలోను ప్రజ్ఞాశీలుడు అనబడతాడు.

**దమం శౌచం దైవతం మంగళాని ప్రాయశ్చిత్తం, వివిధాంల్లోకవాదాన్**
**ఏతాని యః కురుతే నైత్యకాని తస్యోత్థానం దేవతా రాధయంతి 97**

దానము, హోమము, దేవతార్చనము, హోమము, శుభకార్యాలు, దోషప్రాయశ్చిత్తాలు, ఇంకా అనేకవిధాలైన లోకాచారాలను, నిత్యము తాను చేయవలసిన విధికార్యక్రమములుగా పెట్టుకొన్న వానిని దేవతలు దీవిస్తారు.

**సమైర్వివాహం కురుతే న హీనైః సమైః సఖ్యం వ్యవహారం కథాశ్చ**
**గుణైర్విశిష్టాంశ్చ పురో దధాతి విపశ్చితస్తస్య నయాః సునీతాః 98**

తనకన్నా తక్కువ వారితో గాక సమానులైన వారితో వివాహము, స్నేహము, సంభాషణము, వ్యవహారములను చేస్తు తనకంటె విశిష్టులైన వ్యక్తులను ముందుంచుకొనే పండితుని నీతులు ప్రయోజనాలను సిద్ధింపజేస్తాయి.

**మితం భుంక్తే సంవిభాజ్యాశ్రితేభ్యో మితం స్వపిత్యమితం కర్మకృత్వా**
**దదాత్యమిత్రేష్వపి యాచితః సంస్తమాత్మవంతం ప్రజహాత్యనర్థాః 99**

తనను ఆశ్రయించి ఉన్నవారికి పంచి యిచ్చి, మితముగా తాను తినువాడు, ఎక్కువ పనిచేసి తక్కువగా నిద్రించేవాడు అడిగినప్పుడు శత్రువులకైనా ఇచ్చేవాడు అయిన ఆత్మగుణ సంపన్నుడిని సర్వ అనర్థాలు వదలిపెట్టిపోతాయి.

**చి కీర్షితం విప్రకృతం చ యస్య నాన్యే జనాః కర్మ జానంతి కించిత్**
**మంత్రే గుప్తే సమ్యగనుష్ఠితే చ స్వల్పో నాస్య వ్యథతే కశ్చిదర్థః 100**

తనకు ఇష్టమైన పనిని చేయదలచుకొన్నా, తన శత్రువుకు హాని కలిగించే పనిని చేయదలచుకున్నా, ఎవరికీ తెలియనీయక, ఉండే మానవుని మంత్రాలోచనం కాని, ఆచరణం కానీ కొద్దిపాటిగా కూడా వ్యర్థం కావు.

**యః సర్వభూతప్రశమే నివిష్టః సత్యో మృదుర్దానకృచ్ఛుద్ధ భావః**
**అతీవ సంజ్ఞాయతే జ్ఞాతిమధ్యే మహామణిర్జాత్య ఇవ ప్రసన్నః 101**

సర్వభూతములకు హాని తలపెట్టక, శాంతిని కలిగించే ఆసక్తితో, ఎల్లప్పుడు సత్యమునే పలుకుతూ, మృదు స్వభావంతో ఇతరులను గౌరవిస్తూ, దాన గుణాన్ని కలిగి ఉండేవాడు తన దాయాదుల మధ్య గొప్పగనిలో ఉద్భవించిన స్వచ్ఛమైన జాతిరత్నం వలె ప్రకాశిస్తాడు.

**య ఆత్మనాపత్రపతే భృశం నరః స సర్వలోకస్య గురుర్భవత్యుత**
**అనంత తేజాః సుమనాః సమాహితః స్వతేజసా సూర్య ఇవావభాసతే 102**

తాను చేసిన తప్పులు తనకు తప్ప ఇతరులు ఎవరికి తెలియకపోయినను తన తప్పులకు తానే సిగ్గుపడుతూ, ఉండే మానవుడు ఈ లోకమునకంతటికి గురువు వంటివాడు అయిన, స్వచ్ఛమైన తేజస్సుతో మంచి హృదయం కలిగి అనంత శక్తితో సూర్యుని వలె ప్రకాశిస్తాడు.

**వనే జాతాః శాపదగ్ధస్య రాజ్ఞః పాండోః పుత్రాః పంచ పంచేంద్ర కల్పాః**
**త్వయైవ బాలా వర్ధితాః శిక్షితాశ్చ తవాదేశం పాలయంత్యాంబికేయ 103**

**ప్రదాయైషాముచితం తాత రాజ్యం సుఖీ పుత్రైః సహితో మోదమానః**
**న దేవానాం నాపి చ మానుషాణాం భవిష్యసి త్వం తర్కణీయో నరేంద్ర 104**

అంబికా కుమారా (మృగ రూపాన్ని ధరించిన కిందముడు అనే ఋషి యొక్క) శాపదగ్ధుడైన పాండురాజు కుమారులు అయిదుగురు అడవిలో జన్మించారు. వారు ఐదుగురు ఇంద్రుని వంటివారు. వారిని చిన్నతనం నుంచి నీవే పెంచావు. విద్యాబుద్ధులు నేర్పించావు. వారు నీ ఆజ్ఞను పాటిస్తున్నారు. తండ్రీ! అటువంటివారికి తగిన విధంగా రాజ్యమిచ్చి, నీ కుమారులతో కలసి ఆనందిస్తూ సుఖపడు. రాజా ఆ విధంగా చేసిన యెడల నిన్ను దేవతలు, మనుష్యులు కూడా శంకించరు.

ఈ అధ్యాయంలోని ముఖ్య విషయాలను గురించి సంగ్రహంగా తెలుసుకొందాం.

# విదురనీతి భారతీయ సంస్కృతికి అలంకారము

శ్రీ కృష్ణరాయబారము విఫలమైన తర్వాత ధృతరాష్ట్రుడు తన కుటిలత్వం బయటపడకుండా మరొక ప్రయత్నంగా పాండవుల వద్దకు సంజయుని రాయబారిగా ఉపప్లావ్యం పంపించాడు. అక్కడ యథాశక్తి ఔచిత్యం నెరపి సంజయుడు వట్టి చేతులతో తిరిగి వచ్చి మహారాజా! నేను పాండవుల వద్దకు పోయి చేసిన రాయబారము సంపూర్తిగా విఫలమైనది. యుద్ధము అనివార్యము అనిపించుచున్నది. అని తెలుపగా ధృతరాష్ట్రుని మనస్సు పూర్తిగా కలత చెందింది. అందుచేత విదురుడు చెప్పు హితవాక్యములను వినిన తనకు కొంత ఊరట కలుగునని భావించి విదురుని కోసము భటుని పంపించాడు. నిరహంకారి, యమధర్మరాజు అవతారము, నిశ్చల మనస్కుడు అయిన విదురుడు రాజు పిలుపు తెలియగానే ధృతరాష్ట్రుని సమక్షమునకు వచ్చి రాజుకు నమస్కరించి నిలబడగా ధృతరాష్ట్రుడు విదురునిని కూర్చొనవలసినదిగా అనుజ్ఞ ఈయగా ఆసనమును స్వీకరించెను. అంతట ధృతరాష్ట్రుడు తనకు హితవాక్యములను తెలుపవలసినదిగా కోరగా విదురుడు ఆయనతో ఇట్లు చెప్పెను.

మహారాజా! నీకు నిద్రపట్టలేదు. ఇది నాకు ఆశ్చర్యము కల్గించుచున్నది. ఎందుకనగా బలవంతులతో విరోధము తెచ్చుకొనిన దుర్బలులకు, పరసంపదను హరించువానికి, కామాంధులైన వారికి, చోరులకు, శాస్త్రములను అనుసరించి నిద్రపట్టదు. నాకు తెలిసినంతవరకునూ నేను తెల్పిన ఈ లక్షణములు ఏవియునూ నీకు లేవు. అందుచేత నీకు నిద్ర యేల వచ్చుట లేదో నాకు అవగాహన అగుట లేదు. ఈ సమాధానమును వినిన ధృతరాష్ట్రుడు విదురా! నేను నీవు చెప్పెడి ధర్మప్రవచనమును వినవలయునని కోరుకొనుచున్నాను. అనగా విదురుడు మరల మహారాజా! యుధిష్ఠిరుడు ఉత్తమ గుణములు, ఉన్నత ఆశయములు కలిగి ఉదాత్త ధర్మపరుడైనందున ఆతడికి త్రిలోకాధిపత్యము వహించు అర్హత కలదు. అట్లు అగుటకు శక్తి కలిగి ఉన్ననూ అతడు నిన్ను తన జనకునిగానే భావించుచూ నీ మాట జవదాటలేదు. అయినప్పటికినీ నీవు ఆతనిని అరణ్యవాసమునకు పంపితివి. ఇప్పుడు నీవు వాగ్దానము చేసినట్లుగా వారి రాజ్యమును వారికి తిరిగి అప్పగించు స్థితియందు ఉన్నావు. ఈ మహీసామ్రాజ్య భారమును అయోగ్యులగు దుర్యోధన, దుశ్శాసన, శకుని, కర్ణాదులకు అప్పగించితివి. ఇప్పుడు నీవు శాంతి కొరకు అర్థించుట న్యాయమైనది కాదు. ఒక వ్యక్తి సాత్విక స్వభావము, ఉద్యోగయత్నము, క్లేశ సహనము కలిగి ధర్మపరుడైన యెడల ఎట్టి పరిస్థితుల యందును ఆ సుగుణములను ఒదులుకొనుడు. అంతేగాక అట్టి సజ్జనులు దుర్జనులైన వారికి దూరముగా ఉందురు. మహారాజా! విద్వాంసులైన వారు

* ధర్మార్ధ పథమును అనుసరించుట
* లోక వ్యవహారమును తెలిసియుండుట
* భోగచింత రహితుడై పురుషార్థములను పాటించుట
* అప్రస్తుత ప్రసంగము చేయకుండుట
* తనకు అర్హత లేని లాభము కోరుకొనుట
* పోగొట్టుకొనిన వానికై దుఃఖించుట
* సర్వక్లేశములను ఎదుర్కొని ధైర్యముగా ఉండుట
* ఎట్టి కష్టసాధ్యమైన పని అయిననూ మధ్యలో వదలివేయక పూర్తియగువరకు కొనసాగించుట
* సోమరితనము లేకుండా ఉండుట
* ఇంద్రియ నిగ్రహము కలిగి యుండుట.

రాజా! ఇట్టి వారి హృదయము పవిత్ర గంగానది వంటిది. విద్య అనునది మనుష్యులను ఎల్లప్పుడూ సన్మార్గ పథికులను చేయవలెను. కానీ విద్యలేని మూర్ఖుడు విద్యావివేకములు లేక గర్వమును మాత్రమే కల్గి ఉండును. అంతేగాక దరిద్రుడైన ఒక మనుష్యుడు ధనమును గురించి నిరంతరమూ ఆలోచించుచుండిన ఎడల అట్టివానిని కూడా మూర్ఖుడనియే అనవలసి ఉండును. అంతేగాక

* స్వధర్మమును వదలివేసినవారు
* పరధర్మమును స్వీకరించువారు
* స్నేహితుల యెడ సత్ప్రవర్తన చూపనివారు
* బలవంతులతో విరోధము తెచ్చుకొన్నవారు
* స్నేహితులే లేనివారు
* అధిక ప్రసంగములు చేయువారు
* చేసిన మేలును మరచిపోవుట యందు విశ్వాసము కలవారు
* ఎల్లప్పుడూ ఇతరులలో తప్పులు వెదకువారు
* కారణము లేకయే ఆవేశము పొందువారు
* అనర్హులకు ఉపదేశము చేయువారు

వీరందరునూ మూర్ఖులే. వారికి విద్య ఉన్ననూ దానపరులైననూ గర్వము ఉన్నయెడల విద్వాంసులు కాలేరు. తాను తిను సమయమున తన ఆశ్రయములో గలవారికి పెట్టక తానే భుజించువాడు పరమమూర్ఖుడు అని చెప్పబడును.

## ○ 34వ అధ్యాయము

**జాగ్రతో దహ్యమానస్య యత్కార్యమనుపశ్యసి**
**తద్బ్రూహి త్వం హి నస్తాత ధర్మార్థ కుశలః శుచిః** 1

తదనంతరం ధృతరాష్ట్రుడు విదురుని ఇలా ప్రశ్నించాడు, "నాయనా! నీవు ధర్మార్థమును తెలుపుటలో కుశలుడివి నిద్రపట్టక తపించిపోతున్న నాకు నీవు అనుకుంటున్న కర్తవ్యాన్ని ఉపదేశించు"

**త్వం మాం యథావద్విదుర ప్రశాధి ప్రజ్ఞా పూర్వం సర్వమజాతశత్రోః**
**యన్మన్యసే పథ్యమదీనసత్త్వ శ్రేయస్కరం బ్రూహి తద్వై కురూణామ్** 2

**పాపాశంగీ పాపమేవ నౌపశ్యన్ పృచ్ఛామి త్వాం వ్యాకులేనాత్మనాహమ్**
**కవే తన్మే బ్రూహి సర్వం యథావన్ మనీషితం సర్వమజాత శత్రోః** 3

ఉదారబుద్ధి గల విదురా! బుద్ధిపూర్వకంగా నాకు చెప్పాలనుకొన్నదంతా తప్పకుండా ఉపదేశించు, ధర్మరాజుకు ఏది మేలు చేకూరుస్తుందో, కౌరవులకు ఏది శుభాన్ని కల్గిస్తుందో, నీవనుకొంటున్నదానిని చెప్పు. కీడును శంకిస్తూ కళ్ళకు కట్టినట్లున్న నా తప్పులను గమనిస్తూ కలవరపడుతున్న మనసుతో నిన్నునేను అడుగుతున్నాను. అందుచేత విదురా! అజాతశత్రుడైన ధర్మరాజు కోరుకొంటున్నదానిని అంతా ఉన్నది ఉన్నట్లుగా నాకు తెలియజేయి.

**శుభం వా యది వా పాపం ద్వేష్యం వా యది వా ప్రియమ్**
**అపృష్టస్తస్య తద్బ్రూయాద్యస్య నేచ్ఛేత్పరాభవమ్** 4

ధృతరాష్ట్రుని మాటలకు విదురుడు ఇట్లు చెప్పెను. ఎవడికి పరాభవం జరుగకూడదని తాను అనుకుంటాడో, అతడికి మంచో చెడో, ఇష్టమో అయిష్టమో అడగకపోయినా తెలియజేయవలసిందే లేక చెప్పవలసిందే.

**తస్మా ద్వక్ష్యామి తే రాజన్భవమిచ్ఛన్కురూన్ప్రతి**
**వచః శ్రేయస్కరం ధర్మ్యం బ్రువతస్తన్నిబోధ మే** 5

అందుచేత రాజా! నీవు కోరినట్లుగా కౌరవులకు ఏది మేలు చేస్తుందో, దానిని చెప్పెదను. శుభాన్ని కలిగించే ధర్మబద్ధమైన నేను చెప్పబోవుచున్న మాటలను విను.

**మిథ్యోపేతాని కర్మాణి సిధ్యేయుర్యాని భారత**
**అనుపాయ ప్రయుక్తాని మా స్మ తేషు మనః కృథాః 6**

**తథైవ యోగవిహితం న సిధ్యేత్కర్మ యన్నృప**
**ఉపాయయుక్తం మేథావీ న తత్ర గ్లపయేన్మనః 7**

రాజా! కపటోపాయంతో పొందిన ద్యూతజయం మీద దృష్టి పెట్టవద్దు. అదేవిధంగా జాగరూకతతో, ఉపాయంతో చేసిన పని సిద్ధించినప్పుడు, తెలివైనవాడు తన మనసును పాడు చేసుకొనగూడదు.

**అనుబంధానవేక్షేత సానుబంధేషు కర్మసు**
**సంప్రధార్య చ కుర్వీత న వేగేన సమాచరేత్ 8**

సానుబంధాలైన పనుల్లో అనుబంధ ప్రయోజనాన్ని ముందు గుర్తించాలి. నిలదొక్కుకొని, ఆలోచించి మరీ చెయ్యాలి. తొందరపడి దేనిని చేయకూడదు.

**అనుబంధం చ సంప్రేక్ష్య విపాకాంశ్చైవ కర్మణామ్**
**ఉత్థానమాత్మనశ్చైవ ధీరః కుర్వీత వా న వా 9**

ధీరుడైనవాడు ముందుగా అనుబంధప్రయోజనాలను, తదనంతర పరిణామాలను, తనకు దానివలన కలిగే ఉన్నతిని బాగుగా ఆలోచించుకొని ఆ పనిని చేయవచ్చు లేక చేయకపోయినను పోవచ్చును.

**యః ప్రమాణం న జానాతి స్థానే వృద్ధౌ తథా క్షయే**
**కోశే జనపదే దండే న స రాజ్యావతిష్ఠతే 10**

రాజు తన కోట, లాభనష్టాలు, ధనాగారం, దేశము అనగా తన రాజ్యం, దండనల స్థాయిని ఏ విధంగా ఉన్నదో తెలుసుకొనలేనియెడల,ఆ రాజు రాజ్యంలోను, అధికారంలోను స్థిరంగా ఉండలేడు.

**యస్త్వేతాని ప్రమాణాని యథోక్తాన్యనుపశ్యతి**
**యుక్తో ధర్మార్థయోర్‌జానే స రాజ్యమధిగచ్ఛతి 11**

ఈ విధంగా రాజ్యంలోని కోట, లాభనష్టాలు, ధనాగారం, జనపదాలు, దండనల స్థాయిని చక్కగా గుర్తించినవాడు, ధర్మార్థ జ్ఞానాలలో మనసుని నిలిపి రాజ్యమును స్థిరంగా ఉంచుకొనగలడు.

**ఇంద్రియౌరింద్రియార్థేషు వర్తమానైరనిగ్రహైః**
**తైరయం తాప్యతే లోకో నక్షత్రాణి గ్రహైరివ** 12

గ్రహాల చేత నక్షత్రాలు అదుపులో ఉంచబడతాయి. అదేవిధంగా అదుపు లేకుండా విషయాలలో తిరిగే ఇంద్రియాల చేత ఈ లోకం కాల్చివేయబడుతుంది.

**యో జితః పంచవర్గేణ సహజేనాత్మ కార్శినా**
**ఆపదస్తస్య వర్ధంతే శుక్లపక్ష ఇవోడురాడ్** 13

తనతోపాటు పుట్టి తనను వశపరచుకొనే పంచేంద్రియాలను జయించలేకపోయిన వానికి, శుక్లపక్షంలోని చంద్రునికి వలె ఆపదలు వృద్ధి చెందుతాయి.

**అవిజిత్యయ ఆత్మానమమాత్యాన్విజిగీషతే**
**అమిత్రాన్వాజితామాత్యః సోఽవశః పరిహీయతే** 14

తనను తాను గెలువక అనగా తన ఇంద్రియాలను, మనస్సును స్వాధీనంలో ఉంచుకొనక మంత్రులను జయించాలనుకొనేవాడు, తన మంత్రులను జయించకుండా, శత్రువులను జయించాలనుకొనేవాడు అవశుడై భ్రష్టుడు అవుతాడు.

**ఆత్మానమేవ ప్రథమం దేశరూపేణ యో జయేత్**
**తతోఽమాత్యానమిత్రాంశ్చ న మోఘం విజిగీషతే** 15

తన ఇంద్రియాలను, మనస్సునూ శత్రువుగా తలచి వానిని మొదట జయించినవాడు, తరువాత మంత్రులను, శత్రువులను జయించాలనుకొంటే ఆ కోరిక వ్యర్థంకాదు.

**వశ్యేంద్రియం జితామాత్యం ధృతదండం వికారిషు**
**పరీక్ష్య కారిణం ధీరమత్యంతం శ్రీర్నిషేవతే** 16

తన ఇంద్రియాలను అదుపులో ఉంచుకొన్న వానిని, మనస్సును గెలిచిన వానిని, విరుద్ధమైన పనులు చేసే వానిని దండించేవానిని, పరీక్షించి పనులు చేసేవానిని, పరిస్థితులకు మారని ధీరుని లక్ష్మి అనగా సంపద వదలకుండా సేవిస్తుంది.

**రథః శరీరం పురుషస్య రాజన్ నాత్మా నియంతేంద్రియాణ్యస్య చాశ్వాః**
**తైరప్రమత్తః కుశలః సదశ్వైర్దాంతైః సుఖం యాతి రథీవ ధీరః** 17

రాజా! మనుష్యుని శరీరం రథం. ఆత్మ లేక బుద్ధి సారధి. ఆ రథానికి గుఱ్ఱాలు ఇంద్రియాలు. నిపుణుడైన ధీరుడు జాగరూకతతో తనకు వశమైన ఆ గుఱ్ఱాలతో రథికుని వలె సుఖంగా ప్రయాణం సాగిస్తాడు.

**ఏతాన్యని గృహీతాని వ్యాపాదయితుమప్యలమ్**
**అవిధేయా ఇవాదాంతా హయాః పథి కుసారథిమ్** **18**

శిక్షణ పొందని, అదుపులోకి రాని గుఱ్ఱాలు, మూర్ఖుడైన సారథిని మార్గమధ్యంలో పడద్రోసినట్లుగా, అదుపు చేయబడని ఈ ఇంద్రియాలు మనస్సూ, మానవుని చంపివేయగలవు.

**అనర్థమర్థతః పశ్యన్నర్థం చైవాప్యనర్థతః**
**ఇంద్రియైః ప్రసృతో బాలః సుదుఃఖం మన్యతే సుఖమ్** **19**

ఇంద్రియాలపై అదుపులేని మూర్ఖుడు అర్థం నుండి అనర్థాన్ని, అనర్థం నుండి ప్రయోజనాన్ని చూస్తూ, ఎంతో దుఃఖాన్ని సుఖంగా భావిస్తాడు.

**ధర్మార్థౌ యః పరిత్యజ్య స్యాదింద్రియవశానుగః**
**శ్రీప్రాణ ధనదారేభ్య క్షిప్రం స పరిహీయతే** **20**

ధర్మాన్ని అర్థాన్ని విడిచి ఇంద్రియాలకు లొంగిపోయినవాడు త్వరలోనే సంపద, ప్రాణం, ధనం భార్యలను కోల్పోతాడు.

**అర్థానామీశ్వరో యః స్యాదింద్రియాణామనీశ్వరః**
**ఇంద్రియాణామనైశ్వర్యాదైశ్వర్యాద్భ్రశ్యతే హిసః** **21**

ఎంతధనవంతుడైనా, ఇంద్రియాలపై పట్టు లేనివాడు, ఇంద్రియాలపై అదుపు లేని కారణంగా, ఐశ్వర్యం నుండి కొలదికాలంలోనే భ్రష్టుడు అవుతాడు.

**ఆత్మనాత్మానమన్విచ్ఛేన్మనో బుద్ధీంద్రియైర్యతైః**
**ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః** **22**

నరుడు తనకు తానుగా, అదుపులో ఉంచుకొనిన బుద్ధి, ఇంద్రియాలతో తన ఆత్మ పొందగలుగవలెను. నరుడు తనకు తానే చుట్టం, తనకు తానే శత్రువు. బుద్ధి చేత ఆత్మను జయిస్తే అతడికి ఆత్మయే బంధువు. అదుపులో ఉంటే ఆత్మే బంధువు. అదుపులో లేకపోతే ఆత్మే శత్రువు.

**క్షుద్రాక్షేణేవ జాలేన ఝషావాపిహితావుభౌ**
**కామశ్చ రాజన్క్రోధశ్చ తౌ ప్రాజ్ఞానం విలుంపతః** **23**

ఓ రాజా! రెండు పెద్ద చేపలు సన్ననిదారంతో నేయబడి చిల్లులు గల వలలో పడి దానిని కొరికి వేసి బయటపడిన విధంగా కామక్రోధాలు రెండూ అదుపు చేయబడనప్పుడు

వివేకాన్ని లోపింపచేస్తాయి. అనగా కామక్రోధాలు చేపల వలె శత్రువులు - కాని అవి వలలో పడినప్పుడు మాత్రం మిత్రభావంతో కలసి వలను కొరుకుతాయి. అలాగే కామక్రోధాలు రెండు కలసి వివేకాన్ని నశింపచేస్తాయి.

**సమవేక్ష్యేహ ధర్మార్థౌ సంభారాన్యోఽధిగచ్ఛతి**
**స వై సంభృత సంభారః సతతం సుఖమేధతే** **24**

ఈ లోకంలో ధర్మాన్ని అర్థాన్ని చక్కగా గుర్తించి విజయం పొందటానికి కావలసిన సామగ్రిని సేకరించుకొనిన వాడెప్పుడు సుఖంగా అభివృద్ధి చెందుతాడు. సంతోషాన్ని పొందగల్గుతాడు.

**యః పంచాభ్యంతరాంశత్రూనవిజిత్య మతిక్షయాన్**
**జిగీషతి రిపూనన్యాన్రిపవోఽభిభవంతి తమ్** **25**

మనస్సుకు ప్రతిరూపాలైన ఐదు ఇంద్రియాలు అనే లోపలి శత్రువులను గెలవకుండా, ఇతర శత్రువులను జయించాలనుకొనేవానిని, శత్రువులు అణగద్రొక్కి వేస్తారు.

**దృశ్యంతే హి దురాత్మానో వధ్యమానాః స్వకర్మభిః**
**ఇంద్రియాణామనీశత్వాద్రాజానో రాజ్య విభ్రమైః** **26**

ఇంద్రియాలపై తమకు అదుపు లేక రాజభోగాలతో రాజులు రాజ్యకాంక్షతో తమ కర్మల చేత బంధింపబడి కనిపిస్తున్నారు గదా!

**అసంత్యాగాత్పాపకృతా మపాపాంస్, తుల్యో దండః స్పృశతే మిశ్రభావాత్**
**శుష్కేణార్ద్రం దహ్యతేమిశ్ర భావాత్, తస్మాత్పాపైః సహ సంధిం న కుర్యాత్** **27**

పాపపుపనులు చేసేవారితో కలియటం వలన, పాపంచేయని వారికి చేసినవారితో సమానమైన శిక్షే పడుతుంది. కలయికచేత ఎండుకట్టెతోపాటు తడికట్టె కూడా కాల్చబడుతుంది. అందువలన పాపులతో చెలిమిచేయగూడదు.

**ని జానుత్పతః శత్రూన్పంచ పంచ ప్రయోజనాన్**
**యో మోహాన్న నిర్ ఘృణ్హాతి తమాపద్గ్రసతే నరమ్** **28**

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే ఐదు విషయాలను ప్రయోజనాలుగా చేసికొన్న తన అయిదుగురు (ఇంద్రియాలు) శత్రువులను మోహంతో అదుపు చేసికొనని నరుని ఆపద మింగివేస్తుంది.

**అనసూయార్జవం శౌచం సంతోషం ప్రియవాదితా**
**దీమః సత్యమనాయాసో న భవంతి దురాత్మనామ్ 29**

అసూయ లేకపోవటం, సరళ స్వభావం, పవిత్రత, తృప్తి, ప్రియంగా మాట్లాడటం, ఇంద్రియాలను తన వశంలో ఉంచుకొనటం, నిజం పలకటం, చంచలత లేకపోవటం అనేవి ఎనిమిది దురాత్ములకు కలుగవు.

**ఆత్మజ్ఞానమనాయాసస్తితిక్షా ధర్మనిత్యతా**
**వాక్చైవ గుప్తాదానం చ నైతాన్యన్త్యేషు భారత 30**

భరతవంశీయుడా! ఆత్మజ్ఞానము, స్థిరమైన బుద్ధి, ఓర్పు, నిరంతర ధర్మపరాయణత్వము, మాటను రక్షించుకొనటం, రహస్యంగా దానంచేయటం అనేవి అథములైన వారిలో ఉండవు.

**ఆక్రోశ పరివాదాభ్యాం విహింసన్త్యబుధా బుధాన్**
**వక్తా పాపముపాదత్తే క్షమమాణో విముచ్యతే 31**

మూర్ఖులు పండితులను తిట్లతోను, నిందలతోను హింసిస్తూ ఉంటారు. నిందించేవాడు పాపాన్ని మూట కట్టుకుంటాడు. క్షమించేవాడు పాపం నుండి విముక్తి పొందుతాడు.

**హింసా బలమసాధూనాం రాజ్ఞాం దండవిధిర్బలమ్**
**శుశ్రూషా తు బలం స్త్రీణాం క్షమాగుణవతాం బలమ్ 32**

చెడ్డవారికి హింసయే బలం. అపరాధులకు తగిన శిక్ష విధించటమే రాజులకు బలం, స్త్రీలకు సేవ చేయటమే బలము. గుణవంతులకు సహనమే బలము.

**వాక్సంయమో హి నృపతే సుదుష్కరతమో మతః**
**అర్థవచ్చ విచిత్రం చ న శక్యం బహుభాషితమ్ 33**

రాజా ! మాటను అదుపులో ఉంచుకొనటం చాలా కష్టం అయిన విషయం. ఎక్కువగా మాట్లాడేటప్పుడు అది అర్థవంతంగా వినేవారికి ఇంపుగా ఉండేటట్లుగా మాట్లాడటం సాధ్యంకాదు.

**అభ్యావహతి కల్యాణం వివిధా వాక్సుభాషితా**
**సైవ దుర్భాషితా రాజన్ననర్థాయోపపద్యతే 34**

రాజా! చక్కగా మాట్లాడిన మాట అనేక విధాల శుభాన్ని చేకూరుస్తుంది. ఆ మాటే చెడుగా పలికితే అనర్థాలకు దారితీస్తుంది.

**సంరోహతి శరైర్విద్ధం వనం పరశునా హతమ్**
**వాచా దురుక్తం భీభత్సమ్ న సంరోహతి వాక్క్షతమ్ 35**

బాణాలతో, గొడ్డలితో నరుకబడిన అడవి మరల మొలకెత్తుతుంది. కానీ చెడు మాటలతోను, నిందలతోను గాయపరచబడిన హృదయమునకు కలిగిన గాయము ఎన్నడును మానదు.

**కర్ణినాలీకనారాచా నిర్హరంతి శరీరతః**
**వాక్షల్యస్తు న నిర్హర్తుం శక్యోహృది శయో హి సః 36**

కర్ణి, నాలీక, నారాచాలనే పేర్లు గల రకరకాలైన బాణాలను శరీరాల నుండి బయటకు లాగగల్గువచ్చును కానీ కఠినమైన మాట అనే బాణం గుచ్చుకొంటే దానిని బయటకు లాగటానికి వీలుకాదు. అది హృదయంలోనే ఇరుక్కొని ఉంటుంది గదా!

**వాక్యసాయకా వదనాన్నిష్పతంతి యైరాహతః శోచతి రత్ర్యహాని**
**పరస్య నామర్మసు తే పతంతి తాన్పండితో నావసృజేత్పరేషు 37**

మాటలు అనే బాణాలు నోటినుండి వెలువడతాయి. అవి ఇతరుల మర్మస్థానాలలో గుచ్చుకుంటాయి. గుచ్చుకున్నవాడు రాత్రింబగళ్ళు కుమిలిపోతాడు. అందుచేత పండితుడైనవాడు అటువంటి వాక్కులను ఇతరులపై ప్రయోగించకూడదు.

**యస్మై దేవాః ప్రయచ్ఛంతి పురుషాయ పరాభవమ్**
**బుద్ధిం తస్యాపకర్షంతి సోఽపాచీనాని పశ్యతి 38**

దేవతలు అవమానం కలిగించాలనుకొన్నవాడి బుద్ధిని క్రిందకు లాగివేస్తారు. అందుచేతనే అతడప్పుడు నీచమైన పనులమీద తన దృష్టిని నిలుపుతాడు.

**బుద్ధౌ కలుష భూతాయాం వినాశో ప్రత్యుపస్థితే**
**అనయో నయసంకాశో హృదయాన్నాపసర్పతి 39**

వినాశం దాపురించినప్పుడు, బుద్ధి పాడైపోయి, న్యాయంవలె అనిపించే అన్యాయం హృదయంలో నుంచి తొలగిపోదు. గట్టిగా నిలచియే ఉంటుంది.

**సేయం బుద్ధిః పరీతా తే పుత్రాణాం తవ భారత**
**పాండవానాం విరోధేన న చైనామ్ అవబుధ్యసే 40**

భరతవంశాగ్రణీ! నీ కొడుకుల బుద్ధి పాండవుల మీద విరోధంతో నిండి ఉన్నది. నీవు వారిని సరిగా గుర్తించలేకపోతున్నావు.

**రాజా లక్షణ సంపన్నస్త్రైలోక్యస్యాపి యో భవేత్**
**శిష్యస్తే శాసితా సోఽస్తు ధృతరాష్ట్ర యుధిష్ఠిరః** **41**

ధృతరాష్ట్రా! యుధిష్ఠిరుడు రాజలక్షణాలతో నిండినవాడు. మూడు లోకాలకు రాజు కావలసినవాడు. నీ ఆజ్ఞను పాటించేవాడు. అతడు రాజగుగాక!

**అతీవ సర్వాన్పుత్రాంస్తే భాగధేయ పురస్కృతః**
**తేజసా ప్రజ్ఞయా చైవ యుక్తో ధర్మార్థతత్త్వవిత్** **42**

**ఆ నృశంస్యాదనుక్రోశాద్యోఽసౌ ధర్మభృతాం వరః**
**గౌరవాత్తవ రాజేంద్ర బహూన్క్లేశాంస్తితిక్షతి** **43**

ఆ యుధిష్ఠిరుడు ధర్మార్థాల స్వరూపం తెలిసినవాడు. తేజస్సు, బుద్ధితోను కూడినవాడు. అదృష్టవంతుడు. నీ కుమారులు అందరిని మించినవాడు. రాజేంద్ర! ధర్మాన్ని ఆచరించేవారిలో ఆ ధర్మరాజు దయ, క్రూర స్వభావం లేకపోవటం, నీ యెడల గౌరవం కలిగి ఉండటం చేత ఎన్నో కష్టాలను అనుభవిస్తూ ఓర్చుకొంటున్నాడు.



## ముఖ్య విషయములు

మరల ధృతరాష్ట్రునితో విదురుడు మహారాజా! ఒక వ్యక్తి ఎన్నడునూ ఇతరులకు పెట్టకుండా తాను భక్షింపరాదు. ధర్మ సమస్య వచ్చినప్పుడు ఇతరులను, పెద్దలను, విద్వాంసులను (బుద్ధిమంతులను) సంప్రదించకుండా నిర్ణయమును తీసుకొనరాదు. అరణ్యప్రాంతములో ఒంటరిగా సంచరించకూడదు. పదుగురు నిద్రపోవుచున్నప్పుడు తాను ఒక్కడే మేల్కొని ఉండరాదు.

మహారాజా! సహనము ఉన్నవారిలో ఆ సహనము అసమర్థత వలననే అని కొందరందురు. అది సరికాదు. ఒక వ్యక్తి అసమర్థుడైన వానికి సహనమే ఉండదు. క్షమను మించినది వేరేమియూ లేదు. పురుషునికి క్షమయే గొప్ప అలంకారము.

అల్పబుద్ధియు కలవారు పనిచేయక విషయమును గురించి నిరంతరం చర్చ జరుపుచూ, తరచుగా తమ నిర్ణయమును మార్చుకొనువారు, అదే పనిగా ఇతరులను పొగడువారు అయిన పురుషులను రహస్యసమాలోచన చేయుచూ నిర్ణయమును తీసుకొనవలసి వచ్చినప్పుడు దూరముగా ఉంచవలెను.

ప్రతి గృహస్థుడు తన కుటుంబంలోని వృద్ధులను, దరిద్రులను, కష్టములో ఉన్న స్నేహితులను భర్త చనిపోయి పిల్లలు లేని విధవ స్త్రీలను పోషించుట తప్పక చేయవలెను. తన సేవకుల సుఖదుఃఖములను పట్టించుకొనక సేవ చేయించుకొనువాడు, సేవకులకు సరిగ్గా వేతనములను, బహుమతులను వారి కష్టములను గుర్తింపక తరచుగా కోపగించుచూ విసుగుచెందు రాజు దుర్మార్గుడే అని చెప్పవచ్చును.

పన్నులు వసూలు చేయువారు చాలా ఉదారముగా వ్యవహరింపవలెను. అంతేగాని వారు బొగ్గులు తయారు చేయువారి వలె చెట్టును నరకివేయుటకే గాక తగుల బెట్టుట కూడా చేయకూడదు.

గోమాత, స్త్రీ, విప్రులు, స్వజనుల మీద తన పరాక్రమమును ప్రదర్శించు వ్యక్తి తప్పక నశించును.

ఒక్కటిగానే ఉన్న యెడల ఎంత పెద్ద వృక్షమైననూ పెద్ద గాలికి వ్రేళ్ళతో సహా నేలకూలును. కానీ అది అనేక చెట్లతో కలిసి ఉన్న యెడల ఎంత పెద్ద గాలియైననూ

దానిని పడగొట్టలేదు. అందుచేతనే విద్వాంసులు ప్రతివారిని కలిసి తమలో తాము సహకరించుకొనుచూ పదుగురితో ఐక్యముగా ఉండుట అవసరము అని చెప్పుచున్నారు.

## బుద్ధిమంతుని, మూర్ఖుని లక్షణాలు ఏవి?

విదురుడు ధృతరాష్ట్రుని అడిగినప్పుడు నరుడు అడిగిన వ్యక్తికి మంచియైననూ, చెడు అయిననూ సంతోషపరచిననూ ద్వేషము కలిగించిననూ సత్యమే చెప్పవలెను. అందుచేతనే నేను నీకు కురువంశమునకు ఏది మేలు కలిగించునో దానిని చెప్పను. నేను ధర్మమునకు కట్టుబడి ఉండి సర్వులకూ ఉపయోగకరమైన దానిని తెల్పుదును. రాజా! నీవు మూర్ఖుడవు అని పల్కెను.

ధృతరాష్ట్రుడు విదురుడు చెప్పిన ఈ మాటలను విని పండితుని లక్షణములను మూర్ఖుని లక్షణములను తెలుపవలసినదిగా గోరెను.

విద్వాంసుడు ఒకదానిచేత రెండింటిని విభజించుకొని నాల్గింటి చేత మూడింటిని తన వశమునందుంచుకొనవలెను. ఆరింటిని తెలుసుకొని ఐదింటిని జయింపవలెను. ఏడింటిని విసర్జించి సంతోషముగా సుఖముగా ఉండవలెను.

ఒకటి అనగా బుద్ధి, రెండు మంచి, చెడు; మూడు స్నేహితుడు, దూరములోనివాడు, శత్రువు; నాలుగు దానము, సంతోషపరచుట, అనైక్యత, కాఠిన్యము, ఐదు పంచేంద్రియములు; ఆరు షడ్విధ ఉపాయాలు, ఏడు స్త్రీలు జూదము, వేట, మాటలలో కాఠిన్యము, మద్యపానము, శిక్షలలో తీవ్రత, సంపదను వ్యర్థము చేయుట.



## 35వ అధ్యాయము

**బ్రూహి భూయో మహా బుద్ధే ధర్మార్థసహితం వచః**
**శృణ్వతో నాస్తి మే తృప్తిర్విచిత్రాణీహ భాషసే** 1

పిమ్మట ధృతరాష్ట్రుడు విదురునితో "మహాబుద్ధిశాలివైన విదురా! ధర్మార్థ సహితమైన వాక్కులను ఇంకను తెల్పుము. నీవు చెప్పే పలుకులు నాకు చిత్రంగా అనిపిస్తున్నందువలన నాకు తృప్తి కలగటం లేదు.

**సర్వతీర్థేషు వా స్నానం సర్వభూతేషు చార్జవమ్**
**ఉభే ఏతే సమే స్యాతామార్జవం వా విశిష్యతే** 2

ధృతరాష్ట్రుని మాటలకు విదురుడు 'రాజా! పుణ్యజలాలు అన్నింటిలో స్నానం చేయటం, అన్ని ప్రాణుల యెడల సరళంగా ప్రవర్తించటం, ఈ రెండూ సమానమే. అయినా కూడా అందరి యెడల సమభావం కలిగిఉండడం విశిష్టమైనట్టిది.

**ఆర్జవం ప్రతిపద్యస్వ పుత్రేషు సతతం విభో**
**ఇహ కీర్తిం పరాం ప్రాప్య ప్రేత్య స్వర్గమవాప్స్యసి** 3

ప్రభూ! కుమారుల యెడల అనగా వారి విషయంలో ఎల్లప్పుడు సమభావాన్ని పాటించు. ఈ లోకంలో కీర్తిని పొంది మరణించిన తరువాత స్వర్గాన్ని పొందగల్గుతావు.

**యావత్కీర్తిర్మనుష్యస్య పుణ్య లోకేషు గీయతే**
**తావత్స పురుషవ్యాఘ్ర స్వర్గలోకే మహీయతే** 4

పురుషశ్రేష్ఠా! మనుష్యుని యొక్క కీర్తి, ఈ లోకంలో కొనియాడబడినంతకాలం అతడు స్వర్గలోకంలో గొప్పగా ఉండగల్గుతాడు.

**అత్రాప్యుదాహరన్తీమమితహాసం పురాతనమ్**
**విరోచనస్య సంవాదం కేశిన్యర్థే సుధన్వనా** 5

ఈ విషయంలో పూర్వం కేశిని అనే కన్య విషయంలో సుధన్వునికి విరోచనునితో జరిగిన సంభాషణను ఉదాహరణగా తెల్పుతున్నారు.

**కిం బ్రాహ్మణాః స్విచ్ఛ్రేయాంసో దితిజాః స్విద్విరోచన**
**అథ కేన స్మ పర్యంకం సుధన్వా నాధిరోహతి** 6

ఒకానొకప్పుడు సాటిలేని అందం కల కేశిని అనే కన్య విశిష్టమైన వ్యక్తిని భర్తగా పొందాలని స్వయంవరంలో నిలిచింది. అప్పుడు అక్కడకు ఆమెను పొందాలనే కోరికతో విరోచనుడనే రాక్షస వంశీయుడు వచ్చాడు. అంతట ఆమె విరోచనా! బ్రాహ్మణులు శ్రేష్ఠులా? రాక్షసులు శ్రేష్ఠులా? అయితే ఏ కారణం చేత సుధన్వుడు నా పానుపు ఎక్కగూడదు? అనగా నేను ఏ కారణం చేత సుధన్వుని వరించగూడదు? అని ప్రశ్నించింది.

**ప్రాజాపత్యా హివై శ్రేష్ఠా వయం కేశిని సత్తమాః**
**అస్మాకం ఖల్విమే లోకాః కే దేవాః కేద్విజాతయః** **7**

కేశినితో విరోచనుడు "కేశిని మేము ప్రజాపతి సంతానం కాబట్టి అందరికంటెను శ్రేష్ఠులము. అందరికన్నా ఉత్తములం. ఈ లోకాలన్నీ మావే కదా! మా ముందు దేవతలెవరు? బ్రాహ్మణులెవరు?" అని అన్నాడు.

**ఇహైవ వాస్స్వ ప్రతీక్షావ ఉపస్థానే విరోచన**
**సుధన్వా ప్రాతరాగన్తా పశ్యేయం వాం సమాగతౌ** **8**

అప్పుడు కేశిని "విరోచనా! మనము ఇద్దరం ఇక్కడే ఎదురుచూద్దాం. సుధన్వుడు ఇక్కడకు రేపు ఉదయమే రాగలడు. ఒకచోట కలసిన మీ ఇద్దరను చూస్తాను" అన్నది.

**తథా భద్రే కరిష్యామి యథాత్వం భీరు భాషసే**
**సుధన్వానం చ మాం చైవ ప్రాతర్ద్రష్టసి సంగత్తౌ** **9**

వెంటనే విరోచనుడు "ఓ భీరురాలా! నీవు చెప్పినట్లే చేస్తాను. ఒకేచోట కలసిన సుధన్వుని నన్ను రేపు ఉదయమే చూచెదవుగానిలే" అన్నాడు.

**అన్వాలభే హిరణ్మయం ప్రహ్లాదేఽహం తవాసనమ్**
**ఏకత్వముపసంపన్నో న త్వాసేయం త్వయా సహ** **10**

విదురుడు "రాజశ్రేష్ఠా! ప్రభూ! రాత్రి గడచిపోయి సూర్యుడు ఉదయించిన తరువాత కేశిని, విరోచనుడు ఉన్న ప్రదేశానికి సుధన్వుడు వచ్చాడు" అని ధృతరాష్ట్రునికి చెప్పాడు. సుధన్వుడు విరోచనుని, కేశినిని చేరుకొన్నాడు. వచ్చిన బ్రాహ్మణుడగు సుధన్వుని చూచి, కేశిని లేచి ఎదురుగా వెళ్ళి కాళ్ళు కడుక్కొనటానికి జలము (అర్ఘ్యం), ఆసనాన్ని పూజాద్రవ్యాలకు సమకూర్చింది. విరోచనుడు తనతో ఆసనాన్ని పంచుకొనమని కోరగా, సుధన్వుడు అతడితో ప్రహ్లాదపుత్రా! నేను నీ బంగారు ఆసనాన్ని స్పృశించెదను కానీ, నేను నీతో సమానుడననే భావంతో నీతో కలసి కూర్చొనలేను" అని చెప్పాడు.

**అన్వాహరంతు ఫలకం కూర్చం వాప్యథ నా బృసీమ్**
**సుధన్వన్న త్వమర్హో ౭సి మయాసహ సమాసనమ్** **11**

సుధన్వుని మాటలకు విరోచనుడు "సుధన్వా! నీకు చెక్కపీటగాని, దర్భాసనం గాని సరిపోతుంది. నాతో కలసి సమానంగా ఆసనం మీద కూర్చొనటానికి నీవు తగవు" అని అన్నాడు.

**పితాపి తే సమాసీనముపాసీతైవ మామధః**
**బాలః సుఖైధితో, గేహే న త్వం కిం చన బుధ్యసే** **12**

విరోచనుని మాటలకు సుధన్వుడు "తండ్రీ కొడుకులు, ఇద్దరు బ్రాహ్మణులు, ఇద్దరు క్షత్రియులు, ఇద్దరు ముసలివారైన వైశ్యులు, ఇద్దరు వృద్ధులైన శూద్రులు కూర్చొనవచ్చును. ఇతరులు ఇద్దరు కలసి కూర్చొనకూడదు. ఆసనంపైన కూర్చొన్న నన్ను నీ తండ్రి క్రింద కూర్చొని సేవిస్తాడు. పసివాడివి. నీవు ఇంట్లో సుఖంగా పెరిగావు. ఈ విషయం కొంచెం కూడా నీకు తెలియదు" అని పలికాడు.

**హిరణ్యం చ గవాశ్వం చ యద్విత్తమసురేషు నః**
**సుధన్వన్విపణే తేన ప్రశ్నం పృచ్ఛావ యే విదుః** **13**

"సుధన్వా! మా రాక్షసుల దగ్గరగల సేన, గోహయాది ధనాన్ని అంతా పందెం పెడుతున్నాను. మనమిద్దరం తెలిసినవారి వద్దకు పోయి, ఈ విషయం తెలిసినవారిని 'మా ఇద్దరిలోను ఎవరు గొప్ప అని అడుగుదాం" అని విరోచనుడు అన్నాడు.

**హిరణ్యం చ గవాశ్వంచ తవైవాస్తు విరోచన**
**ప్రాణయోస్తు పణం కృత్వా ప్రశ్నం పృచ్ఛావ యే విదుః** **14**

ఆ మాటలకు సుధన్వుడు "విరోచనా! బంగారం, ఆవులు, గుఱ్ఱాలను నీకే ఉండనీ! మన ఇద్దరి ప్రాణాలను పణంగాపెట్టి తెలిసినవారిని అడుగుదాం" అన్నాడు.

**ఆవాం కుత్ర గమిష్యావః ప్రాణయోర్విపణే కృతే**
**న హి దేవేష్వహం స్థాతా న మనుష్యేషు కర్హిచిత్** **15**

అందుకు విరోచనుడు "మనమిద్దరం ప్రాణాలను పందెంగా పెట్టిన తర్వాత ఎక్కడకు పోవుదము. నేనైతే దేవతల వద్దకు మనుష్యుల వద్దకు ఎన్నటికీ వెళ్ళను" అన్నాడు.

**పితరం తే గమిష్యావః ప్రాణయోర్విపణే కృతే**
**పిత్రస్యాపి స హేతోర్హి ప్రహ్లాదో నానృతం వదేత్** **16**

విరోచనుని మాటలకు సుధన్వుడు "మన ప్రాణాలను పందెంగా ఒడ్డాము కాబట్టి నీ తండ్రియైన ప్రహ్లాదుని వద్దకు పోదాం ఎందుకంటే నీ తండ్రి అయినప్పటికీ ఆయన ఎన్నడు కొడుకు కోసం కూడా అబద్ధం ఆడడు" అని చెప్పాడు.

**ఇమౌ తౌ సంప్రదృశ్యేతే యాభ్యాం న చరితం సహ**
**ఆశీవిషావివ క్రుద్ధావేకమార్గమిహా గతౌ** 17

**కిం వై సహైవ చరతో న పురాచరతః సహ**
**విరోచనైతత్పృచ్ఛామి కిం తే సఖ్యం సుధన్వనా** 18

విదురుడు మరల ధృతరాష్ట్రునితో "ఈ విధంగా పందెం వేసుకొని విరోచన సుధన్వులు ఇద్దరు ఒకరిపై ఒకరు పట్టుదలతో కోపం గలవారై ప్రహ్లాదుడు ఉన్నచోటకు పోయినారు. వారిని చూచిన ప్రహ్లాదుడు వీరు ఇద్దరు ఇంతకు పూర్వం ఎన్నడు సహచరులుగా ఉన్నవారు కారు. కానీ ఇప్పుడు ఇచ్చటకు ఒకే మార్గంలో కలసివస్తూ కోపంతో ఘూర్ణిల్లుతున్న రెండు పాముల వలె వస్తున్నారు. ఇంతకు ముందు ఏనాడు సహచరులుగా లేని మీరు ఇప్పుడు సహచరులైనారా? అని పలికి ఓ విరోచనా! నీకు సుధన్వునికి ఇంతకు ముందు స్నేహం ఉన్నదా?" అని ప్రశ్నించాడు.

**న మే సుధన్వనా సఖ్యం ప్రాణయోర్విపణావహే**
**ప్రహ్లాద తత్త్వామృచ్ఛామి మా ప్రశ్నమనృతం వదీః** 19

ప్రహ్లాదుని మాటలకు విరోచనుడు "నాకు సుధన్వునికి మధ్య ఇంతకు ముందు ఎటువంటి స్నేహమును లేదు. అయినను, మేమిరువురమును మా ప్రాణములను పందెముగా ఒడ్డితిమి. ఓ అసురప్రభూ! నేను నిజం తెలుసుకొనవలయునని నిన్ను ఒక ప్రశ్న అడుగదలచుకొన్నాను. దానికి సత్యమైన జవాబును ఇమ్ము" అని తండ్రిని అడిగెను.

**ఉదకం మధుపర్కం చాప్యానయంతు సుధన్వనే**
**బ్రహ్మన్నభ్యర్చనీయోఽసి శ్వేతా గౌః పీవరీకృతా** 20

ప్రహ్లాదుడు "సుధన్వుని కొరకు నీటిని మధుపర్కాన్ని తీసికొని రండి! బ్రహ్మ స్వరూపా! పూజింపతగినవాడవు. బలిసిన తెల్లని గోవు నీకోసం దానం ఇవ్వటానికి సిద్ధం చేయబడింది" అని అన్నాడు.

**ఉదకం మధుపర్కంచ పథ ఏవార్పితం మమ**
**ప్రహ్లాద త్వం తు నౌ ప్రశ్నం తథ్యం ప్రబ్రూహి పృచ్ఛతోః** 21

సుధన్వుడు ఆ మాటలకు "ప్రహ్లాదా! నాకు నీళ్ళు, మధుపర్కము దారిలోనే అందాయి. నీవు నేను అడిగే ప్రశ్నకు సత్యమైన సమాధానం చెప్పు" బ్రాహ్మణులు శ్రేష్ఠులా? లేక విరోచనుడా? అని ప్రశ్నించాడు.

**పుర్త్తో వాన్యో భవాన్బ్రహ్మన్సాక్ష్యే చైవ భవోత్థితః**
**తయోర్వివదతోః ప్రశ్నం కథమస్మద్విభో వదేత్ 22**

**అథ యో నైవ ప్రబ్రూయాత్సత్యం వా యది వానృతమ్**
**ఏతత్సుధన్వన్పృచ్ఛామి దుర్వివక్తా స్మ కిం వసేత్ 23**

అందుకు ప్రహ్లాదుడు "బ్రహ్మ స్వరూపా! నాకు ఒక్కడే కొడుకు. నీవు స్వయంగా ఇక్కడ ఉన్నావు. తగవులాడుకొంటున్న మీ ఇద్దరి ప్రశ్నకు నాలాంటివాడు ఏ విధంగా సమాధానం చెప్పగలడు? అనగా సుధన్వుడు – బుద్ధిమంతుడా! ఆవును లేక ఇష్టమైన సంపదను నీవు కన్న కుమారునికే ఇచ్చుకో, కాని తగవులాడుకొంటున్న మా ఇద్దరికి నీవు నిజమే చెప్పాలి అన్నాడు. అందుకు ప్రహ్లాదుడు "సుధన్వా! ఒకవేళ నిజమో అబద్ధమో ఏదీ చెప్పడనుకో అలా చెడుగా చెప్పేవాడు ఏమి అవుతాడని అడుగుతున్నాను" అన్నాడు.

**యాం రాత్రిమధివిన్నా స్త్రీ యాం చైవాక్ష పరాజితః**
**యాంచ భారాభితప్తాంగో దుర్వివక్తా స్మ తాం వసేత్ 24**

**నగరే ప్రతిరుద్ధః సన్బహిర్ద్వారే బుభుక్షితః**
**అమిత్రాన్భూయసః పశ్యన్దుర్వివక్తా స్మ తాం వసేత్ 25**

**పఞ్చ పశ్వనృతే హన్తి దశ హన్తి గవానృతే**
**శతమశ్వానృతే హన్తి సహస్రం పురుషానృతే 26**

**హన్తి జాతానజాతాంశ్చ హిరణ్యార్థోఽనృతం వదన్**
**సర్వం భూమ్యనృతే హంతి మాస్మ భూమ్యనృతం వదీః 27**

ప్రహ్లాదుడు అడిగిన ప్రశ్నకు జవాబుగా సుధన్వుడు "వేరొక స్త్రీ మోజులో పడి రాత్రంతా తనభర్త ఆ స్త్రీ కౌగిలిలో నలిగి ఉన్నప్పుడు ఆ స్త్రీ ఎంత బాధపడుతుందో, జూదంలో ఓడిపోయినవాడు ఎంత బాధ అనుభవిస్తాడో, బరువు మోసి జ్వరం వచ్చినవాడు పొందే వేదనాభరితమైన రాత్రిని, అసత్యవాది, దుర్వక్త పొందుతాడు. తప్పుడు సాక్ష్యం చెప్పేవాడు నగర బహిష్కరణ శిక్షగా పొంది, వెలుపలి వాకిలి వద్ద ఆకలిబాధతో నిలిచి, శత్రువులు చూచే వాని దురవస్థను పొందుతాడు. పశువుల కోసం అబద్ధమాడేవాడు. ఐదు తరాలను,

ఆవుల కోసం అబద్ధమాడేవాడు పదితరాలను, గుఱ్ఱాల కోసం అబద్ధాలాడేవాడు నూరు తరాలను, మనుష్యుల కోసం అబద్ధాలాడేవాడు వేయి తరాలను నరకంలో పడవేస్తాడు. బంగారం కోసం అబద్ధమాడేవాడు పుట్టిన వారిని, పుట్టబోయే వారిని కూడా నరకంలో పడేస్తాడు. భూమి కోసం అబద్ధమాడేవాడు సర్వమును నాశనం చేసుకొంటాడు. (కేశిని భూమి వంటిది). అందువలన భూమి కోసం అబద్ధం ఆడవద్దు" అని తెలియజేశాడు.

**మత్తః శ్రేయాంగిరా వై సుధన్వా త్వద్విరోచన**
**మాతాస్య శ్రేయసీ మాతుస్తస్మాత్త్వం తేనవై జితః 28**

**విరోచన సుధన్వాయం ప్రాణానామీశ్వరస్తవ**
**సుధన్వన్పునరిచ్ఛామి త్వయా దత్తం విరోచనమ్ 22**

ప్రహ్లాదుడు "విరోచనా! అంగిరుడు నాకంటె గొప్పవాడు. సుధన్వుడు నీ కన్నను గొప్పవాడు. సుధన్వుని తల్లి నీ తల్లికంటెను గొప్పది. కాబట్టి నీవు సుధన్వునికి ఓడిపోయితివి. విరోచనా! నీ ప్రాణాలకు సుధన్వుడే అధిపతి. సుధన్వా! నీవు ఇస్తే విరోచనుని తిరిగి పొందాలనుకొంటున్నాను" అన్నాడు.

**యద్ధర్మమవృణీథాస్త్వం న కామాదనృతం వదీః**
**పునర్దదామి తే తస్మాత్పుత్రం ప్రహ్లాద దుర్లభమ్ 30**

**ఏష ప్రహ్లాద పుత్రస్తే మయాదత్తో విరోచనః**
**పాదప్రక్షాలనం కుర్యాత్కుమార్యాః సంనిధౌ మమ 31**

సుధన్వుడు "ప్రహ్లాదా! నీవు ధర్మాన్ని వరించావు. కోరికలకు లోబడి అబద్ధం చెప్పలేదు. అందువలన దుర్లభుడైన నీ కుమారుని మళ్ళీ నీకు ఇస్తున్నాను. ప్రహ్లాదా! నీకు నేను తిరిగి ఇచ్చిన కుమారుడు ఈ విరోచనుడు కుమారి కేశిని సమక్షంలో నా పాదాలను కడగాలి " అని చెప్పాడు.

**తస్మారాజేంద్ర భూమ్యర్థే నానృతం వక్తుమర్హసి**
**మాగమః ససుతా మాత్యోఽత్యయం పుత్రానను భ్రమన్ 32**

మరల విదురుడు ధృతరాష్ట్రునితో "ఈ కారణాల వలన రాజేంద్ర! రాజ్యం లేక భూమి కోసం అబద్ధం పల్కుట నీకు తగదు. నీ కుమారుని కోసం మంచి మాటను చెప్పటం మాని, కొడుకులు మంత్రులతో నాశనం కావద్దు.

**న దేవా యష్టిమాదాయ రక్షన్తి పశుపాలవత్**
**యం తు రక్షితుమిచ్ఛంతి బుద్ధ్యా సంవిభజంతి తమ్ 33**

దేవతలు మానవులను పశువుల కాపర్లు తమ పశువులను వలె దుడ్డుకఱ్ఱలు పట్టుకొని రక్షించరు. కానీ ఆ దేవతలు తాము రక్షించాలనుకొన్న వానికి మంచి బుద్ధి లేక తెలివితేటల నిచ్చి ఇతరుల నుండి వేరు చేస్తారు.

**యథా యథా హి పురుషః కల్యాణే కురుతే మనః**
**తథా తథాస్య సర్వార్థాః సిధ్యంతే నాత్ర సంశయః 34**

మానవుడు తన మనసును ఎంతెంతగా మంచివిషయాలపై లగ్నంచేస్తాడో, అంతంత గానే అతడికి అన్ని ప్రయోజనాలు సిద్ధింపగలవు. ఇందులో ఏ మాత్రం సందేహం లేదు.

**న ఛందాంసి వృజినాత్తారయంతి మాయావినం మాయయా వర్తమానమ్**
**నీడం శకుంతా ఇవ జాతపక్షాశ్ఛందాంస్యేనం ప్రజహత్యంత కాలే 35**

కపటంతో మెలిగే మాయావిని వేదములు పాపం నుంచి రక్షింపవు. రెక్కలు వచ్చిన పక్షులు తమ గూడును వదలి వెళ్ళినట్లు, మరణకాలంలో వేదాలు అతడిని వదలి వెళ్ళిపోతాయి.

**మత్తాపానం కలహం పూగవైరం భార్యాపత్యోరనంతరం జ్ఞాతిభేదమ్**
**రాజద్విష్టం స్త్రీపుమాంసోర్వివాదం వర్జ్యాన్యాహుర్యశ్చ పంథాః ప్రదుష్టః 36**

మత్తుపానీయాలు త్రాగటం, తగవులాటలు, అనేకులతో వైరం పెట్టుకొనటం, భార్యాభర్తలను విడదీసే వ్యవహారాలతో సంబంధాలు, దాయాదుల మధ్య పొరపొచ్చాలను సృష్టించటం, రాజుతో వైరం పెట్టుకొనటం, స్త్రీ పురుషుల మధ్య కలహం పెట్టటం, చెడు మార్గంలో ప్రవర్తించటం అనేవి పాపకార్యాలు అయినందున వీటిని విడువ తగినవిగా తెలుపుతున్నారు.

**సాముద్రికం వణిజం చోర పూర్వం శలాకధూర్తంచ చికిత్సకం చ**
**అరి చ మిత్రం చ కుశలవం చ నైతాన్సార వ్యేష్వధికుర్వీత సప్త 37**

చేతిలో రేఖలను చూసి జోస్యం చెప్పేవాడు, దొంగిలించిన సొత్తుతో వ్యాపారం చేసేవాడు, పుల్ల మొదలైన వాటితో మోసగించి జూదమాడేవాడు, వైద్యుడు, శత్రువు, స్నేహితుడు, నాట్యమాడేవాడు అను ఈ ఏడుగురిని సాక్ష్యానికి ఉపయోగించుకొనరాదు.

**మానాగ్నిహోత్రముత మానమౌనం మానేనాధీతముత మానయజ్ఞః**
**ఏతాని చత్వార్యభయంకరాణి భయం ప్రయచ్ఛన్త్యయథాకృతాని 38**

ఆదరంతో అగ్నిహోత్రాన్ని అనుష్ఠించటం, ఆదరంతో మౌనాన్ని వహించటం, ఆదరంతో వేదాన్ని అధ్యయనం చేయటం, ఆదరంతో యజ్ఞాలను అనుష్ఠించటం అనే ఈ నాలుగు అభయాన్ని కలిగిస్తాయి. అనగా భయాన్ని దూరం చేస్తాయి. అనగా ఆదరం లేక శ్రద్ధగా, అనుష్ఠించకపోతే భయాన్ని కలుగజేస్తాయి.

**అగారదాహీ గరదః కుండాశీ సోమవిక్రయీ**
**పర్వకారశ్చ సూచీ చ మిత్రధ్రుక్పారదారికః 39**
**భ్రూణహా గురు తల్పీ చ యశ్చ స్యాత్పానపో ద్విజః**
**అతితీక్షణశ్చ కాకశ్చ నాస్తికో వేద నిందకః 40**
**స్రువ ప్రగ్రహణో వ్రాత్యః కీనాశశ్చార్థవానపి**
**రక్షేత్యుక్తశ్చ యో హింస్యాత్సర్వే బ్రాహ్మణైః సమాః 41**

నివసిస్తూ ఉండే ఇంటికి నిప్పుపెట్టేవాడు, అక్రమసంతానం యొక్క సంపద తినేవాడు, సోమరసాన్ని అమ్మేవాడు. ఆయుధాలు తయారుచేసేవాడు, చాడీలు చెప్పేవాడు, స్నేహితుడికి ద్రోహం చేసేవాడు, పరభార్యాలోలుడు, భ్రూణహత్యలు చేసేవాడు అనగా కడుపులోని పిండాన్ని చంపేవాడు, గురువు భార్యతో వ్యభిచరించేవాడు, బ్రాహ్మణుడై ఉండి మద్యపానం చేసేవాడు, ఎంతో దుడుకు స్వభావం కలవాడు, కాకిలాంటివాడు అనగా కాకి ముక్కుతో పుండును పొడిచి బాధించువిధంగా, బాధలలో ఉన్న వారిని బాధించేవాడు, పరలోకం లేదనేవాడు, వేదాలను నిందించేవాడు, గ్రామపురోహితుడు అనగా సదాచారం లేక అందరికీ పౌరోహిత్యం చేయించేవాడు, హిత్పుడు అనగా సకాలంలో ఉపనయన సంస్కారం జరుగనివాడు, పాపపు పనివలన లభించే దానితో బ్రతికేవాడు, రక్షింపగల శక్తి ఉండినను శరణన్నవాడిని చంపేవాడు. వీరందరు బ్రహ్మహత్య చేసిన వారితో సమానులు.

**తృణోల్కయా జ్ఞాయతే జాతరూపం యుగే భద్రో వ్యవహారేణ సాధుః**
**శూరో భయేష్వర్థకృచ్ఛ్రేషు ధీరః కృచ్ఛ్రాస్వాపత్సు సుహృదశ్చారయశ్చ 42**

చీకటిలో గడ్డిమంటతో వస్తు స్వరూపం తెలుస్తుంది. శీలంతో లేక వ్యక్తి యొక్క ప్రవర్తనతో ధర్మం తెలుస్తుంది. వ్యవహారం చేత మంచితనం బయటపడుతుంది. భయం కలిగించే సందర్భాలలో శూరుడు తెలుస్తాడు. కష్టాలలో ధీరుడు తెలుస్తాడు. మిత్రులు, శత్రువులు ఆపదలలో బయటపడతారు.

**జరా రూపం హరతి హి ధైర్యమాశా మృత్యుః ప్రాణాన్ధర్మ చర్యామసూయా**
**క్రోధః శ్రియం శీలమనార్యసేవా హ్రియం కామః సర్వమేవాభిమానః 43**

ముసలితనం అందాన్ని హరిస్తుంది. ఆశ ధైర్యాన్ని, మృత్యువు ప్రాణాలను, అసూయ ధర్మాచరణాన్ని, క్రోధం సంపదను నీచసేవ శీలాన్ని, కామం సిగ్గును, అభిమానం అన్నింటినీ హరించివేస్తుంది.

**శ్రీర్మంగలాత్ప్రభవతి ప్రాగలాభ్యత్సంప్రవర్ధతే**
**దాక్ష్యాత్తు కురుతే మూలం సంయమాత్ప్రతితిష్ఠతి 44**

సంపద, శుభప్రవర్తన నుండి పుడుతుంది. ఆ సంపద నేర్పుతో పెరుగుతుంది. సామర్థ్యం వలన వేళ్ళూనుతుంది. సంయమనం వలన స్థిరపడుతుంది.

**అష్టౌ గుణాః పురుషం దీపయంతి ప్రజ్ఞా చ కౌల్యం చ దమః శ్రుతం చ**
**పరాక్రమశ్చాబహు భాషితా చ దానం యథాశక్తి కృతజ్ఞతా చ 45**

ఎనిమిది గుణాలు మానవుని ప్రకాశింపచేస్తాయి. అవి ఏమనగా 1. ప్రజ్ఞ 2. సద్వంశంలో జన్మించటం 3. ఇంద్రియ నిగ్రహం 4. విద్య. 5. పరాక్రమం 6. మితంగా మాట్లాడటం 7. శక్తికి తగినట్లుగా దానం చేయటం. 8. కృతజ్ఞతను కలిగి ఉండటం.

**ఏతాన్గుణాంస్తాత మహానుభావాన్ ఏకో గుణః సంశ్రయతే ప్రసహ్య**
**రాజా యదా సత్కురుతే మనుష్యం సర్వాన్గుణానేష గుణోఽతిభాతి 46**

తండ్రీ! ఈ ఎనిమిది మహాగుణాలను ఒక్క సుగుణం వెంటనే ఆశ్రయిస్తుంది. అది రాజసత్కారం. రాజు సత్కరిస్తే ఈ గుణాలన్నీ వెలుగు చూస్తాయి. బాగుగా రాణిస్తాయి.

**అష్టౌ నృపేమాని మనుష్యలోకే స్వర్గస్య లోకస్య నిదర్శనాని**
**చత్వార్యేషా మన్వవేతాని సద్భిశ్చత్వార్యేషామన్వవయంతి సంతః 47**

**యజ్ఞో దానమధ్యయనం తపశ్ చ చత్వార్యేతాన్యన్వవేతాని సద్భిః**
**దమః సత్యమార్జవమానృశంస్యం చాత్వార్యేతాన్యన్వవయంతి సంతః 48**

రాజా! ఇప్పుడు చెప్పబోయే ఈ ఎనిమిదిగుణాలు ఈ మర్త్యలోకంలోనే స్వర్గం చూపిస్తాయి. వీటిలో నాలుగు సజ్జనులను అవే అనుసరిస్తాయి. యజ్ఞం, దానం, అధ్యయనం, తపస్సు–ఈ నాలుగూ సజ్జనులను అనుసరిస్తాయి. నిగ్రహం, సత్యం, ఆర్జవం, దయ ఈ నాలుగు ప్రయత్నంతో సజ్జనులు అనుసరిస్తారు. లేక సాధిస్తారు. యజ్ఞం, అధ్యయనం, దానం, తపస్సు సత్యం, సహనం, జాలి, లోభం లేకపోవటం – ఈ ఎనిమిది

ధర్మసాధనకు లక్షణాలు, మార్గాలు. అందులో మొదటి నాల్గింటిని కొందరు ఆడంబరం కోసం ఆచరిస్తారు. కాని చివరి నాల్గు గుణాలు మాత్రం సద్బుద్ధి లేనివారి దగ్గఱ ఉండవు.

**న సా సభా యత్ర న సంతి వృద్ధా న తే వృద్ధా యే న వదంతి ధర్మమ్**
**నాసౌ ధర్మో యత్ర న సత్యమస్తి న తత్సత్యం యచ్ఛలేనాను విద్ధమ్ 49**

వృద్ధులు లేని సభ సభేకాదు. ధర్మం చెప్పకపోతే వారు వృద్ధులే కారు. సత్యంలేకపోతే ఆ చెప్పినది ధర్మమే కాదు. కపటంతో కూడినసత్యం సత్యమే కాదు.

**సత్యం రూపం శ్రుతం విద్యా కౌల్యం శీలం బలం ధనమ్**
**శౌర్యం చ చిరభాష్యం చ దశః సంసర్గయోనయః**

సత్యము, రూపము, అధ్యయనము, ఉపాసన, ఉన్నతవంశంలో పుట్టటం, సత్ప్రవర్తన, బలం, ధనం, పరాక్రమం, యుక్తియుక్తంగా మాట్లాడటం అనే –ఈ పది స్వర్గానికి నిచ్చెనలు. అనగా భగవంతుని దయ వలననే ప్రాప్తించునట్టివి.

**పాపం కుర్వన్పాపకీర్తిః పాపమేవాశ్నుతే ఫలమ్**
**పుణ్యం కుర్వన్పుణ్యకీర్తిః పుణ్యమేవాశ్నుతే ఫలమ్ 51**

పాపాసక్తి కల మానవుడు పాపమే చేస్తాడు. పాపఫలాన్నే అనుభవిస్తాడు. పుణ్యాసక్తి కల మానవుడు పుణ్యమే చేసి, దాని ఉత్తమ ఫలాన్ని పొందుతాడు.

**పాపం ప్రజ్ఞాం నాశయతి క్రియమాణం పునః పునః**
**నష్టప్రజ్ఞః పాపమేవ నిత్యమారభతే నరః 52**

అందుచేత నియమ ప్రవర్తన కల మానవుడు పాపం చేయకూడదు. ఎందుచేతననగా, పాపకృత్యం మనిషి యొక్క తెలివిని నశింపచేస్తుంది. మరల అదే పలుమారులు చేస్తాడు. ఆ విధంగా ప్రజ్ఞను పోగొట్టుకొని, నిత్యమూ పాపకార్యమే చేస్తూ ఉంటాడు.

**పుణ్యం ప్రజ్ఞాం వర్ధయతి క్రియమాణం పునః పునః**
**వృద్ధప్రజ్ఞః పుణ్యమేవ నిత్యమారభతే నరః 53**

పుణ్యకార్యం తెలివితేటలను పెంచుతుంది. నిత్యము పుణ్యకార్యాలు చేసే వాని ప్రతిభ పెరుగుతూ ఉంటుంది. దానితో నిత్యము అదే పనిని మళ్ళీ మళ్ళీ చేస్తాడు. పుణ్యాసక్తి కలవాడు పుణ్యకార్యాలు చేస్తూ పుణ్యస్థానమైన స్వర్గం పొందుతాడు. అందుచేత మానవుడు సతతము ఏకాగ్రతతో పుణ్యమే చేయవలెను.

**అసూయకో దందశూకో నిష్ఠురో వైరకృన్నరః**
**సకృచ్ఛ్రం మహదాప్నోతో నాచిరాత్పాపమాచరన్ 54**

అసూయకలవాడు, ఇతరులను మర్మస్థానాలలో కొట్టేవాడు, నిష్ఠురంగా మాట్లాడేవాడు, కలహాలు పెట్టేవాడు, మోసగాడు –వీరు పాపం చేస్తూ ఎంతో దుఃఖం పొందుతూ ఉంటారు.

**అనసూయః కృతప్రజ్ఞః శోభనాన్యాచరన్సదా**
**అకృఛ్రాత్సుఖమాప్నోతి సర్వత్ర చ విరాజతే 55**

అసూయ లేనివాడు, ప్రజ్ఞ కలవాడు, సదా సత్కృత్యాలు చేసేవాడు, అందరికి ఇష్టుడై ఎంతో సుఖాన్ని పొందుతాడు. అంతటను జయము కలిగి విరాజిల్లుతాడు.

**ప్రజ్ఞామేవాగమయతి యః ప్రాజ్ఞేభ్యః స పండితః**
**పాజ్ఞో హ్యవాప్య ధర్మార్థౌ శక్నోతి సుఖమేధితుమ్ 56**

ప్రజ్ఞ కలవారి నుండి ప్రజ్ఞనే తీసుకొనేవాడు పండితుడు. అతడు ఆ ప్రజ్ఞతో ధర్మార్థాలను సాధించే సుఖం పెంచుకుంటాడు.

**దివసేనైవ తత్కుర్యాద్యేన రాత్రౌ సుఖం వసేత్**
**అష్టమాసేన తత్కుర్యాద్యేన వర్షాః సుఖం వసేత్ 57**

రాత్రిపూట సుఖపడటం కోసం పగటిపూటనే ప్రయత్నించాలి. వర్షాకాలంలో సుఖపడటం కోసం మిగిలిన ఎనిమిది నెలలూ కష్టించాలి.

**పూర్వే వయసి తత్కుర్యాద్యేన వృద్ధసుఖం వసేత్**
**యావజ్జీవేన తత్కుర్యాద్యేన ప్రేత్య సుఖం వసేత్ 58**

ముసలితనంలో సుఖపడటం కోసం వయసులో పరిశ్రమించాలి. మరణానంతరం సుఖపడటం కోసం యావజ్జీవితం పరిశ్రమచేయాలి.

**జీర్ణమన్నం ప్రశంసంతి భార్యాంచ గతయౌవనమ్**
**శూరం విగతసంగ్రామం గతపారం తపస్వినామ్ 59**

చక్కగా జీర్ణమైన అన్నాన్ని మంచిదని ప్రశంసిస్తారు. యవ్వనం గడచిన భార్యను అంతా ప్రశంసిస్తారు. యుద్ధంలో జయించిన వీరుని అంతా శ్లాఘిస్తారు. పారంగతుడై తత్త్వమెరిగిన తపస్విని ప్రశంశిస్తారు.

**ధనేనాధర్మలబ్ధేన యచ్ఛిద్రమపిధీయతే**
**అసంవృతం తద్భవతి తతోఽన్యదవ దీర్యతే 60**

అధర్మ మార్గంలో సంపాదించిన ధనంలో దోషం దాగుదామన్నా దాగదు. సరికదా మిగిలిన తప్పు కూడా బయటపడుతుంది. అందువలన అధర్మమార్గంలో ధనం సంపాదన పనికిరాదని సారాంశము.

**గురురాత్మవతాం శాస్తా శాస్తా రాజా దురాత్మనామ్**
**అథ ప్రచ్ఛన్న పాపానాం శాస్తా వైవస్వతో యమః 61**

మనసు అదుపులో ఉన్నవాడిని గురువు శాసిస్తాడు. దుర్మార్గులను రాజు శాసిస్తాడు. రహస్యంగా పాపాలు చేసేవాడిని యముడు శాసిస్తాడు.

**ఋషీణాం చ నదీనాం చ కులానాం చ మహాత్మనామ్**
**ప్రభవో నాధి గన్తవ్యః స్త్రీణాం దుశ్చరితస్యచ 62**

ఋషులు, నదులు, వంశాలు, మహాత్ములు, స్త్రీల దుశ్చరితలు – వీని పుట్టుకలు ఎవరికి తెలియవు.

**ద్విజాతి పూజాభిరతో దాతా జ్ఞాతిషు చార్జవీ**
**క్షత్రియః స్వర్గభాగ్రాజంశ్చిరం పాలయతే మహీమ్ 63**

రాజా! ద్విజులను పూజించుటయందు శ్రద్ధ గలవాడు, దాత, జ్ఞాతులను వంచింపనివాడు, సత్ప్రవర్తన కలవాడు అయిన క్షత్రియుడు చిరకాలం రాజ్యం పాలించగలడు.

**సువర్ణ పుష్పాం పృథివీం చిన్వంతి పురుషాస్త్రయః**
**శూరశ్చ కృత విద్యశ్చ యశ్చ జానాతి సేవితుమ్ 64**

శూరుడు, చక్కని విద్యలు నేర్చినవాడు, సేవించే నేర్పు కలవాడు, వీరు ముగ్గురు ఈ భూమిపై బంగారు పంటలను పండిస్తారు.

**బుద్ధిశ్రేష్ఠాని కర్మాణి బాహుమధ్యాని భారత**
**తాని జంఘా జఘన్యాని భారప్రత్యవరాణిచ 65**

మానవులు చేసే కృత్యాలు, నాల్గురకాలు. వానిలో బుద్ధితో చేసే పనులు శ్రేష్ఠాలు. బాహుబలంతో చేసే పనులు మధ్యమాలు. పిక్కలతో, కాళ్ళతో చేసేవి అధమాలు. మోత మోసేవి అనగా బరువులు మోయటం మొదలైనవి అధమాధమాలు.

**దుర్యోధనే చ శకునౌ మూఢే దుఃశాసనే తథా**
**కర్ణే చైవశ్వర్యమాధాయ కథం త్వం భూతిమిచ్ఛసి 66**

**సర్వైర్గుణైరుపేతాశ్చ పాండవా భరతర్షభ**
**పితృవత్త్వయి వర్తంతే తేషు వర్తస్వ పుత్రవత్** **67**

ఓ భరతవంశాగ్రణీ! దుర్యోధనుడు, శకుని, మూఢుడైన దుశ్శాసనులతో పాటు కర్ణుడు. వీరి మీద ఐశ్వర్యమంతా పెట్టి నీవు వైభవం పొందాలని కోరుకొంటున్నావు? పాండవులైతే సర్వ సద్గుణాలు కలవారు. నీ యెడల ఆ పాండవులు తండ్రివలె ప్రవర్తిస్తున్నారు. అందుచేత నీవు వారి యెడల పుత్రభావంతో ప్రవర్తించు' అని విదురుడు ధృతరాష్ట్రునికి బోధ చేశాడు.

## ముఖ్య విషయములు

**1. తెలివైనవారు అనుసరించాల్సిన విధానాలు :**

- ఇతరులు చెప్పే విషయాలను శ్రద్ధగా వినటం.
- ఇతరులు చెబుతున్న విషయాలను సక్రమంగానూ, త్వరగానూ గ్రహించటం.
- ఇతరుల విషయాల్లో అనవసర జోక్యం కలిగించుకోకపోవటం
- ఫలితాల కోసం తీవ్రంగా తపించకుండా ఉండటం.
- లేని గొప్పతనం తనకు తాను కల్పించుకోకుండా ఉండటం.

**2. కనీసం ఏదో ఒక రంగంలో నైపుణ్యం సంపాదించుకోవడం :**

- సంబంధిత ఇతర రంగాలలో అవసరమైనంత జ్ఞానాన్ని సమకూర్చుకోవటం.
- లక్ష్యాలను సాధించడానికి తప్పుడు విధానాలను, దగ్గరదారులను అనుసరించకుండా ఉండటం.
- అన్ని విషయాలలోనూ ఫలితాత్మకంగా సంభాషణలు జరపడం.
- ఎవరి దగ్గర్నుంచైనా కొత్త విషయాలను నేర్చుకోవటానికి సిద్ధంగా ఉండటం.
- ఎల్లప్పుడు వినయంతో మెలగటం.

**3. ఈ క్రింది వారి నుంచి ఎప్పుడూ సలహాలను స్వీకరించవద్దు :**

- సగం తెలిసిన వ్యక్తుల నుంచి
- కావాలని పనులను ఆలస్యంగా చేసేవారి నుంచి
- సహజసోమరులైనవారి నుంచి
- ఇతరులను అతిగా పొగిడేవారి నుంచి



## 36వ అధ్యాయము

**అత్రైవోదాహరంతీ మమితిహాసం పురాతనమ్**
**ఆత్రేయస్య చ సంవాదం సాధ్యానాం చేతి నః శ్రుతమ్ 1**

**చరంతం హంస రూపేణ మహర్షిం సంశిత వ్రతమ్**
**సాధ్యా దేవా మహాప్రాజ్ఞం పర్యపృచ్ఛన్త వై పురా 2**

అనంతరము ధృతరాష్ట్రునితో విదురుడు "ఈ సందర్భంలో పూర్వం జరిగిన ఒక కథ చెప్పుదురు. అది అత్రిమహాముని కుమారుడగు ఆత్రేయునికి సాధ్యులకు జరిగిన సంవాదం అని విన్నాం. మహాజ్ఞాని, నిష్ఠాపరుడు అయిన ఆత్రేయమహర్షి సన్యాసి రూపంలో తిరుగుతూ ఉంటే ఒకసారి సాధ్యులు ఆయనను ఈ విధంగా ప్రశ్నించారు" అని చెప్పాడు.

**సాధ్యా దేవా వయమస్మో మహర్షే దృష్ట్వా భవంతం న శక్నుమోఽనుమాతుమ్**
**శృతేన ధీరో బుద్ధిమాంస్త్వం మతో నః కావ్యాం వాచం వక్తుమర్హస్యుదారామ్ 3**

సాధ్యులు "మహర్షీ మేము సాధ్యులం. దేవజాతి మాది. మిమ్మలను చూచి మేము గుర్తు పట్టలేకపోతున్నాము. మీరు వేద విజ్ఞానంకల ధీరులు బుద్ధిమంతులు. విజ్ఞాన పూర్వకమైన మంచిమాటలు ఏవైనా చెప్పండి" అని అభ్యర్థించారు.

**ఏతత్కార్యమమరాః సంశ్రుతం మే ధృతిః శమః సత్యధర్మానువృత్తిః**
**గ్రంథి వినీయ హృదయస్య సర్వం ప్రియాప్రియే చాత్మవశం నయీత 4**

పరమహంసయగు ఆత్రేయుడు ఈ విధంగా చెప్పాడు. దేవతలారా! ఇది కర్తవ్యం అని నేను గురువుల వలన విన్నాను. ధైర్యం, శమం, సత్యం, ధర్మం వీనిని నిరంతరంగా పాటించాలి. హృదయంలోని ముడిని విప్పుకొని, అప్రియాన్ని కూడా ఆత్మసమంగా లాగుకొని తీసికొని రావాలి.

**ఆకృశ్యమానో నాక్రోశేన్మన్యురేవ తితిక్షితః**
**ఆక్రోష్టారం నిర్దహతి సుకృతం చాస్య విందతి 5**

తనను ఇతరులు నిందిస్తున్నా, తాను వారిని నిందించకూడదు. ఆ విధంగా సహించేవానిలోని కోపమే ఆ తిట్టే వానిని దహించివేస్తుంది. అంతేకాక ఆ తిట్టే వాని పుణ్యం ఈ సహనశీలికి సంక్రమిస్తుంది.

**నాక్రోశీ స్యాన్నావమానీ పరస్య మిత్రద్రోహీ నోత నీచోపసేవీ**
**న చాతిమానీ న చ హీనవృత్తో రూక్షాం వాచం రుశతీం వర్జయీత 6**

ఇతరులను నిందింపకూడదు. అవమానింపకూడదు. మిత్రద్రోహం చేయకూడదు నీచుని సేవింపరాదు. అభిమానం పనికిరాదు. నీచప్రవర్తన కూడదు. కోపంతో పరుషవాక్కులు మాట్లాడరాదు.

**మర్మాణ్యస్థీని హృదయం తథాసూన్ ఘోరా వాచో నిర్దహంతీహ పుంసామ్**
**తస్మాద్వాచం రుశతీం రూక్షారూపాం ధర్మారామో నిత్యశో వర్జయీత 7**

పరుషవాక్కులు మానవుల మర్మస్థానాలను, ఎముకలను, హృదయాన్ని, ప్రాణాలను దహించివేస్తాయి. అందుచేత ఆ విధంగా దహించి వేసే పరుషవాక్కులను ధర్మపరుడు ఎల్లప్పుడు విడిచిపెట్టవలెను. దరిచేరనీయరాదు.

**అరుంతరం పరుషం రూక్షవాచం వాక్కంటకైర్వితుదంతం మనుష్యాన్**
**విద్యాదలక్ష్మీక తమం జనానాం ముఖే నిబద్ధాం నిరృతిం వహంతమ్ 8**

మర్మచ్ఛేదకంగా పరుషవాక్కులు పలికేవాడిని, మాటల ఈటెలతో మనుష్యులను పొడిచేవాడిని, నాలుక మీద జ్యేష్ఠాదేవిని ధరించిన పరమదరిద్రునిగా భావించాలి.

**పరశ్చేదేనమధివిధ్యేత బాణైర్భృశం సుతీక్షణైరనలార్కదీప్తైః**
**విరిచ్యమానోஉప్యతిరిచ్యమానో విద్యాత్కవిః సుకృతం మేద ధాతి 9**

అగ్ని వలె, సూర్యుని వలె మండిపోయే వాడియైన మాటల బాణాలతో కొడుతూ ఉన్నా, తాను ఆ దెబ్బలు తింటూనే, కాలిపోతూనే పండితుడు నా పుణ్యం ఫలింప జేస్తున్నాడని భావిస్తాడు.

**యది సంతం సేవతే యద్యసంతం తపస్వినాం యది వా స్తేనమేవ**
**వాసో యథా రంగం వశం ప్రయాతి తథా స తేషాం వశమభ్యుపైతి 10**

మానవుడు సజ్జనుని కాని, దుర్జనుని కాని, తపస్విని కాని, దొంగను కాని, ఎవరిని సేవిస్తే వారికే వశుడు అవుతాడు. వస్త్రానికి రంగు అంటినట్లుగా, వారి భావం అంటుకొని పోతుంది. వారికి సంక్రమిస్తుంది.

**వాదం తు యో న ప్రవదేన్న వాదయేద్యో నాహతః ప్రతిహన్యాన్న ఘాతయేత్**
**యో హంతుకామస్య న పాపమిచ్ఛేత్తస్మై దేవాః స్పృహ యన్త్యాగతాయ 11**

హద్దు మీరి మాట్లాడరాదు. మాట్లాడింపరాదు. ఎదుటివాడు కొట్టకుండా కొట్టకూడదు. కొట్టింపకూడదు. పాపం చేసిన అనగా ముందుగా కొట్టిన వాడిని కూడా కొట్టవలయునని అనుకొనని వాని రాకను దేవతలు కూడా అభిలషిస్తారు.

**అవ్యాహృతం వ్యాహృతాచ్ఛ్రేయ ఆహుః సత్యం వదేద్ వ్యాహృతం తద్విత్వీయమ్**
**ప్రియంవదేద్ వ్యాహృతం తీత్తృతయం ధర్మ్యం వదేద్ వ్యాహృతం తచ్చతుర్థమ్ 12**

మాట్లాడటం కంటె మౌనంగా ఉండటం మేలు. మాట్లాడితే సత్యమే మాట్లాడటం రెట్టింపు మేలు. ఆ సత్యం ప్రియంగా మాట్లాడటం మూడు రెట్లు మేలు. ఆ సత్యము, ప్రియము, ధర్మంతో కలసి ఉంటే అది నాల్గురెట్లు మేలు.

**యాదృశైః సంవివదతే యాదృశాంశ్ చోపసేవతే**
**యాదృగిచ్ఛేచ్చ భవితుం తాదృగ్భవతి పూరుషః 13**

మానవుడు ఎటువంటి వారితో సహవాసం చేస్తాడో అటువంటివాడే అవుతాడు. ఎటువంటి వారిని సేవిస్తాడో, అటువంటివాడే అవుతాడు. ఎటువంటివాడు కావాలని కోరుకొంటాడో అటువంటివాడే అవుతాడు.

**యతో యతో నివర్తతే తతస్తతో విముచ్యతే**
**నివర్తనాద్వి సర్వతో న వేత్తి దుఃఖమణ్వపి 14**

మానవుడు దేనినుండి మరలుతాడో దానినుండి విముక్తుడు అవుతాడు. అన్నింటినుండి నివృత్తి పొందటం వలననే నలుసంతైనా దుఃఖం తెలియదు.

**నజీయతే నోత జగీషతేఽన్యాన్న వైరకృచ్చాప్రతిఘాతకశ్ చ**
**నిన్దా ప్రశంసాసు సమస్వభావో న శోచతే హృష్యతి నైవ చాయమ్ 15**

తాను ఓడిపోడు. ఇతరులను ఓడించాలనుకోడు. విరోధం పెట్టుకోడు. ప్రతీకారం చేయడు. నిందాస్తుతులను సమంగా స్వీకరిస్తాడు. అటువంటివాడు దుఃఖించడు. సంతోషించడు.

**భావమిచ్ఛతి సర్వస్య నాభావే కురుతే మతిమ్**
**సత్యవాదీ మృదుర్దాన్తో యః స ఉత్తమపూరుషః 16**

ఉత్తమపురుషుడు అందరికీ అభ్యుదయాన్నే కోరుకొంటాడు. ఎవరికీ కీడు తలపెట్టడు. సత్యం పలుకుతాడు. మృదుస్వభావంతో ఇంద్రియ నిగ్రహం కలిగి ఉంటాడు.

**నానార్థకం సాన్త్వయతి ప్రతిజ్ఞాయ దదాతిచ**
**రాద్ధ్వాపరాద్ధ్వే జానాతి యః సమధ్యమ పూరుషః** **17**

మధ్యమపురుషుడు అప్రయోజకుని బ్రతిమలాడడు. ఇస్తానని వాగ్దానం చేసినది తప్పక ఇస్తాడు. శత్రువు యొక్క లోపాలను తెలుసుకుంటాడు.

**దుఃశాసనస్తూపహంతా న శాస్తా నావర్తతే మన్యువశాత్కృతఘ్నః**
**న కస్యాచిన్మిత్రమథో దురాత్మా కలాశ్చైతాऽధమస్యేహ పుంసః** **18**

అధముడు దుర్మార్గంగా శాసిస్తాడు. దెబ్బలు తింటాడు. నిందలు పొందుతాడు. వచ్చిన కోపం తగ్గించుకోడు. చేసిన మేలు మరచిపోతాడు. ఎవరితోనూ స్నేహం చేయడు.

**నశ్రద్ధధాతి కల్యాణం పరేభ్యోऽప్యాత్మశంకితః**
**నిరాకరోతి మిత్రాణి యో వై సోऽధమ పూరుషః** **19**

ఎవడు తనమీద తనకే నమ్మకం ఉండదు కనుక ఇతరులు కూడా తనకు శుభం కలిగిస్తారని నమ్మడు. తాను ఎవరికి ఉపకారం చేయడు కనుక మిత్రులను నిరాకరిస్తాడు. అట్టివాడే అధమ పురుషుడు.

**ఉత్తమాసేవ సేవేత ప్రాప్తే కాలే తు మధ్యమాన్**
**అధమాంస్తు న సేవేత య ఇచ్ఛేచ్ఛ్రేయ ఆత్మనః** **20**

తన అభ్యుదయాన్ని కోరుకొనేవాడు ఉత్తములనే సేవించాలి. ఆపత్కాలంలో మాత్రం మధ్యములను సేవించవచ్చు. అధములను మాత్రం ఎన్నడూ సేవింపరాదు.

**ప్రాప్నోతివై విత్తమసద్వలేన నిత్యోత్థానాత్ప్రజ్ఞయా పౌరుషేణ**
**న త్వేవ సమ్యగ్లభతే ప్రశంసాం న వృత్తమాప్నోతి మహాకులానామ్** **21**

మానవుడు ధనాన్ని కపటకార్యాలైన ద్యూతాదుల వలన కూడా పొందవచ్చు. నిరంతర ప్రయత్నం చేత, నేర్పుతో చేసే సేవ చేత కూడా ధనం సంపాదించవచ్చు. కానీ నిజాయితీతో కూడిన చక్కని ప్రశంసను పొందలేడు. ఉత్తమ వంశ సంజాతుల ప్రవర్తనను పొందలేడు.

**మహాకులానాం స్పృహయంతి దేశా ధర్మార్థవృద్ధాశ్ర బహుశ్రుతాశ్ చ**
**పృచ్ఛామి త్వాం విదుర ప్రశ్నమేతం భవంతి వై కాని మహాకులాని** **22**

అని విదురుడు ఈ విధంగా హితబోధ చేయగా, వెంటనే ధృతరాష్ట్రుడు "విదురా! నిత్యమూ ధర్మము అర్థము కలిగి గొప్ప పాండిత్యం కల దేవతలు మహాకులీనులను లేక

ఉత్తమ వర్గీయులను కాంక్షిస్తారట కదా! నిన్ను ఒక ప్రశ్న అడుగుతున్నాను. అసలు మహా కులాలు ఏవి? అని ప్రశ్నించాడు.

**తమో దమో బ్రహ్మవిత్త్వం వితానాః పుణ్యా వివాహాః సతతాన్న దానమ్**
**యేష్వేవైతే సప్తగుణా భవంతి సమ్యగ్వృత్తాస్తాని మహాకులాని 23**

ధృతరాష్ట్రుడు అడిగిన ప్రశ్నకు విదురుడు "తపము, దమము (ఇంద్రియ నిగ్రహము, వేద విజ్ఞానం, యజ్ఞ కృత్యాలు, విధి పూర్వక శుభంకర వివాహాలు, సతతము అన్నదానం, సత్ప్రవర్తన అనే ఈ ఏడుగుణాలు ఉండేవారే మహాకులంవారు.

**యేషా నీ వృత్తం వ్యథతే న యోనిర్వృత్తప్రసాదేన చరంతి ధర్మమ్**
**యే కీర్తి మిచ్ఛంతి కులే విశిష్టాం త్యక్తానృతాస్తాని మహాకులాని 24**

స్థిరమైన సత్ప్రవర్తన కలవారు, తనను చూచి సంతోషించే తల్లిదండ్రులు కలవారు, ప్రసన్న హృదయంతో ధర్మం ఆచరించేవారు తమ వంశంలో విశిష్టమైన కీర్తిని అపేక్షించేవారు, అసత్యాన్ని విడిచినవారు. ఈ అయిదుగురు మహావంశజాతులు" అని చెప్పాడు.

**అనిజ్యయా వివాహైర్శ్చ వేదస్యోత్సాదనేన చ**
**కులాన్యకులతాం యాంతి ధర్మస్యాతిక్రమణేనచ 25**

యజ్ఞాలను చేయకపోవటం చేతను, విధి విధానాల ప్రకారం చేసికొనని వివాహాలు వలనను, వేదాన్ని విడిచిపెట్టటం చేతను, ధర్మాన్ని అతిక్రమించటం చేతను, సత్కులాలు చెడిపోతాయి.

**దేవ ద్రవ్యవినాశేన బ్రహ్మస్వ హరణేన చ**
**కులాన్యకులతాం యాంతి బ్రాహ్మణాతిక్రమేణ చ 26**

దేవుని సొమ్మును పాడు చేయటం వలనను, బ్రాహ్మణుని ధనం దొంగిలించటం వలనను, బ్రాహ్మణుని పట్ల హద్దులు మీరటం వలనను సత్కులాలు చెడిపోతాయి.

**బ్రాహ్మణానాం పరిభవాత్పరివాదాచ్చ భారత**
**కులాన్యకులతాం యాంతి న్యాసాపహరణేనచ 27**

బ్రాహ్మణులను అవమానించుట వలనను, అపనిందలవలనను, న్యాసాన్ని అనగా తన వద్ద ఇతరులు దాచిన సొమ్ము లేక వస్తువులను అపహరించటం వలనను కులాలు చెడిపోతాయి.

**కులాని సముపేతాని గోభిః పురుషతోఽశ్వతః**
**కులసంఖ్యాం న గచ్ఛంతి యాని హీనాని వృత్తతః** **28**

**వృత్తతస్త్వవిహీనాని కులాన్యల్పధనాన్యపి**
**కులసంఖ్యాం తు గచ్ఛంతి కర్షంతి చ మయద్యశః** **29**

విద్యల చేతను, సత్పురుషులచేతను, ధనం వలనను వంశాలు వృద్ధి పొందుతాయి. సత్ప్రవర్తన లేకపోతే వంశాలుగా పరిగణింపబడవు. కొద్దిపాటి సంపదలే ఉన్నా, సత్ప్రవర్తనను వదలకపోతే కులాలుగానే పరిగణింపబడతాయి. అంతేకాక మంచి పేరు తెచ్చుకొంటాయి. అనగా సత్కులాలు అనిపించుకుంటాయి.

**మా నః కులే వైరకృత్కశ్చిదస్తు రాజామాత్యో మా పరస్వాపహారీ**
**మిత్రద్రోహీ నైకృతికో ఽనృతీ వా పూర్వాశీ వా పితృదేవాతిథిభ్యః** **30**

మన వంశంలో వైరం పెట్టేవాడు ఒక్కడైనా లేకుండుగాక. ఇతరుల సొమ్మును అపహరించే రాజుగానీ, మంత్రిగానీ ఒక్కడును లేకుండుగాక! మిత్రద్రోహి కాని, వంచకుడు కాని, అబద్ధాల కోరు గానీ ఒక్కడును లేకుండు గాక. అట్లే పితరులకు, దేవతలకు అతిథులకు పెట్టకుండా ముందే భుజించేవాడు లేకుండు గాక.

**యశ్చ నో బ్రాహ్మణం హన్యాద్యశ్చ నో బ్రాహ్మణాన్ద్విషేత్**
**న నః స సమితిం గచ్ఛేద్యశ్చ నో నిర్వపేత్కృషిమ్** **31**

బ్రాహ్మణులను హింసించేవాడు, బ్రాహ్మణులను ద్వేషించేవాడు, మన కృషిని ధ్వంసం చేసేవాడు, మన సభలో ప్రవేశింపకుండును గాక!

**తృణాని భూమిరుదకం వాక్చతుర్థీ చ సూనృతా**
**సతామేతాని గేహేషు నోచ్ఛిద్యంతే కదాచన** **32**

తృణములు (కూర్చొనటానికి మెత్తగా ఉండేటట్లు ఏర్పాటు చేయటానికి) భూమి (కూర్చొనటానికి) నీరు (ముఖము, పాదాలు శుభ్రపరచుకొనటానికి) సత్యవాక్కు. ఈ నాలుగు సన్మార్గంలో ఉండే వారి గృహములలో ఎన్నడూ తరిగిపోవు.

**శ్రద్ధయా, పరయా రాజన్నుపనీతాని సత్కృతిమ్**
**ప్రవృత్తాని మహాప్రాజ్ఞ ధర్మిణాం పుణ్యకర్మణామ్** **33**

రాజా! ధర్మపరాయణులు, పుణ్యాచారుల సత్ప్రవర్తనలు, అతిథులను భక్తితో

సత్కరించాలనుకొన్నప్పుడు, సత్కారంచేయటానికి సిద్ధంగా ఉంటాయి. సత్ప్రవర్తనతో సత్కరింపబడతాయి.

**సూక్ష్మోఽపి భారం నృపతే స్యందనో వై శక్తో వోఢుం న తథాన్యే మహీజాః**
**ఏవం యుక్తా భారసహ భవంతి మహాకులీనా న తథాన్యే మనుష్యాః 34**

రాజా! రథం చిన్నదే అయినా పెద్ద భారాలనే మోస్తుంది. కానీ చెట్లు ఆ విధంగా మోయలేవు. అదే విధంగా మహాకుల సంజాతులైనవారు పెద్ద భారం సహింపగలరు. కానీ ఆ విధంగా ఇతరులు మోయలేరు.

**న తన్మిత్రం యస్య కోపాద్విభేతి యద్వా మిత్రం శంకితో నోపచర్యమ్**
**యస్మిన్మిత్రే పితరీవాశ్వసీత తద్వై మిత్రం సంగతానీతరాణి 35**

తన కోపంతో ఇతరులను భయపెట్టేవాడు మిత్రుడు కాడు. అనుమానంతో సేవ చేసేవాడు మిత్రుడు కాడు. తండ్రిని నమ్మినట్లు నమ్మకం ఉంచదగినవాడే మిత్రుడు. మిగిలినవారు అంతా బంధువులు అవుతారే గాని మిత్రులు కారు.

**యది చేదప్యసంబంధో మిత్రభావేన వర్తతే**
**స ఏవ బంధుస్తన్మిత్రం సా గతిస్తత్పరాయణమ్ 36**

బంధుత్వం లేకుండానే స్నేహభావంతో ప్రవర్తించేవాడే బంధువు. వాడే మిత్రుడు. వాడే గతి. వాడే చివరకు చేరదగినవాడు.

**చలచిత్తస్య వై పుంసో వృద్ధాననుపసేవతః**
**పారిప్లవమతేర్నిత్యమధ్రువో మిత్ర సంగ్రహః 37**

చపలచిత్తుడు, పెద్దలను సేవింపనివాడు, చంచలబుద్ధి కలవాడు అయిన మానవునికి మైత్రి శాశ్వతంగా నిలవదు.

**చలచిత్త మనాత్మానమింద్రియాణాం వశానుగమ్**
**అర్థాః సమతి వర్తంతే హంసాః శుష్కం సరో యథా 38**

నీరు తరిగిపోయిన చెరువు చుట్టూ హంసలు పైపైన తిరిగినట్లు, చంచలచిత్తుడై, ఇంద్రియాలకు వశుడై తిరిగే నీచాత్మునికి సంపదలు అంటకుండా చుట్టూ తిరుగుతాయి.

**అకస్మాదేవ కుప్యంతి ప్రసీదంత్యనిమిత్తతః**
**శీలమేతదసాధూనామభ్రం పారిప్లవం యథా 39**

దుర్మార్గులైన వ్యక్తుల నడవడిక లేక శీలం గాలికి కొట్టుకొని పోయే మేఘం వంటిది. ఎందుకంటే అటువంటి వ్యక్తులు ఉన్నట్లుండి కోపం తెచ్చుకుంటారు. నిష్కారణంగా ప్రసన్నులు అగుతుంటారు. స్థిరత్వం ఉండదు.

**సత్కృతాశ్చ కృతార్థాశ్చ మిత్రాణాం న భవంతి యే**
**తాన్మృతానపి క్రవ్యాదాః కృతఘ్నాన్నోపభుంజతే 40**

మిత్రుల వలన సత్కారాలు పొంది, తమ పనులను నెరవేర్చుకొన్న తరువాత, ఆ మిత్రుల హితం కోరని కృతఘ్నులైన మనుష్యుల శవాలను క్రూరమృగాలు కూడా తినవు.

**అర్థయేదేవ మిత్రాణి సతి వాసతి వా ధనే**
**నానర్థయన్విజానాతి మిత్రాణాం సారఫల్గుతామ్ 41**

ధనం ఉన్నా లేకపోయినా, మిత్రులను తప్పక ఆదరించాలి. ఏ కోరిక లేనివాడు మిత్రుల కలిమి లేములను తెలిసికొనడు.

**సంతాపాద్భ్రశ్యతే రూపం సంతాపాద్భ్రశ్యతే బలమ్**
**సంతాపాద్భ్రశ్యతే జ్ఞానం సంతాపాద్వ్యాధిమృచ్ఛతి 42**

సంతాపం వలన రూపం నశిస్తుంది. దుఃఖం వలన బలం క్షీణించిపోతుంది. ఏడుపు వలన జ్ఞానం తరిగిపోతుంది. అంతేగాక దుఃఖం వలన రోగం ఎక్కువ అవుతుంది.

**అనవాప్యం చ శోకేన శరీరం చోపతప్యతే**
**అమిత్రాశ్చ ప్రహృష్యంతి మా స్మ శోకే మనః కృథాః 43**

ఏడుపు వలన కోరినదిరాదు. అంతేకాక శరీరం ఉడికిపోతుంది. శత్రువులు సంతోషిస్తారు. అందుచేత ఏడుపుపై మనసు పెట్టవద్దు.

**పునర్నరో మ్రియతే జాయతే చ పునర్నరో హీయతే వర్ధతే పునః**
**పునర్నరో యాచతి యాచ్యతే చ పునర్నరః శోచతి శోచ్యతే పునః 44**

మానవుడు మరణిస్తాడు. మరల జన్మిస్తాడు. అదేవిధంగా కృశిస్తాడు. మరల పెరుగుతాడు. తాను ఇతరులను యాచిస్తాడు. ఇతరుల చేత యాచింపబడతాడు. అదేవిధంగా శోకిస్తాడు. ఇతరులు శోకించేటట్లు చేస్తాడు.

**సుఖం చ దుఃఖం చ భావాభావౌ చ లాభాలాభౌ మరణం జీవితం చ**
**పర్యాయశః సర్వమిహ స్పృశంతి తస్మాద్ధీరో నైవ హృష్యేన్న శోచేత్ 45**

సుఖదుఃఖాలు, శుభాశుభాలు, లాభలాభాలు అదేవిధంగా మరణము జీవితము అనే ఇవి అందరికి వంతుల వారీగా వస్తూ ఉంటాయి. అందుచేత ధైర్యవంతుడు వాని కోసం పొంగిపోరాదు. క్రుంగిపోరాదు.

**చలాని హీ మాని షడింద్రియాణి తేషాం యద్యద్వర్తతే యత్ర యత్ర**
**తతస్తతః స్రవతే బుద్ధిరస్య ఛిద్రోదకుంభాదివ నిత్యమంభః 46**

మనసు, పంచేంద్రియాలు చంచలాలు. వాటిలో ఏ ఇంద్రియం, ఏ విషయంలో బాగా ప్రసరిస్తుందో దాని ద్వారా సతతము బుద్ధి జారిపోతూ ఉంటుంది. అది చిల్లులు పడిన కుండ నుండి నీరు నిరంతరం కారిపోయినట్లే జరుగుతుంటుంది.

**తనురచ్ఛః శిఖీ రాజా మిథ్యోపచరితో మయా**
**మన్దానాం మమ పుత్రాణాం యుద్ధేనాంతం కరిష్యతి 47**

**నిత్యోద్విగ్నమిదం సర్వం నిత్యోద్విగ్నమిదం మనః**
**యత్తత్పద మనుద్విగ్నం తన్మేవద మహామతే 48**

అప్పుడు ధృతరాష్ట్రుడు విదురునితో 'ధర్మరాజు దాగి ఉన్న నిప్పువంటివాడు. నేను అతడిని రిత్తయైన ఉపచారాలతో ఉడికించాను. తెలివితక్కువ వారైన నా పుత్రులను యుద్ధంలో చంపివేస్తాడు. ఈ నా పరిస్థితి అంతా భీతితో నిండి ఉన్నది. నా మనస్సు కూడా భయంతో కలత చెందుతున్నది. మహామతీ! విదురా! అభయప్రదమైన స్థితిదేని వలన కలుగుతుందో దానిని నాకు తెలుపుము' అన్నాడు.

**నాన్యత్ర విద్యా తపసోర్నాన్యత్రేంద్రియ నిగ్రహాత్**
**నాన్యత్ర లోభసన్త్యాగాచ్ఛాన్తిం పశ్యామ తేఽనఘ 49**

విదురుడు ధృతరాష్ట్రునితో "పాపరహితుడా! విద్య, తపస్సు, ఇంద్రియ నిగ్రహం, లోభత్యాగం వీనిని మించి నీకు మరియొచ్చటను శాంతి లభించదు.

**బుద్ధ్యా భయంప్రణుదతి తపసా విందతే మహత్**
**గురు శుశ్రూషయా జ్ఞానం శాంతిం త్యాగేన విందతి 50**

మానవుడు బుద్ధిబలంతో భయం తొలగించుకొంటాడు. తపస్సు చేత గొప్పదనం పొందుతాడు. గురుశుశ్రూష చేత జ్ఞానం పొందుతాడు. అదే విధంగా యోగం చేత శాంతిని పొందుతాడు.

**అన్నాశ్రితా దానపుణ్యం వేద పుణ్యమనాశ్రితాః**
**రాగద్వేషవినిర్ముక్తా విచరంతీహ మోక్షిణః 51**

దానం చేయటం వలన కలిగిన పుణ్యాన్ని, వేదోక్త కర్మలు చేయటం వలన కలిగిన పుణ్యాన్ని ఆశ్రయించకుండా రాగద్వేషాలు విడిచినవారు జీవన్ముక్తులై ఇక్కడే సంచరిస్తూ ఉంటారు.

**స్వధీతస్య సుయుద్ధస్య సుకృతస్య చ కర్మణః**
**తపసశ్చ సుతప్తస్య తస్యాంతే సుఖమేధతే** **52**

ఆసక్తితో అభ్యసించిన విద్య, ధర్మబద్ధంగా చేసిన యుద్ధము, చక్కగా అనగా నిష్కామంగా చేసిన సత్కర్మ, నియమంతో చేసిన తపస్సు, ఈ నాలుగూ చివరకు సుఖమును చేకూరుస్తాయి.

**స్వాస్తీర్ణాని శయనాని ప్రపన్నా న వై భిన్నా జాతునిద్రాం లభంతే**
**న స్త్రీషు రాజన్నతిమాప్నువంతి న మాగధైః స్తూయమానా న సూతైః** **53**

జ్ఞాతులతో భేదదృష్టి కలవారికి పట్టుపరుపులపై పడుకున్నను, నిద్రపట్టదు. స్త్రీలపై ప్రీతి, ఆసక్తి కలుగదు. వందిమాగధులు స్తుతిస్తూ ఉన్నా తృప్తి కలుగదు.

**నవై భిన్నా జాతు చరంతి ధర్మంనవై సుఖం ప్రాప్నువంతీహ భిన్నాః**
**న వై భిన్నాగౌరవం మానయంతి న వై భిన్నాః ప్రశమం రోచయంతి** **54**

భేదబుద్ధి కలవారు ఎన్నడును, ధార్మికంగా ప్రవర్తింపలేరు. ఇక్కడ సుఖాన్ని గౌరవాన్ని పొందలేరు. ప్రశాంతత పొందలేరు.

**నవై తేషాం స్వదతే పథ్యముక్తం యోగక్షేమం కల్పతే నోత తేషామ్**
**భిన్నానాం వై మనుజేంద్ర పరాయణం న విద్యతే కిం చిదన్యద్వినాశాత్** **55**

భేదబుద్ధి కలవారికి హితమైన మాటలు రుచింపవు. వారికి యోగక్షేమాలు కలుగవు. భేదదృష్టి కలవారికి వినాశం తప్ప మరో గతి ఏమాత్రం కనపడదు.

**సంభావ్యం గోషు సంపన్నం సంభావ్యం బ్రాహ్మణే తపః**
**సంభావ్యం స్త్రీషు చాపల్యం సంభావ్యం జ్ఞాతితో భయమ్** **56**

గోవులలో సంపదను భావింపవచ్చును. బ్రాహ్మణునిలో తపస్సును భావింపవచ్చును. స్త్రీలలో చాపల్యం ఊహింపవచ్చును. జ్ఞాతుల (దాయాదుల) నుండి భయమును ఊహించవచ్చును.

**తంతవోఽప్యాయతా నిత్యం తంతవో బహులాః సమాః**
**బహూన్బహుత్వాదాయాసాంసహంతీత్యుపమా సతామ్** **57**

చాలా తంతువులు (దారాలు) నిత్యము చాలా కాలం కలిసి ఉండటం చేతను, చాలా ఎక్కువ సంఖ్యలో ఉండటం చేతను, ఎంతో బరువును తట్టుకొనగల్గుతాయి. సజ్జనులైన వారికి ఇదే పోలిక వర్తిస్తుంది. అనగా చాలా కాలం పాటు అందరూ కలసి ఉంటే వారి బలం అధికం అవుతుంది.

**ధూమాయంతే వ్యపేతాని జ్వలంతి సహితానిచ**
**ధృతరాష్ట్రోల్ముకానీవ జ్ఞాతయో భరతర్షభ 58**

భరతవంశాగ్రణీ! ధృతరాష్ట్రా! జ్ఞాతులు అనగా దాయాదులు కొఱువుల వలె విడివిడిగా ఉన్నప్పుడు, పొగలు మాత్రం కక్కుతారు. కానీ అందరు కలసి ఉంటే పెద్ద మంటవలె వెలిగిపోతారు అనగా ప్రకాశిస్తారు.

**బ్రాహ్మణేషు చ యే శూరాః స్త్రీషు జ్ఞాతిషు గోషు చ**
**వృంతాదివ ఫలం పక్వం ధృతరాష్ట్ర పతంతి తే 59**

ధృతరాష్ట్రా! బ్రాహ్మణులయందు, స్త్రీలయందు, జ్ఞాతులయందు, గోవులయందు, తమ పరాక్రమం, చూపించేవారు తొడిమనుండి పక్వానికి వచ్చిన ఫలం రాలిపడినట్లు పతనం చెందుతారు.

**మహానప్యేకజో వృక్షో బలవాన్సుప్రతిష్ఠితః**
**ప్రసహ్య ఏవ వాతేన శాఖా స్కంధం విమర్దితుమ్ 60**

పెద్దదిగా ఉండి, లోతుగా వేళ్ళు పాతుకొని పోయి ఉండి విడిగా ఉన్న పెద్ద చెట్టును కూడా పెద్ద వాయువు ఒక్క క్షణంలో, మానుతో వేళ్ళతో సహా పెళ్ళగించివేయగలదు.

**అథ యే సహితా వృక్షాః సంఘశః సుప్రతిష్ఠితాః**
**తేహి శీఘ్రతమాన్వాతాంసహంతేఽన్యోన్యసంశ్రయాత్ 61**

అవే వృక్షాలు కలసికట్టుగా వేళ్ళూని ఉండి, ఒకదానితో ఒకటి పరస్పరము అల్లుకొని ఉంటే తీవ్రమైన వేగం కల గాలులను సహితం తట్టుకొని నిలువగలవు.

**ఏవం మనుష్యమప్యేకం గుణైరపి సమన్వితమ్**
**శక్యం ద్విషంతో మన్యంతే వాయుర్ద్రుమమివైకజమ్ 62**

అదేవిధంగా గుణవంతులైనప్పటికి, ఒంటరివాడైతే ఒంటరి చెట్టును గాలి పెళ్ళగించినట్లుగా పెళ్ళగించి వేయవచ్చునని శత్రువులు భావిస్తారు.

**అన్యోన్య సముపష్టంభాదన్యోన్యాపాశ్రయేణ చ**
**జ్ఞాతయః సంప్రవర్ధంతే సరసీవోత్పలాన్యుత 63**

ఒకరికొకరు అండగా ఉండటం వలనను, అన్యోన్యంగా కలసి ఉండటం వలనను జ్ఞాతులు సరస్సులోని పద్మాల వలె వృద్ధి పొందగల్గుతారు.

**అవధ్యా బ్రాహ్మణా గావో స్త్రియో బాలాశ్చ జ్ఞాతయః**
**యేషాం చాన్నాని భుంజీత యే చ స్యుః శరణాగతాః 64**

బ్రాహ్మణులు బ్రహ్మవేత్తలు, గోవులు, జ్ఞాతులు, పసిపిల్లలు, స్త్రీలు, అన్నం పెట్టినవారు, శరణుకోరినవారు అగు వీరు చంపదగిన వారు కాదు.

**న మనుష్యే గుణః కశ్చిదన్యో ధనవతామ్ అపి**
**అనాతురత్వాద్భద్రంతే మృతకల్పాహి రోగిణః 65**

ధనవంతుడు కావటం, ఆరోగ్యంగా ఉండటం అనే ఈ రెండింటిని మించిన గుణం లేదు. ఆరోగ్యం లేక రోగంతో ఉండేవారు చనిపోయిన వారి వంటివారు, నీవు ఆరోగ్యంగా ఉంటేనే, నీకు మంచి కలిగించే వానిని సాధించగలవు.

**అవ్యాధిజం కటుకం శీర్ష రోగం పాపానుబంధం పరుషం తీక్ష్ణముగ్రమ్**
**సతాం పేయం యన్న పిబంత్యసంతో మన్యుం మహారాజ పిబ ప్రశామ్య 66**

రాజా! కోపం రోగం లేకుండానే ఘాటును కలిగించేది, తలనొప్పి కలిగించేది, పాపాల పరంపరను పుట్టించేది, కఠినమైనది, తీక్ష్ణము, వేడి అయినది, సజ్జనులు మ్రింగేది, దుర్జనులు మ్రింగేది, దుర్జనులు మ్రింగలేనిది. అయిన కోపాన్ని దిగమ్రింగి ప్రశాంతచిత్తుడవు కమ్ము. నీకు శుభమగు గాక!

**రోగార్దితా నఫలాన్యాద్రియంతే న వై లభంతే విషయేషు తత్త్వమ్**
**దుఃఖోపేతా రోగిణో నిత్యమేవ న బుధ్యంతే ధనభోగాన్న సౌఖ్యమ్ 67**

రోగపీడితులు ఫలాలను అనగా పుత్రులు, పశ్వాది సంపదలను అనుభవించలేరు. విషయ సుఖాలతత్త్వాన్ని పొందలేరు. రోగులకుసతతము దుఃఖమే కలుగుతూ ఉంటుంది. ధనం వలన లభించే భోగాలు కానీ సుఖం కానీ వారికి తెలియరావు.

**పురా హ్యుక్తో నాకరోస్త్వం వచో మే ద్యూతే జితాం ద్రౌపదీం ప్రేక్ష్య రాజన్**
**దుర్యోధనం వారయేత్యక్షవత్యాం కితవత్వం పండితా వర్జయంతి 68**

రాజా! జూదంనాడు పరాభవింపబడిన ద్రౌపదిని చూచి దుర్యోధనుని వారింపుమని నేను చెప్పితిని. కానీ నా మాటను నీవు పాటించలేదు. పండితులైనవారు జూదం మీద ఆసక్తిని త్యజిస్తారు.

**న తద్బలం యన్మృదునా విరుధ్యతే మిశ్రో ధర్మస్తరసా సేవితవ్యః**
**ప్రధ్వంసినీ క్రూరసమాహితా శ్రీ మృదుప్రౌఢా గచ్ఛతి పుత్రపౌత్రాన్ 69**

మెత్తని వారితో విరోధించే బలం నిజమైన బలం కాదు. సూక్ష్మమైన ధర్మాన్ని శీఘ్రమే ఆచరించాలి. క్రూరుని సంపద నశించిపోతుంది. మృదుస్వభావుల దగ్గర వృద్ధి నొందిన సంపద పుత్రపౌత్రాదులకు చేరుతుంది.

**ధార్తరాష్ట్రాః పాండవాన్పాలయంతు పాండోః సుతాస్తవ పుత్రాంశ్చ పాంతు**
**ఏకారిమిత్రాః కురవో హ్యేకమంత్రా జీవంతు రాజాన్సుఖినః సమృద్ధాః 70**

రాజా! ఈ కారణాల చేత నీ కుమారులు పాండవులను రక్షించాలి. పాండుకుమారులు నీ పుత్రులను రక్షించాలి. ఇద్దరికీ శత్రువైనా మిత్రుడైనా ఒకడే కావాలి. ఇద్దరికి కర్తవ్యం ఒకటే కావాలి. ఆ విధంగా సంపత్సమృద్ధితో సుఖులై జీవించాలి.

**మేఢీభూతః కౌరవాణాం త్వమద్య త్వయ్యాధీనం కురు కులమాజమీఢ**
**పార్థాన్బాలాన్వనవాస ప్రతప్తాన్ గోపాయస్వ స్వం యశస్తాత రక్షన్ 71**

రాజా! ఇప్పుడు ఈ కురువంశస్తులందరకు నీవే కట్టుకొయ్యవంటి వాడవు. కురువంశమంతా నీకు వశమై ఉన్నది. అజామీఢ వంశంలో పుట్టినవాడవు నీవు. బాలురు, అరణ్యవాస సంతాపంతో ఉన్న కౌంతేయులను రక్షించి నీ కీర్తిని నిలబెట్టుకో.

**సంధత్స్వ త్వం కౌరవాన్పాండుపుత్రైర్మా తేఽనంతరం రిపవః ప్రార్థయన్తు**
**సత్యే స్థితాస్తే నరదేవ సర్వే దుర్యోధనం స్థాపయ త్వం నరేంద్ర 72**

కౌరవ వంశనాథా! నీవు పాండు పుత్రులతో కౌరవులను కలిపి ఉంచు. నీ శత్రువులు నీ లోపాలను వెదుకకుందురు గాక! వారు (పాండవులు) సత్యము మీద నిలిచి ఉన్నారు. నీవు నీ కుమారుడు దుర్యోధనుని సత్యంపై నిలిపిఉంచు.



## ముఖ్య విషయములు

**1. ఈ నాలుగు రకాల మనుష్యులను పోషించాలి :**

- వృద్ధులైన బంధువులు
- పేదవారైన మంచి స్నేహితులు
- ఉన్నత స్థితి నుంచి తొలగి, పేదవారిగా జీవిస్తున్నవారు
- భర్త లేని పిల్లలు గల సోదరి
- ఎల్లప్పుడు ఇంద్రియ నిగ్రహం పాటించాలి. ఎందుకంటే కుండకు ఒక చిల్లి పడినా అందులో ఉన్న మొత్తం నీరు కారిపోతుంది. అలాగే ఏ మాత్రం నిగ్రహం కోల్పోతే వ్యక్తి అధఃపతనం చెందుతాడు.

**2. తెలివైనవాడు ఈ ఆరింటినీ భద్రంగా కాపాడుకోవాలి. లేకపోతే అవి మనల్ని వదలిపోతాయి :**

1. గోవు 2. భార్య 3. భృత్యులు (సేవకులు) 4. వ్యవసాయం 5. తక్కువ స్థితి గల వారి స్నేహం 6. జ్ఞానం

**3. తెలివి గల వాని ప్రవర్తన ఇలా ఉండాలి :**

- చరాచర వస్తువులు అన్నింటి గుణములను, లక్షణాలను అవగాహన చేసుకోవాలి. తన పనులు ఇతరులు చేసే పనులను పూర్తిగా అర్థం చేసుకొని వాటి ఫలితాలను ముందుగా గ్రహించగల్గి ఉండాలి.
- ఇతరులు చేసే మంచి పనులను నిరంతరం పరిశీలిస్తూ వాటి ఫలితాలను గ్రహిస్తుండాలి.
- కొద్దిపాటి వనరులతో అత్యంత లాభాన్ని, ఉపయోగాలను పొందుతూ త్వరగా నిర్వర్తించగలిగే పనులను గ్రహించుకోగలగాలి.

**4. అతి ముఖ్యకార్యాలను నిర్వహించుటలో తీసుకోవాల్సిన మెలకువలు :**

- పెద్ద పెద్ద కార్యాలను నిర్వహించే బాధ్యతను తీసుకొనటానికి ముందు దానికి సంబంధించిన అన్ని విషయాలను క్షుణ్ణంగా పరిశీలించాలి.
- అవి దేనికి సంబంధించినవో తెలుసుకొని, దాని వలన కలిగే లాభము నష్టాలను గ్రహించాలి.
- ఆ పనిని చేయటానికి అవసరమైన వనరుల గురించి తెలుసుకొనాలి.
- దానిని నిర్వహించడానికి గల శక్తియుక్తులను ముందుగా అంచనా వేసుకోవాలి.
- దానిని నిర్వహించడంలో వచ్చే అవాంతరాలను తెలుసుకొని అధిగమించే ఉపాయాలను అన్వేషించాలి.
- ఒకసారి ఆ పని చేయడానికి నిర్ణయించుకొన్న తర్వాత, త్వరగా ఆ పని చేయాలి. ఇతరుల బలవంతం మీద చేయటానికి సిద్ధపడకూడదు.



## ○ 37 వ అధ్యాయము

**సప్తదశేమాన్రాజేంద్ర మనుః స్వాయంభువోఽబ్రవీత్**
**వైచిత్రవీర్య పురుషానాకాశం ముష్టిభిర్ఘ్నతః 1**
**తానేవింద్రస్య హి ధనురనామ్యం నమతోఽబ్రవీత్**
**అథో మరీచినః పాదాననామ్యాన్నమతస్తథా 2**

అనంతరము విదురుడు ధృతరాష్ట్రునితో "విచిత్రవీర్యనందనా! స్వాయంభువ మనువు (చెప్పబోవు) ఏడుగురుని, ఇంకొక పదుగురిని 1. ఆకాశాన్ని పిడికిళ్ళతో పొడిచే వారిగాను, 2. వంచటానికి శక్యం కాని ఇంద్రధనస్సును వంచటానికి ప్రయత్నించేవారిగాను, 3. పట్టటానికి శక్యంకాని సూర్యకిరణాలను పట్టటానికి ప్రయత్నించేవారిగాను తెలిపాడు.

**యశ్చాశిష్యం శాసతి యశ్చ కుప్యతే యశ్చాతివేలం భజతే ద్విషంతమ్**
**స్త్రియశ్చ యోఽరక్షతి భద్రమస్తు తే యశ్చాయాచ్యం యాచతి యశ్చ కత్థతే 3**
**యశ్చాభిజాతః ప్రకరోత్యకార్యం యశ్చాబలో బలినా నిత్యవైరీ**
**అశ్రద్ధధానాయ చ యో బ్రవీతి యశ్చాకామ్యం కామయతే నరేంద్ర 4**
**బద్ధ్వా హాసం శ్వశురోయశ్ చ మన్యతే బద్ధ్వా వసన్నుత యో మానకామః**
**పరక్షేత్రే నిర్వపతి యశ్చ బీజం స్త్రియం చ యః పరివదతేఽతివేలమ్ 5**
**యశ్చైవ లబ్ధ్వా న స్మరామీత్యువాచ దత్త్వాచయః కత్థ్వతి యాచ్యమానః**
**యశ్చాసతః సాన్త్వముపాసతీహ ఏతేఽను యాన్త్యనిలం పాశహస్తాః 6**

ఇవి చేయలేని పనులు. ఆ పనులను చేయాలనుకోవటం మూర్ఖత్వమే. అనగా ఈ 17గురు మూర్ఖులు అని భావం. అవి ఇవి. 1. ఆజ్ఞాపించకూడని వానిని ఆజ్ఞాపించటం 2. అనవసరంగా అంటే అతి స్వల్పలాభంతో సంతోషపడేవాడు 3. శత్రువును హద్దు మీరి సేవించేవాడు. 4. స్త్రీలను రక్షించి దాని వలన లాభం పొందాలనుకునేవాడు 5. యాచింపదగని వానిని యాచించేవాడు 6. కొంచెం మాత్రమే చేసి అతి గొప్పగా చెప్పుకొనేవాడు 7. సద్వంశంలో పుట్టి చేయరాని పనులు చేసేవాడు 8. బలహీనుడై ఉండి కూడా బలవంతునితో నిత్యమూ వైరం పెట్టుకొనేవాడు. 9. శ్రద్ధ లేనివారికి ఉపదేశం చేసేవాడు 10. కోరకూడని వాటిని కోరుకొనేవాడు 11. కోడలితో వెకిలిమాటలు ఇష్టంగా

భావించేవాడు12.కోడలి దగ్గర భయం పోగొట్టుకొని,మళ్ళీ గౌరవం కావాలనుకునేవాడు13. ఇతరుని క్షేత్రంలో విత్తనం నాటేవాడు 14. స్త్రీని హద్దు మీరి నిందించేవాడు 15. ఉపకారం పొంది గుర్తు లేదని వాదించేవాడు 16. వాగ్దానం మాత్రం చేసి, ఇవ్వకుండానే దానం చేశానని పొగడుకొనేవాడు 17. దుర్జనుని నుంచి మంచితనం పొందాలను కొనేవాడు. ఈ 17 గురిని యమభటులు తమ పాశాలతో బంధించి లాగుకొనిపోతారు.

**యస్మిన్‌యథా వర్తతే యో మనుష్యస్ తస్మింస్తథా వర్తితవ్యం స ధర్మః**
**మాయాచారో మాయయా వర్తితవ్యః సాధ్వాచారః సాధునా ప్రత్యుదేయః 7**

ఇతరుల యెడల తాను ఏవిధంగా ప్రవర్తిస్తే వారు కూడా తన యెడల అదే విధంగా ప్రవర్తిస్తారు. అదే ధర్మం కూడా. మాయావి యెడల మాయతోనే ప్రవర్తిస్తారు. సజ్జనుని పట్ల సన్మార్గంలోనే ప్రవర్తించాలి.

**శతాయురుక్తః పురుషః సర్వవేదేషు వై యదా**
**నాప్నోత్యథ చ తత్సర్వమాయుః కేనేహ హేతునా 8**

ఈ విధంగా విదురుడు చెప్పగా ధృతరాష్ట్రుడు “అన్ని వేదాలలోను పురుషుని ఆయుర్దాయం నూరు సంవత్సరాలని చెప్పబడింది కదా! అయినా ఏ కారణం చేత మనుష్యులందరు చెప్పబడిన ప్రకారం నూరు సంవత్సరాలు జీవించటం లేదు” అని ప్రశ్నించాడు.

**అతివాదోఽతిమానశ్చ తథాత్యాగో నరాధిపః**
**క్రోధశ్చాతివివిత్సా చ మిత్రద్రోహశ్చ తాని షట్ 9**

**ఏత ఏవాసయస్తీక్షణాః కృన్తన్త్యాయూంషి దేహినామ్**
**ఏతాని మానవాన్ఘ్నంతి న మృత్యుర్భద్ర మస్తు తే 10**

ధృతరాష్ట్రుడు వెలిబుచ్చిన సందేహానికి విదురుడు “రాజా! దురభిమానం, అతిగా మాట్లాడటం, దానం చేయకపోవటం, క్రోధం, తన్ను మాత్రమే పోషించుకోవాలనుకొనటం, మిత్రద్రోహం ఈ ఆరుపదునైన కత్తులు. మానవుల ఆయువులను తెగకోస్తాయి. ఇవే నిజానికి మానవులను చంపుతాయి. కానీ మృత్యువు కాదు. మహారాజా! నీకు శుభం కలుగు గాక” అన్నాడు.

**విశ్వస్తస్యైతి యో దారాన్యశ్చాపి గురు తల్పగః**
**వృషలీ పతిర్ద్విజో యశ్చ పానపశ్చైవ భారత 11**

**శరణాగతహా చైవ సర్వే బ్రహ్మహణైః సమాః**
**ఏతైః సమేత్య కర్తవ్యం ప్రాయశ్చిత్తమితి శ్రుతిః** **12**

నమ్మిన వాని భార్యను పొందేవాడు, గురుపత్నిని పొందేవాడు, ద్విజుడై శూద్రవనితను పెండ్లి ఆడినవాడు, మద్యపానం చేసేవాడు, విప్రులను ఆజ్ఞాపించేవాడు, విప్రుల జీవనోపాధిని పాడు చేసేవాడు, విప్రులను సేవక వృత్తిలో పెట్టేవాడు, శరణు వేడిన వారిని చంపేవాడు వీరందరూ బ్రహ్మహత్య చేసినవారితో సమానం. వీరితో సహవాసం చేసినవారు కూడా ప్రాయశ్చిత్తం చేసుకోవాలని వేదం తెలుపుతున్నది.

**గృహీ వదాన్యోఽనపవిద్ధ వాక్యః శేషాన్నభోక్తాప్యవిహింసకశ్చ**
**నానర్థకృత్త్యక్తకలిః కృతజ్ఞః సత్యో మృదుః స్వర్గముపైతి విద్వాన్** **13**

పెద్దల మాటలను ఆదరించేవాడు, నీతిని అధిగమించనివాడు, దాతయైనవాడు, దేవతలకు, అతిథులకు పెట్టిన తరువాత మిగిలిన అన్నం తినేవాడు, హింస చేయనివాడు, కీడు కలిగించే పనులతో కలతపడటం ఎరుగనివాడు, చేసిన మేలును మరువనివాడు, సత్యశీలి, మెత్తని లేక శాంత స్వభావం కల పండితుడు స్వర్గం పొందగలడు.

**సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః**
**అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః** **14**

రాజా! సదా ప్రియంగా మాట్లాడేవారు తేలికగా దొరుకుతారు. అప్రియమైనా, హితం చెప్పేవాడు, దానిని వినేవాడు దొరకటం చాలా దుర్లభం. అనగా కష్టం అని భావము.

**యో హి ధర్మం వ్యపాశ్రిత్య హిత్వా భర్తుః ప్రియాప్రియే**
**అప్రియాణ్యాహ పథ్యాని తేన రాజా సహాయవాన్** **15**

రాజా! ఎల్లప్పుడు ప్రియంగా మాట్లాడేవారు తేలికగా దొరుకుతారు. ప్రియమా! అప్రియమా! అనేది వదలివేసి, ధర్మం మాత్రమే గ్రహించి రాజుకు అప్రియమైనా మేలు కలిగించే మాటలు చెప్పేవాడే రాజుకు నిజమైన సహాయకుడు.

**త్యజేత్కులార్థే పురుషం గ్రామస్యార్థే కులం త్యజేత్**
**గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజేత్** **16**

కులం కోసం ఒకరిని విడిచిపెట్టవచ్చును. గ్రామం కోసం కులాన్ని అంతటిని విడువవచ్చును. దేశం కోసం గ్రామం విడువవచ్చు. తన కోసం భూమినంతటిని కూడా త్యజించవచ్చును.

**ఆపదర్థే ధనం రక్షేర్ద్దారాన్ రక్షేద్ధనైరపి**
**ఆత్మానం సతతం రక్షేద్ దారైరపి ధనైరపి 17**

ఆపదలు వచ్చినప్పుడు ధనాన్ని రక్షించుకోవాలి. తనకు గల ధనాన్ని అంతటిని వినియోగించి అయినా భార్యను రక్షించుకోవాలి. భార్యను, ధనాన్ని ఉపయోగించి అయినా తనను రక్షించుకోవాలి.

**ఉక్తం మయా ద్యూతకాలేఽపి రాజన్నైవం యుక్తం వచనం ప్రాతిపీయ**
**తదౌషధం పత్యమివాతురస్య న రోచతే తవ వైచిత్రవీర్య 18**

పూర్వకాలం నుండి జూదం రాజులకు వైరం కల్గిస్తుందని చెప్పబడుతున్నది. అందువలన విజ్ఞుడైన వాడెవ్వడు నవ్వులాటకు కూడా జూదం ఆడకూడదు. విచిత్ర వీర్యనందనా! ఆనాడు జూదం ఆడే సమయంలోనే ఇది మంచిది కాదని చెప్పాను. కానీ మహారాజా! రోగికి పథ్యం రుచించనట్లుగా నేను చెప్పిన మాటలు నీకు రుచించలేదు.

**కాకైరిమాంశ్చిత్రబర్హాన్మయూరాన్ పరాజైష్ఠాః పాండవాన్ధార్త రాష్ట్రైః**
**హిత్వా సింహాన్క్రోష్టకాన్గూహమానః ప్రాప్తే కాలే శోచితా త్వం నరేంద్ర 19**

రాజా! చిత్రమైన చక్కని పింఛాలున్న నెమళ్ళవంటి పాండవులను కాకుల వంటి నీ కొడుకులతో ఓడించగలవా? సింహాలను విడిచిపెట్టిన నక్కలను చేరదీసి సమయం వచ్చిన కాలంలో అందుకోసం విచారిస్తున్నావు.

**యస్తాత న క్రుధ్యతి సర్వకాలం భృత్యస్య భక్తస్య హితే రతస్య**
**తస్మిన్భృత్యా భర్తరి విశ్వసన్తి న చైనమాపత్సు, పరిత్యజంతి 20**

ప్రభూ! తన ప్రభువు యొక్క హితం మీదనే దృష్టి పెట్టి భక్తితో సేవ చేసే సేవకునిపై ఎన్నడూ కోపించని రాజును సేవకులు నమ్ముతారు. ఆపదలలో కూడా ఆ రాజును విడిచిపెట్టరు.

**న భృత్యానాం వృత్తి సంరోధనేన బాహ్యం జనం సజ్జిఘృక్షేదపూర్వమ్**
**త్యజంతి హ్యేనముచితావరుద్ధాః స్నిగ్ధా హ్యమాత్యాః పరిహీనభోగాః 21**

తన సేవకుల జీవికను పోగొట్టి ఇతరుల రాజ్యాన్ని, ధనాన్ని లాగుకొనకూడదు. ఆ విధంగా మోసగిస్తే, పూర్వం తనతో స్నేహంగల మంత్రులు మొదలైన వారందరూ భోగాలు లేనివారై ఆ రాజును వదలివేసి పోతారు.

**కృత్యాని పూర్వం పరిసంఖ్యాయ సర్వాణ్యాయవ్యయావనురూపాం చ వృత్తిమ్**
**సఙ్గృహ్ణీయాదనురూపాన్సహాయాన్ సహాయసాధ్యాని హి దుష్కరాణి 22**

ముందుగానే చేయదగిన పనులను అన్నీ నిశ్చయించుకొని, ఆదాయవ్యయాలు లెక్కకట్టుకొని సేవలకు అనురూపమైన అనగా వారి సేవలకు తగినట్లుగా ఉండే జీతాలను కూడా లెక్కించుకొని తనకు అనుకూలమైన వారి నుండి రాజు సహాయం పొందవలెను. అనురూపత కలిగి ఉండడం చేత పొందరానిది ఉండదు. తనకు అసాధ్యమైన దానిని సహాయుల ద్వారా సాధ్యపరచుకొనవలయును.

**అభిప్రాయం యో విదిత్వా తు భర్తుః సర్వాణి కార్యాణి కరోత్యతంద్రీః**
**వక్తా హితానామనురక్త ఆర్యః శక్తిజ్ఞ ఆత్మేవ హి సోఽనుకంప్యః 23**

రాజు యొక్క అభిప్రాయం తెలిసికొని, ఎట్టి ఏమరుపాటు లేకుండా పనులన్నింటిని చేసేవాడు, హితంగా మాట్లాడేవాడు రాజు యెడ భక్తి కలవాడు, సన్మార్గుడు, విరుద్ధంగా తనతో ప్రవర్తించేవాడు అయినా, తన శక్తిని తాను ఎరిగినవాడు, అట్టి సేవకుని రాజు తన లాగానే దయతో ప్రవర్తించాలి.

**వాక్యం తు యో నాద్రియతే ఽనుశిష్టః ప్రత్యాహ యశ్చాపి నియుజ్యమానః**
**ప్రజ్ఞాభిమానీ ప్రతికూలవాదీ త్యాజ్యః స తాదృక్త్వరయైవ భృత్యః 24**

రాజు ఆజ్ఞను పాటించనివానిని, పని చెపితే, ఆచరించకుండా ఎదురు చెప్పేవాడిని, తన తెలివి మీద మాత్రమే అతి అభిమానం కలవానిని అనగా తన తెలివితేటల మీద అతి నమ్మకం కలవానిని, తనకు వ్యతిరేకంగా మాట్లాడేవాడిని, వెంటనే కొలువు నుండి తొలగించివేయాలి.

**అస్తబ్ధమక్లీబమదీర్ఘసూత్రం సానుక్రోశం శ్లక్ష్ణ మహార్యమన్యైః**
**అరోగజాతీయముదారవాక్యం దూతం వదంత్యష్టగుణోపపన్నమ్ 25**

విద్వాంసులు దూత అనే వానికి ఎనిమిది లక్షణాలుండాలని తెలుపుతున్నారు. అవి 1. గర్వం లేనివాడు 2. సమర్థుడు 3. త్వరగా పనిని సానుకూలం చేసేవాడు 4. దయాగుణం కలవాడు 5. అందరికీ హితుడు 6. ఇతరులు ఆశ చూపితే లోబడని వాడు 7. రోగరహితుడు 8. ఉదారంగా మాట్లాడేవాడు అయి ఉండాలి.

**న విశ్వాసాజ్జాతు పరస్య గేహం గచ్ఛేన్నరశ్చేతయానో వికాలే**
**న చత్వారే నిశి తిష్ఠేన్నిగూఢో నరాజన్యాం యోషితం ప్రార్థయీత 26**

తెలివైనవాడు, కాని సమయంలో అంటే సాయంకాలపు మునిమాపు వేళ శంకాకులుని అనగా అనుమానించటానికి ఆస్కారం గల ప్రవర్తనగలవాని ఇంటికి వెళ్లకూడదు. నాలుగుదారులు కలిసే కూడలిలో రాత్రిపూట రహస్యంగా ఉండరాదు. రాజు కోరుకునే స్త్రీని తనకై అడుగకూడదు.

**న నిహ్నువం సత్రగతస్య గచ్ఛేత్సంసృష్టమన్త్రస్య కుసంగతస్య**
**న చ బ్రూయాన్నాశ్వసామి త్వయీతి స కారణం వ్యపదేశం తు కుర్యాత్ 27**

చాలామంది దుర్మార్గులు కలిసి చేసిన పనిని తటాలున వ్యతిరేకించకూడదు. 'నిన్ను నమ్మను' అని కూడా నేరుగా అనకూడదు. ఏదో ఒక నెపం పెట్టి అక్కడి నుంచి అతడిని తొలగిపోనివ్వాలి.

**ఘృణీ రాజా పుంశ్చలీ రాజభృత్యః పుత్రో భ్రాతా విధవా బాలపుత్రా**
**సేనాజీవీ చోద్ధృతభక్త ఏవ వ్యవహారే వైవర్జనీయాః స్వురేతే 28**

చాలా ఎక్కువ దయాబుద్ధి గలవాడు, రాజు, శీలం లేని స్త్రీ, రాజసేవకుడు, కుమారుడు, సోదరుడు, విధవ, చిన్నపిల్లలున్న తల్లి, సేనలో ఉద్యోగం చేస్తున్నవాడు, అధికారం పోయినవాడు, వీరు అందరిని వ్యవహారాలలో విడిచివేయాలి. వ్యవహారాలు అంటే ధనాన్ని ఇచ్చిపుచ్చుకొనటాలు.

**గుణా దశ స్నానశీలం భజంతే బలం రూపం స్వరవర్ణప్రశుద్ధిః**
**స్పర్శచ గంధశ్చ విశుద్ధతా చ శ్రీః సౌకుమార్యం ప్రవరాశ్చ నార్యః 29**

రాజా! బలం, రూపం, శుద్ధమైన కంఠస్వరం, స్పష్టమైన వర్ణోచ్చారణ, మృదు శరీరం, సువాసన, శరీరశుద్ధి, శోభ, లావణ్యం, ఉత్తమ స్త్రీలు – ఈ పది స్నానశీలం కలవానికి లభిస్తాయి.

**గుణాశ్చ షణ్మితభుక్తం భజంతే ఆరోగ్య మాయుశ్చ సుఖం బలం చ**
**అనావిలం చాస్య భవేదపత్యం న చైనమాద్యూన ఇతి క్షిపంతి 30**

మితంగా తినేవానికి ఆరు గుణాలు అలవడుతాయి. 1. ఆరోగ్యం 2. ఆయువు 3. బలం 4. సుఖం 5.రోగరహితమైన సంతానం 6. తిండిపోతు అని ఆక్షేపణకు గురికాకపోవటం అనేవే ఆ ఆరు లక్షణాలు.

**అకర్మశీలం చ మహాశనం చ లోకద్విష్టం బహుమాయం నృశంసమ్**
**అదేశకాలజ్ఞమనిష్టవేషమ్ ఏతాన్గృహే న ప్రతివాసయీత 31**

సోమరియైన వానిని, తిండిపోతును, లోకులను అనగా పరులను ద్వేషించేవానిని, మాయలమారిని, క్రూరగుణం కలవానిని, దేశకాలాలు తెలియని వానిని, అసహ్యాకరమైన వేషం వేసుకొనేవానిని ఇంటిలో ఉండనీయకూడదు.

**కదర్యమాక్రోశకమశ్రుతం చ వరాకసంభూతమమాన్యమానినమ్**
**నిష్ఠూరిణం కృతవైరం కృతఘ్నమ్ ఏతాన్భృతార్తోఽపి న జాతు యాచేత్ 32**

ఎంత బాధలలో ఉన్న వ్యక్తి అయినా, పిసినిగొట్టును, వదరుబోతును, శాస్త్రము నెరుగని మూర్ఖుని, అడవి మనుష్యుని, జూదగాడిని, నీచులను గౌరవించేవాడిని, క్రూర స్వభావుని, పగబట్టినవానిని, చేసిన మేలు మరచిన వానిని, ఎట్టి పరిస్థితులలోనూ యాచింపకూడదు.

**సంక్లిష్టకర్మాణమతిప్రవాదం నిత్యానృతం చాదృఢ భక్తికం చ**
**వికృష్టరాగం బహుమానినం చాప్యేతాన్న సేవేత నరాధమాన్షట్ 33**

నీచమైన పనులు చేసే వానిని, ఎప్పుడూ ఒళ్లు మరచిఉండేవాడిని, నిత్యము అబద్ధాలాడే వానిని, దృఢమైన భక్తి లేని వానిని, స్నేహం విడిచిపెట్టేవాడిని, తానే గొప్పవాడినని భావించేవాడిని. ఈ ఆరుగురు నరాధములను ఎన్నడూ సేవింపకూడదు.

**సహాయబంధనా హ్యర్థాః సహాయాశ్చార్థబంధనాః**
**అన్యోన్యబంధనావేతౌ వినాన్యోన్యం న సిధ్యతః 34**

సంపదలు సహాయులతో ముడిపడి వస్తాయి. సహాయులు కూడా సంపదలతో ముడిపడి ఏర్పడతారు. సంపదలు, సహాయులు. ఈ రెండూ పరస్పరం కూడి ఉంటాయి. అవి వేరుగా ఉంటే ఫలించవు.

**ఉత్పాద్య పుత్రాననృణాంశ్చ కృత్వా వృత్తిం చ తేభ్యోఽనువిధాయ కాం చిత్**
**స్థానే కుమారీః ప్రతిపాద్య సర్వా అరణ్యసంస్థో మునివద్బుభూషేత్ 35**

మానవుడు పుత్రులను కని, వారికి అప్పు మిగల్చకుండా, తగిన వృత్తిని కల్పించి, పుత్రికలను తగిన వరులకు ఇచ్చి, ఆ తరువాత అడవికిపోయి,మునివృత్తిని అవలంబించాలి.

**హితం యత్సర్వభూతానామాత్మనశ్చ సుఖావహమ్**
**తత్కుర్యాదీశ్వరో హ్యేతన్మూలం ధర్మార్థ సిద్ధయే 36**

ప్రాణులు అన్నింటికీ హితమైనదీ, తనకు కూడా సుఖకరమైనదీ అయిన దానినే దైవం యెడల చేయాలి. సర్వప్రయోజనాలు కలగటానికి అదే మూలం అవుతుంది.

**బుద్ధిః ప్రభావస్తేజశ్చ సత్త్వముత్థానమేవ చ**
**వ్యవసాయశ్చ యస్య స్యాత్తస్యావృత్తి భయం కుతః 37**

అభివృద్ధి, ప్రభావము, తేజస్సు, సత్త్వం, ప్రయత్నం, నిశ్చయం– అనే ఈ ఆరు కలవానికి జీవనోపాధిని గురించిన భయం ఎక్కడిది? అనగా ఈ ఆరుగుణాలు కలవానిని జీవనోపాధికి ఎటువంటి చింత ఉండదు.

**పశ్య దోషాన్పాడవైర్విగ్రహే త్వం యత్ర వ్యథేరన్నపి దేవాః స శక్రాః**
**పుత్రైర్వైరం నిత్యముద్విగ్నవాసో యశః ప్రణాశో ద్విషతాం చ హర్షః 38**

పాండవులతో వైరం వలన వచ్చే దోషాలను చూడు. వారితో వైరానికి దేవతలూ, ఇంద్రుడూ కూడా తల్లడిల్లిపోతారు. వారందరూ కూడా నీకు పుత్రులే అయినందున పుత్రులతో వైరం, నిత్యమూ దుఃఖంతో బ్రతకటం, కురువంశీయుల కీర్తి నశించిపోవటం, నీ శత్రువులకు సంతోషం కలగటం తప్ప దాని వలన మరేమీ ఉండదు.

**భీష్మస్య కోపస్తవ చేన్ద్రకల్ప ద్రోణశ్య రాజ్ఞశ్చ యుధిష్ఠిరస్య**
**ఉత్సాదయేల్లోకమిమం ప్రవృద్ధః శ్వేతో గ్రహస్తిర్యగివాపతన్ఖే 39**

ఇంద్రునితో సమానమైనవాడా! భీష్ముని, ద్రోణుని, యుధిష్ఠిరుని క్రోధం బాగా ఎక్కువై, ఆకాశంలో నుంచి అడ్డంగా వచ్చి పడిన పెద్ద తోకచుక్క వలె, ఈ లోకం అంతటిని రూపుమాపుతుంది.

**తవ పుత్రశతం చైవ కర్ణః పఞ్చ చ పాండవాః**
**పృథ్వీమనుశాసేయురఖిలాం సాగరాంబరామ్ 40**

నీ నూరుమంది పుత్రులు, కర్ణుడు, పాండవులు అయిదుగురు కలసి, సముద్రంతో చుట్టిన భూమిని అంతటిని పరిపాలింతురు గాక.

**ధార్తరాష్ట్రా వనం రాజన్వ్యాఘ్రాః పాండుసుతా మతాః**
**మా వనం ఛిన్ధి స వ్యాఘ్రం మా వ్యాఘ్రాన్నీనశో వనాత్ 41**

రాజా! ధార్తరాష్ట్రులు అనగా నీ పుత్రులు అందరు అడవి వంటివారు కాగా పాండవులు ఆ అడవిలో వసించే పులుల వంటివారు. ఆ అడవిలోని పులులతో కూడా కలిపి అడవిని నరికివేయవద్దు. అలాగే అడవిలోని పులులను కూడా తోలివేయవద్దు.

**నస్యాద్వనమృతే వ్యాఘ్రాన్వ్యాఘ్రా న స్యుఋతే వనమ్**
**వనం హి రక్ష్యతే వ్యాఘ్రైర్వ్యాఘ్రాన్రక్షతి కాననమ్ 42**

పులులు లేకపోతే అడవి నిలవదు (నరికివేయబడుతుంది). అడవి లేకపోతే అంటే అడవి బయటకు వస్తే పులులు బ్రతకవు. అంటే పులులు అడవిని రక్షిస్తాయి. అంటే నిలిచేటట్లు చేస్తాయి. అడవిపులుల్ని రక్షిస్తుంది.

**న తథేచ్ఛన్త్యకల్యాణాః పరేషాం వేదితుం గుణాన్**
**యథైషాం జ్ఞాతుమిచ్ఛంతి నైర్గుణ్యం పాపచేతసః 43**

పాపాత్ములు ఇతరుల గుణాలలోని హీనత్వాన్ని తెలిసికోవాలనుకుంటారు. కాని వారిలోని సద్గుణాలను తెలుసుకోవాలని ఎన్నడు కోరుకొనరు.

**అర్థ సిద్ధిం పరామిచ్ఛంధర్మమేవాదితశ్ చరేత్**
**న హి ధర్మాదపైత్యర్థః స్వర్గలోకాదివామృతమ్ 44**

సర్వ విషయాలలోను పరమార్థం పొందాలనుకొనేవాడు ముందుగా ధర్మాన్నే ఆచరించాలి. అమృతం స్వర్గాన్ని విడవనట్లుగా అర్థం ధర్మాన్ని విడిచిపెట్టదు. అందువలన ధర్మపూర్వకంగా అర్థసాధన చేయవలెను.

**యస్యాత్మా విరతః పాపాత్కల్యాణే చ నివేశితః**
**తేన సర్వమిదం బుద్ధం ప్రకృతిర్వికృతిర్చ్య యా 45**

పాపపు పనులు చేయకుండా, శుభప్రదములయినవి ఎవరుచేస్తారో, అట్టివానికి ఇది ప్రకృతి, ఇది వికృతి అని సర్వము వాని సహజస్థితులు తెలుస్తాయి.

**యో ధర్మమర్థం కామం చ యథాకాలం నిషేవతే**
**ధర్మార్థకామసంయోగం యోఽముత్రేహ చ విందతి 46**

ఎవడు ధర్మ, అర్థ, కామాలను దేశకాలానుసారంగా, అనగా సరియైన స్థలము, సమయములను అనుసరించి, సేవిస్తాడో లేక ఆచరిస్తాడో, అట్టి వానికి అవి ఇహపరాలు రెండింట సిద్ధిస్తాయి.

**సం నియచ్ఛతి యో వేగముత్థితం క్రోధహర్షయోః**
**స శ్రియో భాజనం రాజాన్యశ్చాపాత్సు న ముహ్యతి 47**

రాజా! ఎవడు కోపము సంతోషాల వేగాన్ని అదుపు చేసికొనగలడో, అతడు సంపదలను పొందగలుగుతాడు. ఎన్నడు ఆపదలలో మునిగిపోడు.

**బలం పంచవిధం నిత్యం పురుషాణాం నిబోధమే**
**యత్తు బాహుబలం నామ కనిష్టంబలముచ్యతే 48**

రాజా! చెప్పుతున్నాను విను. మానవులకు బలం అనేది అయిదు విధాలుగా ఉంటుంది. మొదటిది భుజబలం అది చాలా తక్కువస్థాయి చెందినట్టిది.

**అమాత్యలాభో భద్రం తే ద్వితీయం బలముచ్యతే**
**ధనలాభస్తృతీయం తు బలమాహుర్జిగీషవః 49**

నీకు శుభం కలుగుగాక! చక్కని సలహాలను ఇచ్చే మంత్రుల వలన వచ్చే బలం రెండవది. ధనము వలన కలిగే బలం మూడవది అని పండితులైనవారు తెలుపుతున్నారు.

**యత్త్వస్య సహజం రాజాన్పితృపైతామహం బలమ్**
**అభిజాత బలం నామ తచ్ఛతుర్థం బలం స్మృతమ్ 50**

ప్రభూ! అభిజాత బలం అనగా తన పుట్టుక చేత కలిగేది నాల్గవ బలం అని చెప్పబడుతుంది. అది తన తండ్రి తాతల నుండి వంశపారంపర్యంగా వచ్చే బలం.

**యేన త్వేతాని సర్వాణి సంగృహీతాని భారత**
**యద్బలానాం బలం శ్రేష్ఠతత్ప్రజ్ఞా బలముచ్యతే 51**

భరతవంశీకుడా! ఈ అన్ని బలాల మొత్తం కంటే శ్రేష్ఠమైనది ప్రజ్ఞాబలం. అది అన్ని బలాలకంటెను శ్రేష్ఠమైన బలము. అది అయిదవదైన బలం.

**మహతే యోఽ పకారాయ నరస్య ప్రభవేన్నరః**
**తేనవైరం సమాసజ్య దూరస్థోఽస్మీతి నాశ్వసేత్ 52**

చాలా ఎక్కువగా అపకారం చేయగల శత్రువైన మనుష్యుడు దూరంగానే ఉన్నాడు గదా అని అతడితో వైరం ఉన్నప్పుడు ఆదమరిచి ఉండకూడదు.

**స్త్రీషు రాజసు సర్పేషు స్వాధ్యాయే శత్రుసేవిషు**
**భోగే చాయుషి విశ్వాసం కః ప్రాజ్ఞః కర్తుమర్హతి 53**

స్త్రీల మీద, రాజుల మీద, పాముల మీద, వేదాధ్యయనం మీద, సమర్థుని మీద, శత్రువు మీద, భోగము మీద, ఆయువు మీద ఏ బుద్ధిమంతుడు నమ్మకం పెట్టుకుంటాడు? అనగా పైన చెప్పిన వానిపై బుద్ధిమంతుడు ఎవడూ నమ్మకం పెట్టుకోడని భావము.

**ప్రజ్ఞా శరేణాభిహతస్య జంతోశ్చికిత్సకాః సంతి న చౌషధాని**
**న హోమమంత్రా న చ మంగలాని నాథర్వణా నాప్యగదాః సుసిద్ధాః 54**

ప్రజ్ఞ అనే బాణపు దెబ్బ తగిలిన ప్రాణికి వైద్యులు లేరు, మందులు లేవు, హోమాలు చేసే మంత్రాలు లేవు. మంగళ కృత్యాలు లేవు అధర్వవేదమంత్రాలు లేవు. ప్రసిద్ధమైన (పాదరసం మొదలైన) సిద్ధౌషధాలు లేవు.

**సర్పశ్చాగ్నిశ్చ సింహశ్చ కులపుత్రశ్చ భారత**
**నావజ్ఞేయా మనుష్యేణ సర్వేతే హ్యతితేజసః 55**

ఓ భరతవంశీకుడా! పాము, అగ్ని, సింహము, జ్ఞాతి ఇవి అన్నీ మిక్కిలి తేజస్సు కలవి. అందుచేత మానవుడు వీనిని చులకన చేయకూడదు.

**అగ్నిస్తేజో మహల్లోకే గూఢస్తిష్ఠతి దారుషు**
**న చోపయుంక్తే తద్దారు యావన్నో దీప్యతే పరైః 56**

ఈ లోకంలో అగ్ని గొప్ప తేజస్సు కలది. అది కట్టెలలో గూఢంగా దాగి ఉంటుంది. అది మరొక కట్టెతో రాపిడి పొంది ప్రజ్వలించేంతవరకు, ఆ కట్టెలో దాగిన అగ్ని ఉపయోగపడదు.

**స ఏవఖలు దారుభ్యో యదా నిర్మథ్య దీప్యతే**
**తదా తచ్చ వనం చాన్యన్నిర్ధహత్యాశు తేజసా 57**

కట్టెల రాపిడి వలన అగ్ని మండుతుంది. అదే అగ్ని అడవిని అంతటినీ కాక, ఇంకా మరికొన్నింటిని ఇతరములను శీఘ్రంగా మంటలతో దహించివేస్తుంది.

**ఏవమేవ కులే జాతాః పావకోపమ తేజసః**
**క్షమావంతో నిరాకారాః కాష్ఠేఽగ్నిరివ శేరతే 58**

ఇదేవిధంగా నీ వంశంలో పుట్టిన పాండవులు అగ్నివంటి తేజస్సు కలవారు. సహనంతో గూఢంగా కట్టెలో నిప్పువలె నిద్రిస్తున్నారు.

**లతా ధర్మా త్వం సపుత్రః శాలాః పాండుసుతా మతాః**
**న లతా వర్ధతే జాతు మహాద్రుమమనాశ్రితా 59**

రాజా! పుత్రులతో కూడిన నీవు లతవంటివాడవు. పాండవులు సాలవృక్షాలవంటివారు. పెద్దవి అయిన వృక్షాలను ఆశ్రయించకుండా లత ఎన్నడు వృద్ధి పొందలేదు.

**వనం రాజస్త్వం సపుత్రోఽ మ్బికేయ సింహాన్వనే పాండవాం స్తాత విద్ధి**
**సింహైర్విహీనం హి వనం వినశ్యేత్సింహా వినశ్యేయుఋతే వనేన 60**

రాజా! అంబికేయ! నీ పుత్రులు (డు) అడవి అని, పాండవులు సింహాలని తెలుసుకో! సింహాలు లేని అడవి నశించిపోతుంది. అదే విధంగా వనంలో లేకపోతే సింహాలు కూడా నశించిపోతాయి.

## ముఖ్య విషయములు

1. **ముఖ్యమైన పనులు చేయడానికి నిర్ణయాలు :**
   - ఒక పని చేయడం మొదలు పెట్టిన తర్వాత దాని ఫలితాలు గురించి పరీక్షించాలి. అది చేయకపోతే కలిగే నష్టాలను కూడా నిర్ణయించుకోవాలి.
   - సరైన సమయంలో తగిన శ్రమను ఆ పనిపై ఉంచాలి. లేకపోతే అపక్వమైన ఫలం తీయగా ఉండదు కదా! అలాగే ఫలితం కూడా చేదుగా ఉంటుంది.
   - తెలివిగలవాడు తన వ్యూహాత్మక చర్యలను ముందే ఇతరులకు తెలియనీయ కూడదు.
2. **తన క్రింది ఉద్యోగులను నియమించుకోబోయే ముందు తీసుకోవాల్సిన జాగ్రత్తలు :**
   - చేయవల్సిన పని అవసరం.
   - ఆ పనిని చేయటానికి ఆతని సామర్థ్యం
   - అతడికి ఇవ్వవలసిన తగిన వేతనం.
   - భవిష్యత్తులో అతనికి వేతనం చెల్లించడానికి కావల్సిన తన సామర్థ్యం.
3. **తెలివైన నాయకుని లక్షణాలు :**
   - చాలా వేగంగా జనులను వారి మనస్తత్వాన్ని అర్థం చేసుకొని వారిని మూడు రకాలుగా విభజిస్తాడు.
   - అత్యంత సామర్థ్యము కలవారు.
   - మధ్యతరగతి సామర్థ్యము కలవారు
   - సాధారణ ప్రజ్ఞ గలవారు

ఎ) **వారికి పనిని ఈ విధముగా అప్పగించాలి**
   - అత్యంత సమర్థులు – వ్యూహాత్మక ప్రాముఖ్యత గల పనులు
   - మధ్యతరగతి సామర్థ్యము కలవారు – కొంత సంక్లిష్టత గల పనులు.
   - సాధారణ ప్రజ్ఞ గలవారికి – నిత్యకృత్య వ్యవహారములు.
   - ఇందులో మొదటి వర్గము వారిని సామోపాయముతోనూ, రెండో వర్గము వారిని దానోపాయముచేతనూ, మూడోవర్గము వారిని భేద, దండోపాయములచేతనూ పనులను సాధింపవలెను.

## 38వ అధ్యాయము

**ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామంతి యూనః స్థవిర ఆయతి**
**ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ప్రతిపద్యతే** 1

అనంతరం విదురుడు ఈ విధంగా చెప్పాడు: పెద్దలు వస్తున్నప్పుడు చిన్నవారి ప్రాణాలు పైకి లేస్తాయి. ఎదురుగా వెళ్ళి వారికి నమస్కారం చేస్తే, చిన్నవాడు మళ్ళీ ఆ ప్రాణాలను పొందుతాడు.

**పీఠం దత్త్వా సాధవేఽభ్యాగతాయ ఆనీయాపః పరినిర్ణిజ్య పాదౌ**
**సుఖం పృష్ట్వా ప్రతివేద్యాత్మ సంస్థం తతో దద్యాదన్నమవేక్ష్యధీరః** 2

ఆత్మనిగ్రహం గల వ్యక్తి వచ్చిన సజ్జనుడికి ఆసనం ఇచ్చి, ఆసనంపై ఆసీనుడు కానిచ్చి, నీళ్ళు తీసికొని వచ్చి, పాదాలు కడిగి, కుశలము అడిగి తెలుసుకొని, తన పరిస్థితిని అతడికి నివేదించి, తరువాత అతడికి భోజనం పెట్టాలి.

**యస్యోదకం మధుపర్కం చ గాం చ న మంత్రవిత్ప్రతిగృహ్ణాతి గేహే**
**లోభాద్భయాదర్థకార్పణ్యతో వా తస్యానర్థం జీవితమాహురార్యాః** 3

గృహస్థుడు వేదవేత్త అయిన అభ్యాగతుడికి ఉదకం, మధుపర్కం, గోవును సమకూర్చలేకపోయిగానీ, పిసినారితనం వల్ల గానీ, ఇష్టం లేక కానీ ఇవ్వకపోతే, అట్టివాని బ్రతుకు వ్యర్థం అని పెద్దలు చెప్పుదురు.

**చికిత్సకః శల్యకర్తావకీర్ణా స్తేనః క్రూరో మద్యపో భ్రూణహా చ**
**సేనాజీవీ శ్రుతివిక్రాయకశ్చ భృశం ప్రియోఽప్యతిథిర్నోదకార్హః** 4

వైద్యుడు, బాణాలు తయారు చేసేవాడు, నియమ సమయం పూర్తికాకముందే బ్రహ్మచర్యం వదలివేసినవాడు, దొంగ, క్రూర గుణం కలవాడు, త్రాగుబోతు అయిన బ్రాహ్మణుడు, గర్భంలోని శిశువులను చంపేవాడు, సేనలో బ్రతికేవాడు, వేదం అమ్ముకొని జీవించేవాడు అతిథిగా వస్తే గృహస్థుడు నీరు ఇవ్వటానికి కూడా అతడు ఎంతో అనర్హుడుగా పరిగణించాలి. అంటే వీరికి నీరు కూడా ఇవ్వకూడదు.

**అవిక్రేయం లవణం పక్వమన్నం, దధి క్షీరం మధు తైలం ఘృతం చ**
**తిలామాంసం మూలఫలాని శాకం రక్తం వాసః సర్వగంధా గుడశ్చ** 5

బ్రాహ్మణుడు ఉప్పు, అన్నము, పెరుగు, పాలు, తేనె, నూనె, నెయ్యి, నువ్వులు, మాంసం, పండ్లు, దుంపలు, కూరలు, ఎఱ్ఱని వస్త్రాలు సుగంధాలు, బెల్లం– వీనిని విక్రయించకూడదు.

**అరోషణో యః సమలోష్టకాంచనః ప్రహీణశోకో గతసంధివిగ్రహః**
**నిందాప్రశంసోపరతః ప్రియాప్రియే చరన్నుదాసీ నవదేష భిక్షుకః 6**

కోపం లేనివాడు, మట్టి, రాయి, బంగారం వీటిని సమంగా చూసేవాడు, శోకం తరిగినవాడు, ఎవరితోను స్నేహము, విరోధము లేనివాడు, నింద, ప్రశంస రెండింటికి చలింపనివాడు, ప్రియాన్ని అప్రియాన్ని వదలిపెట్టినవాడు, ఏదీ అంటనివాడు సన్యాసి అ (నబడు)వుతాడు. అతడే భిక్షకుడు.

**నీవార మూలేఙ్గద శాకవృత్తిః సుసంయతాత్మాగ్నికార్యేష్వచోద్యః**
**వనే వసన్నతిథిష్వప్రమత్తో ధురంధరః పుణ్యకృదేష తాపసః 7**

నీవార ధాన్యంతో, దుంపలతో, కూరలతో జీవించేవాడు, మనోనిగ్రహం కలవాడు, అగ్ని ఆరాధన కార్యాలపై శ్రద్ధ కలిగినవాడు. అడవిలో ఉన్నా, అతిథులయెడ అప్రమత్తుడై బరువు బాధ్యతలు ఉన్నా పుణ్యకార్యాలు చేసేవాడు అయిన వ్యక్తిని తాపసుడు అంటారు.

**అపకృత్వా బుద్ధిమతో దూరస్థోఽస్మీతి నాశ్వసేత్**
**దీర్ఘౌ బుద్ధిమతో బాహూయాభ్యాం హింసతి హింసితః 8**

తెలివైనవానికి అపకారం చేసి, దూరంగా ఉన్నాను కదా అని ఏమరుపాటుతో ఉండకూడదు. తెలివి వలన బుద్ధిమంతుని చేతులు చాలా పొడవుగా ఉంటాయి. వాటితో తనకు అపకారం చేసినవాడిని హింసిస్తాడు.

**న విశ్వసేదవిశ్వస్తే విశ్వస్తే నాతివిశ్వసేత్**
**విశ్వాసాద్భయముత్పన్నం మూలాన్యపి నికృంతతి 9**

నమ్మతగనివారిని నమ్మకూడదు. నమ్మతగినవారిని కూడా అతిగా నమ్మకూడదు. నమ్మకంతో పుట్టిన భయం వేళ్లను కూడా పెకలించివేస్తుంది.

**అనీర్ష్యుర్గుప్తదారః స్యాత్సంవిభాగీ ప్రియంవదః**
**శ్లక్ష్ణోమధుర వాక్స్త్రీణాం న చాసాం వశగో భవేత్ 10**

మానవుడు ఈర్ష్యారహితుడు, భార్యను రక్షించుకోగలవాడు, తన సొమ్మును న్యాయబద్ధంగా పంచేవాడు. ప్రియంగా మాట్లాడేవాడు, మృదుస్వభావుడు కావాలి. స్త్రీల విషయంలో మధురంగా మాట్లాడాలి కాని వారికి వశం కాకూడదు.

**పూజనీయా మహాభాగాః పుణ్యాశ్చ గృహదీప్తయః**
**స్త్రియః శ్రియో గృహస్యోక్తా స్తస్మాద్రక్ష్యా విశేషతః** **11**

స్త్రీలు పూజింపతగినవారు, మహిమ కలవారు. పుణ్యాత్ములు, ఇంటికి వెలుగులు. ఇంటిలోని లక్ష్ములు. అందుచేత వారిని శ్రద్ధతో రక్షింపవలెను.

**పితురంతఃపురం దద్యాన్మాతుర్దద్యాన్మహానసమ్**
**గోషు చాత్మసమం దద్యాత్స్వయమేవ కృషిం వ్రజేత్**
**భృత్యైర్వణిజ్యాచారం చ పుత్రైః సేవేత బ్రాహ్మణాన్** **12**

నరుడు తన తండ్రికి అంతఃపురాన్ని, తల్లికి వంటియింటిని, తన వలెనే సంరక్షణ చేసే సోదరపుత్రాదులకు గోసంరక్షణను, అప్పగించవచ్చును. కానీ వ్యవసాయానికి మాత్రం తానే వెళ్ళాలి. సేవకుల చేత వాణిజ్యం చేయించాలి. పుత్రుల చేత బ్రాహ్మణుల సేవ చేయించాలి.

**అబ్భ్యోఽగ్ని ర్బ్రహ్మతః క్షత్రమశ్మనో లోహముత్థితమ్**
**తేషాం సర్వత్రగం తేజః స్వాసుయోనిషు శామ్యతి** **13**

సముద్రపు నీటి నుండి అగ్ని పుట్టింది. బ్రాహ్మణత్వం నుండి క్షత్రియత్వం పుట్టింది. రాతి నుండి లోహం (ఇనుము) పుట్టింది. అంతటా ప్రసరించే వీటి తేజస్సు (అగ్ని, క్షత్రియులు, ఇనుము) మాత్రం తమ తమ జన్మ స్థానాలకు చేరుకోగానే అణగిపోతుంది.

**నిత్యం సంతః కులే జాతాః పావకోపమ తేజసః**
**క్షమావంతో నిరాకారాః కాష్ఠేఽగ్నిరివ శేరతే** **14**

అగ్ని పైకి కన్పించకుండా కట్టెలో దాగి ఉంటుంది. అదే విధంగా సద్వంశంలో పుట్టి, అగ్ని సమానమైన తేజస్సును కలిగి ఉన్నా సహనం కలవారు బయటపడకుండా కట్టెలోని నిప్పువలె ప్రశాంతంగా ఉంటారు.

**యస్యమంత్రం న జానంతి బాహ్యాశ్చాభ్యంతరాశ్చ యే**
**స రాజా సర్వతశ్చక్షుశ్చిరమైశ్వర్యమశ్నుతే** **15**

బాహ్య పరివారానికిగానీ, అభ్యంతర పరివారానికి గానీ తెలియకుండా ఆలోచన చేసే రాజు సర్వత్ర తన చూపులు ప్రసరింపజేస్తూ, చిరకాలం ఐశ్వర్యం పొందుతాడు.

**కరిష్యన్న ప్రభాషేత కృతాన్యేవ చ దర్శయేత్**
**ధర్మకామార్థ కార్యాణి తథా మంత్రో న భిద్యతే** **16**

ధర్మార్థకామాలకు సంబంధించిన పనులు చేస్తున్నప్పుడు ఆ విషయాలను చెప్పకూడదు. వానిని చేసిన తర్వాతనే తెలియజేయాలి. ఆ విధంగా అయితే మంత్రం భేదించదు అంటే ఆలోచనకార్యరూపం చెందుతుంది.

**గిరిపృష్ఠముపారుహ్య ప్రాసాదం వా రహోగతః**
**అరణ్యే నిఃశలాకే వా తత్ర మంత్రో విధీయతే** **17**

రహస్యంగా కొండ ఎక్కిగాని, పెద్ద ఎత్తైన భవనం ఎక్కిగాని నిర్జనమైన అరణ్యంలో కాని, చెట్లు ఏమీ ఉండని నిర్జన ప్రదేశంలో కాని రాజు ఆలోచనలు చేయాలి.

**నాసుహృత్పరమం మంత్రం భారతార్హతి వేదితుమ్**
**అపండితో వాపి సుహృత్పండితో వాప్యనాత్మవాన్**
**అమాత్యే హ్యర్థలిప్సా చ మంత్ర రక్షణమేవచ** **18**

భారత! మిత్రుడు కానివాడు రహస్యాలోచనను తెలిసికొనగలడు. విద్వాంసుడు కాని స్నేహితుడు, తన ఇంద్రియములపై స్వాధీనము లేని అనగా చపలచిత్తుడైన పండితుడు. వీరికి కూడా రహస్యం తెలియరాదు. పరీక్షించకుండా రాజు తన మంత్రిని నియమించు కొనరాదు. ధనప్రాప్తి, రహస్యాన్ని రక్షించటం అనే ఈ రెండూ అమాత్యునిలో ఉంటాయి.

**కృతాని సర్వకార్యాణి యస్య వా పార్షదా విదుః**
**గూఢమంత్రస్య నృపతేస్తస్య సిద్ధిరసంశయమ్** **19**

(రాజు చేసే) ధర్మార్థ కామాలకు సంబంధించిన పనులన్నీ అయిపోయిన తరువాతనే సభ్యులకు తెలియాలి. ఆ విధంగా చేసే రాజు శ్రేష్ఠుడు. మంత్ర రక్షణం చేసే రాజుకు అంటే తన ఆలోచనలను రహస్యంగా ఉంచే రాజుకు నిస్సంశయంగా కార్యసిద్ధి కలుగుతుంది.

**అప్రశస్తాని కర్మాణి యో మోహాదనుతిష్ఠతి**
**స తేషాం విపరిభ్రంశే భ్రశ్యతే జీవితాదపి** **20**

మోహవశాత్తు నిందింపదగిన పనులు చేసేవాడు, వాటి విపరీత పరిణామాల వలన జీవితం కూడా పోగొట్టుకుంటాడు.

**కర్మాణాం తు ప్రశస్తానామనుష్ఠానం సుఖావహమ్**
**తేషామేవాననుష్ఠానం పశ్చాత్తాపకరం మహత్** **21**

ప్రశస్తమైన పనులు చేస్తే సుఖం కలుగుతుంది. అటువంటి పనులను చేయకుండా ఉంటే చాలా అధికంగా పశ్చాత్తాపపడవలసి వస్తుంది.

**స్థానవృద్ధక్షయజ్ఞస్య షాడ్గుణ్యవిదితాత్మనః**
**అనవజ్ఞాతశీలస్య స్వాధీనా పృథివీ నృప** **22**

రాజా! తన స్థితి యొక్క వృద్ధి క్షయాలు షాడ్గుణ్యము తెలిసినవానికి, అవమానింపబడని శీలం కలవానికి ఈ భూమి అంతా స్వాధీనం అవుతుంది. (షాడ్గుణ్యము అనగా సంధి విగ్రహాది రాజ షడ్గుణములు. సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము, ఆశ్రయము అనునవి.

**అమోఘక్రోధహర్షస్య స్వయం కృత్యాన్వవేక్షిణః**
**ఆత్మప్రత్యయకోశస్య వసుధేయం వసుంధరా** **23**

తన కోపము, సంతోషములు వ్యర్థం కాకుండా ఉపయోగకరాలు అయినవాడు, స్వయంగా తన పనిలోని మంచి చెడులను తానే విమర్శించుకొనేవాడు, తానే తన కోశాగారాన్ని రక్షించుకొనేవాడు అయిన నరునికి ఈ భూమి సర్వసంపదలను ఇస్తుంది.

**నామమాత్రేణ తుష్యేత ఛత్రేణ చ మహీపతిః**
**భృత్యేభ్యో విసృజేదర్థాన్నైకః సర్వహరో భవేత్** **24**

రాజు అనే పేరుతోను, ఛత్రంతోను రాజు సంతోషించాలి. తానొక్కడే సర్వాన్ని హరించకూడదు. సంపదలను తన సేవకులకు కూడా పంచాలి.

**బ్రాహ్మణో బ్రాహ్మణం వేద భర్తా వేద స్త్రియం తథా**
**అమాత్యం నృపతిర్వేద రాజా రాజానమేవ చ** **25**

బ్రాహ్మణుని గురించి బ్రాహ్మణునికి తెలుస్తుంది. భార్యను గురించి భర్తకు తెలుస్తుంది. మంత్రిని గురించి మంత్రికే తెలుస్తుంది. కాని రాజును గురించి రాజుకే తెలుస్తుంది.

**న శత్రు రంకమాపన్నో మోక్తవ్యో వధ్యతాం గతః**
**అహతాద్ధి భయం తస్మాజ్జాయతే నచిరాదివ** **26**

చంపదగిన శత్రువు తనకు చిక్కితే, ఎట్టి పరిస్థితుల్లోను వదలి పెట్టకూడదు. తన కంటే ఆ శత్రువు బలవంతుడైతే, చంపదగినవాడైనా అతడిని అణగి మణిగి సేవించాలి. తరువాతనే బలం పుంజుకొన్న వెంటనే అతడిని చంపి వేయాలి. అతడిని ఆ విధంగా చంపకపోతే త్వరలో వాని వలన ప్రమాదం ఏర్పడుతుంది.

**దైవతేషు చ యత్నేన రాజసు బ్రాహ్మణేషు చ**
**నియంతవ్యః సదా క్రోధో వృద్ధబాలాతురేషు చ** **27**

నరుడు దేవతల యెడ, రాజులు, బ్రాహ్మణులు, వృద్ధుల యెడ, బాలుర యెడ, రోగుల యెడ ఏర్పడిన కోపాన్ని ప్రయత్నపూర్వకంగా అణచివేసుకోవాలి.

**నిరర్థం కలహం ప్రాజ్ఞో వర్జయేన్మూఢ సేవితమ్**
**కీర్తించ లభతే లోకే న చానర్థేన యుజ్యతే** **28**

లోకంలో మూఢులు మాత్రమే వ్యర్థంగా కలహిస్తారు. అటువంటి కలహాన్ని తెలివి గలవాడు వదలివేయాలి. ఆ విధంగా వదలివేస్తే అతడికి మంచి పేరు కలగటమే కాక కీడు కలుగదు, విచారం ఏర్పడదు.

**ప్రసాదో నిష్ఫలో యస్య క్రోధశ్చాపి నిరర్థకః**
**న తం భర్తారమిచ్ఛంతి షంఢం పతిమివ స్త్రియః** **29**

నపుంసకుని స్త్రీలు భర్తగా కోరుకొనునట్లుగా, నిష్ఫలమైన అనుగ్రహము, వ్యర్థమయిన కోపము కలవానిని ప్రజలు రాజుగా కోరుకొనరు.

**న బుద్ధిర్ధన లాభాయ న జాడ్యమసమృద్ధయే**
**లోక పర్యాయవృత్తాంతం ప్రాజ్ఞో జానాతి నేతరః** **30**

గొప్ప బుద్ధి కలిగి ఉన్నంత మాత్రాన సంపద లభించదు. మూఢుడు అయినంత మాత్రాన దారిద్ర్యం కలుగదు. ప్రాజ్ఞుడు అయినవాడే ఈ లోకంలోని తారుమారు పరిస్థితులను గమనించగలరు. ఇతరులకు అది చేతకాదు.

**విద్యాశీలవయోవృద్ధాన్బుద్ధివృద్ధాంశ్చ భారత**
**ధనాభిజనవృద్ధాంశ్చ నిత్యం మూఢోఽవమన్యతే** **31**

భారత! విద్యలోను, శీలంయందును, బుద్ధిలోను, ధనములోను, కీర్తియందును, వంశమునందును వృద్ధులైనవారిని అనగా పెద్దలను మూఢుడు నిత్యము అవమానిస్తూ ఉంటాడు.

**అనార్యవృత్తమప్రాజ్ఞమసూయకమధార్మికమ్**
**అనర్థాః క్షిప్రమాయాంతి వాగ్దుష్టం క్రోధనం తథా** **32**

సత్ప్రవర్తన లేనివానికి, తెలివి లేనివానికి, అసూయాపరునికి, ధర్మయుతమైన నడవడి లేనివానికి, నోరు మంచిది కానివానికి, కోపం కలవానికి కష్టాలు చాలా త్వరగా వస్తాయి.

**అవి సంవాదనం దానం సమయస్యావ్యతిక్రమః**
**ఆవర్తయంతి భూతాని సమ్యక్ప్రణిహితా చ వాక్ 33**

వంచన లేకపోవటం, దానం చేయటం, హద్దు లేక మర్యాద మీరకపోవటం, హితంగా మాట్లాడిన మాటలు అనేవి సర్వప్రాణులను తన వైపుకు తిప్పుకుంటాయి.

**అవి సంవాదకో దక్షః కృతజ్ఞో మతిమానృజుః**
**అపి సంక్షీణ కోశోఽపి లభతే పరివారణమ్ 34**

మోసం చేయనివాడు, సమర్థుడు, కృతజ్ఞుడు, బుద్ధిమంతుడు, నిష్కల్మషుడు అయిన వ్యక్తికి ధనం తరిగిపోయినా కాని స్నేహితులు, సలహాదారులు (హితం) చెప్పేవారు, సేవకుల అండదండలు పొందుతూనే ఉంటాడు.

**ధృతిః శమో దమః శౌచం కారుణ్యం వాగనిష్ఠురా**
**మిత్రాణాం చానభిద్రోహః సతైతాః సమధిఃశ్రియః 35**

ధైర్యం, శమం (ప్రశాంతచిత్తం), దమం (ఆత్మ నిగ్రహం), శుచిత్వం, కరుణ, మృదువయిన వాక్కు, మిత్రద్రోహం చేయకపోవటం అనేవి ఏడూ ఎల్లప్పుడూ సంపదను వృద్ధి పొందిస్తాయి.

**అసంవిభాగీ దుష్టాత్మా కృతఘ్నో నిరపత్రపః**
**తాదృగ్నరాధమో లోకే వర్జనీయో నరాధిప 36**

రాజా! తనవారికి పెట్టకుండా తినేవాడు, దుష్టుడు, కృతఘ్నుడు, సిగ్గులేనివాడు అయిన యెడల ఆ రాజును విడిచిపెట్టవలయును.

**న స రాత్రౌ సుఖం సేతే ససర్ప ఇవ వేశ్మని**
**యః కోపయతి నిర్దోషం స దోషోఽభ్యంతరం జనమ్ 37**

తాను తప్పులు చేస్తూ, తప్పులు చేయని తనవారికి కోపం కలిగేటట్లు ప్రవర్తించేవాడు, పామున్న ఇంటిలో ఉంటున్న వాని వలె సుఖంగా నిద్రపోలేడు.

**యేషు దుష్టేషు దోషః స్యాద్యోగక్షేమస్య భారత**
**సదా ప్రసాదనం తేషాం దేవతానామివాచరేత్ 38**

రాజా! ఎవరికి హాని కలిగితే తన యోగక్షేమాలకు హాని కలుగుతుందో, అటువంటి వారిని, ఎల్లప్పుడు దేవతల వలె ప్రసన్నులను చేసుకొనాలి.

**యేऽర్థాః స్త్రీషు సమాసక్తాః ప్రథమోత్పతితేషు చ**
**యే చానార్య సమాసక్తాః సర్వేతే సంశయం గతాః** 39

స్త్రీలు, శ్రద్ధ లేని ప్రమత్తులు, తమ కులానుగత విధుల నుంచి దూరమైనవారు అనగా పతితులు, దుర్జనులుపై ఆధారపడిన పనులన్నీ సత్ఫలితాలను ఇస్తాయా అనేది సంశయమే అనగా సత్ఫలితాలు లభింపకపోవచ్చును.

**యత్ర స్త్రీ యత్ర కితవో యత్ర బాలోऽను శాస్తి చ**
**మజ్జంతి తేऽవశా దేశా నద్యామశ్మప్లవా ఇవ** 40

వనిత, జూదగాడు, బాలుడు శాసించేవారైతే, ఆ ప్రజలు రాతితో చేసిన పడవలోని వారి వలె నదిలో మునిగి పోయినట్లు శీఘ్రంగానే మునిగిపోతారు.

**ప్రయోజనేషు యే సక్తా న విశేషేషు భారత**
**తానాహం పండితాన్మన్యే విశేషాహి ప్రసంగినః** 41

రాజా! అవసరమైనప్పుడు మాత్రం ఆదుకొనెడువారు. ప్రత్యేక కార్యాలలో ప్రజ్ఞావంతులు కాకపోయినా, వారే పండితులని నా విశ్వాసం. ఎందుకనగా ప్రత్యేక కార్యాలు ఆనుషంగికాలుగానే ఉంటాయి గదా.

**యం ప్రశంసంతి కితవా యం ప్రశంసంతి చారణాః**
**యంప్రశంసంతి బంధక్యో న స జీవతి మానవః** 42

జూదరుల చేత మాత్రమే ప్రశంసింపబడేవాడు, అదే విధంగా నానా ప్రదేశం సంచారకు (చారణుడు)ల చేత, వేశ్యల చేత, పొగడబడేవాడు. ఎంతో కాలం బ్రతకడు. అనగా బ్రతికి ఉన్నా చచ్చినవానితో సమానమే.

**హిత్వా తాన్పరమేశ్వాసాన్పాండవానమితౌజసః**
**ఆహితం భారతైశ్వర్యం త్వయా దుర్యోధనే మహత్** 43

**తం ద్రక్ష్యసి పరిభ్రష్టం తస్మాత్వం నచిరాదివ**
**ఐశ్వర్యమదసంమూఢం బలిం లోకత్రయాదివ** 44

రాజా! మేటి విలుకాండ్రు, మిక్కిలి తేజస్సు గల పాండవులను వదలి నీ సంపదనంతను, దుర్యోధనుని మీద ఉంచావు. ఐశ్వర్య మదమత్తుడైన దుర్యోధనుడు త్వరలో, ఆ పదవి నుండి భ్రష్టుడు కావటం చూడగలవు. బలి చక్రవర్తి లోకత్రయం నుండి భ్రష్టుడయినట్లు నీ కుమారుడు దుర్యోధనుడు భ్రష్టుడు అవుతాడు.

## ముఖ్యవిషయములు

**1. తెలివైన పాలకుని లక్షణాలు :**

- రెండింటినీ ఒకటిచే సాధించాలి.
- ఒకటి అనగా వివేకము, రెండు అనగా మంచి, చెడు.
- మూడింటిని నాల్గింటి చేత నిర్వహింపవలెను.
- మూడు అనగా స్నేహితులు, విరోధులు, తటస్థులు
- నాలుగు అనగా సామ, దాన, భేద, దండోపాయాలు.
- ఐదింటిని జయింపవలెను.
- ఐదు అనగా ఇంద్రియములు. ఇంద్రియ నిగ్రహంతో దానిని సాధించాలి. సంధి విగ్రహాది యాన, ఆసన, ద్వైదీభావసమాసములనే రాజ షడంగములు.
- ఆరింటి చేత విరోధులను సాధింపవలెను.
- సంతోష జీవితమునకు ఏడింటిని జయింపవలెను.

  ఏడు 1. స్త్రీ కాముకత 2. జూదం 3. మద్యపానం 4. వేట 5. కఠినముగా మాట్లాడుట 6. కఠిన శిక్ష 7. వనరులను వ్యర్థము చేయుట.

**2. తెలివైన పాలకులకు ముఖ్య లక్షణాలు** :

- ఆత్మ నిగ్రహము, ఆత్మస్థైర్యము, ఉన్నతాశయాలు, లక్ష్యశుద్ధి, తగినంత కృషి, నైతిక ప్రవర్తన.



## ○ 39వ అధ్యాయము

**అనీశ్వరోఽయం పురుషో భవాభవే సూత్రప్రోతా దారుమయీవ యోషా**
**ధాత్రా హి దిష్టస్య వశే కిలాయం తస్మాద్వద త్వం శ్రవణే ధృతోఽహమ్ 1**

అనంతరము ధృతరాష్ట్రుడు ఇట్లు పలికెను. కలిమి లేముల విషయంలో మానవుడు స్వతంత్రుడు కాదు. అతడు దారాలతో లాగి ఆడించబడే కొయ్య (కీలు) బొమ్మలాంటివాడు. వాస్తవంలో బ్రహ్మ దానిని దైవానికి వశం చేశాడు. నీవు తెల్పుతూ ఉండు. నేను నీవు చెప్పేది వింటూ ఉంటాను.

**అప్రాప్తకాలం వచనం బృహస్పతిరపి బ్రువన్**
**లభతే బుద్ధ్యవజ్ఞానమవమానం చ భారత 2**

విదురుడు ఈ విధంగా చెప్పాడు. రాజా! సమయానికి సరిపోని అంటే తగని మాట బృహస్పతి మాట్లాడినా అతడు బుద్ధిహీనుడు అనిపించుకుంటాడు. అవమానం పొందుతాడు.

**ప్రియోభవతి దానేన ప్రియవాదేన చాపరః**
**మంత్రం మూలబలేనాన్యో యః ప్రియః ప్రియ ఏవ సః 3**

ఒకడు దానం చేసి ఇష్టమైనవాడు అవుతాడు. మరొకడు ప్రియంగా మాట్లాడి ఇష్టుడు అవుతాడు. ఇంకొకడు మంత్రబలం చేతగానీ మూలబలం చేతగానీ ఇష్టమైనవాడు అవుతాడు. కానీ సహజంగా ప్రియమైనవాడు ఎప్పుడూ ప్రియుడే.

**ద్వేష్యోన సాధుర్భవతి న మేధావీ న పండితః**
**ప్రియే శుభాని కర్మాణి ద్వేష్యే పాపాని భారత 4**

భారతా! మానవుడు ఎవరినైనా ద్వేషిస్తే, వానిలోని నేర్పరితనం కాని, తెలివితేటలను గానీ, పాండిత్యాన్నిగానీ పరిగణనలోనికి తీసికొనడు. ప్రియు (ఇష్టు)డు అయిన వానిలో అన్నీ మంచిపనులే కల్పిస్తాయి. అదేవిధంగా శత్రువులో అన్నీ పాపపు పనులే కన్పిస్తాయి.

**న సక్షయో మహారాజయః క్షయో వృద్ధిమావహేత్**
**క్షయః సత్వీహ మంతవ్యో యం లబ్ధ్వా బహు నాశయేత్ 5**

మహారాజా! దుర్యోధనుడు పుట్టినప్పుడే "వీడు ఒక్కడిని విడిచిపెట్టు. వీడిని ఒక్కడిని వదిలితే, వందమంది పుత్రులు వృద్ధి చెందుతారు. వీడిని ఒక్కడిని వదలకపోతే వంద

పుత్రులు నశిస్తారు" అని చెప్పాను. తరువాతి కాలంలో నశించిపోయే వృద్ధిని ఎక్కువగా భావించకూడదు. అనంతర కాలంలో వృద్ధిని పొందే ప్రస్తుత తరుగుదలను కూడా ఎక్కువగా భావించాలి. తరువాత వృద్ధి కలిగించే క్షయం క్షయం క్రిందకు లెక్కకు రాదు. కొద్దిగా వృద్ధి చెంది తరువాత మిక్కిలిగా నశింపచేసేదే క్షయం అనిపించుకొంటుంది.

**సమృద్ధా గుణతః కేచిద్భవంతి ధనతోఽపరే**
**ధనవృద్ధాన్గుణైర్హీనాన్ధృతరాష్ట్ర వివర్జయేత్ 6**

కొందరు సద్గుణాలతోనే సంపన్నులు. మరికొందరు ధనంతోనే సంపన్నులు. అందుచేత ధృతరాష్ట్ర మహారాజా! ధనసంపన్నులై, గుణహీనులైనవారిని విడిచిపెట్టు."

**సర్వం త్వమాయతీ యుక్తం భాషసే ప్రాజ్ఞసంమతమ్**
**న చోత్సహే సుతం యుక్తం యతోధర్మస్తతో జయః 7**

అని పల్కిన విదురుని మాటలను వినిన ధృతరాష్ట్రుడు "నీవు విద్వాంసులు అంగీకరించేటట్లు భవిష్యత్తులో మేలు చేసే వానినే చెప్పుచున్నావు. కానీ నేను కొడుకును విడిచిపెట్టలేను. ధర్మం ఎటు ఉంటుందో జయం అటే ఉంటుంది' అని అన్నాడు.

**స్వభావగుణసంపన్నో న జాతు వినయాన్వితః**
**సుసూక్ష్మమపి భూతానాముపమర్దం ప్రయోక్ష్యతే 8**

అందులకు విదురుడు ఇట్లన్నాడు: మిక్కిలి సద్గుణాలు, వినయము కలిగి ఉన్నవాడు ప్రాణులకు కలిగే కొద్దిపాటి కష్టాన్ని కూడా ఉపేక్షింపడు.

**పరాపవాద నిరతాః పరదుఃఖోదయేషు చ**
**పరస్పరవిరోధే చ యతంతే సతతోత్థితాః 9**

కొందరు పరులపై సతతము అపనిందలు వేస్తూ, దుఃఖం కలిగిస్తూ, పరస్పరం విరోధాలు పెట్టటానికి ప్రయత్నిస్తుంటారు.

**సదోషం దర్శనం యేషాం సంవాసే సుమహద్భయమ్**
**అర్థాదానే మహాన్దోషః ప్రదానే చ మహద్భయమ్ 10**

అటువంటివారిని చూస్తేనే పాపం కలుగుతుంది. వారి నుండి ధనం తీసుకున్నా చాలా పాపం. వారికి ధనం ఇవ్వటం చాలా భయాన్ని కలిగిస్తుంది.

**యే పాపా ఇతి విఖ్యాతాః సంవాసే పరిగర్హితాః**
**యుక్తాశ్చాన్యైమహాదోషైర్యే నరాస్తాన్వివర్జయేత్ 11**

విరోధాలు కలిగించేవారు, స్వార్థపరులు, సిగ్గులేనివారు, మూర్ఖులు, పాపపు పనులు చేసేవారు అయినవారిని పాపులు అంటారు. అట్టి వారిని విడిచిపెట్టాలి. అనగా వీరితో కలిసి ఉండరాదు. మహాపాపాలు చేసేవారిని, వారితో సంబంధం కలవారిని విసర్జించాలి.

**నివర్తమానే సౌహార్దే ప్రీతిర్నీచే ప్రణశ్యతి**
**యా చైవ ఫలనిర్వృత్తిః సౌహృదే చైవ యత్సుఖమ్ 12**

స్నేహం తొలగిపోతే నీచునికి ప్రీతి నశించిపోతుంది. అంతేకాకుండా స్నేహఫలము, స్నేహసుఖము కూడా నశించిపోతాయి.

**యతతే చాపవాదాయ యత్నమారభతే క్షయే**
**అల్పేఽప్యపకృతే మోహాన్న శాంతిముపగచ్ఛతి 13**

నీచుడు అపనిందలు వేయటానికి కూడా వెనుదీయడు. మన వినాశనానికి ప్రయత్నిస్తాడు. మోహంతో స్వల్పమైన అపకారం మనకు జరిగినా అంతటితో శాంతింపక చిత్తశాంతిని కోల్పోతాడు.

**తాదృశ్యైః సంగతం నీచైనృశంసైరకృతాత్మభిః**
**నిశామ్య నిపుణం బుద్ధ్యా విద్వాన్దూరాద్వివర్జయేత్ 14**

క్రూరులు, ఎదుగని మనసులు కలవారు అయిన నీచులతో స్నేహాన్ని తెలివి అయినవాడు, బుద్ధితో ఆలోచించి, దూరంగా వదలివేయాలి.

**యో జ్ఞాతి మనుగృహ్ణాతి దరిద్రం దీనమాతురమ్**
**సపుత్రపశుభిర్వృద్ధిం యశశ్చావ్యయమశ్నుతే 15**

దరిద్రుడు, దీనుడు, రోగాతురుడు అయిన జ్ఞాతియగువానియెడ అనుగ్రహం చూపేవాడు పుత్రవృద్ధిని, పశువృద్ధినే కాక అనంతమైన శ్రేయస్సును కూడా పొందగలడు.

**జ్ఞాతయో వర్ధనీయాసైర్య ఇచ్ఛన్త్యాత్మనః శుభమ్**
**కులవృద్ధిం చ రాజేంద్ర తస్మాత్సాధు సమాచర 16**

రాజేంద్ర! తన మేలును కోరుకొనేవాడు తన జ్ఞాతులను, కులాన్ని వృద్ధి పొందించుకోవాలి. అందుచేత ఆ పనిని చక్కగా చేయి. జ్ఞాతులను సత్కరించేవానికి అంతులేని శ్రేయస్సు కలుగుతుంది.

**శ్రేయసా యోక్ష్యసే రాజన్కుర్వాణో జ్ఞాతిసత్క్రియామ్**
**విగుణా హ్యపి సంరక్ష్యా జ్ఞాతయో భరతర్షభ 17**

మహారాజా! నీ బంధువులందరి యెడ చక్కగా ప్రవర్తిస్తే నీకు అఖండ సంపదలు సమకూరుతాయి. జ్ఞాతులు గుణహీనుడైనా రక్షింపదగినవారే.

**కిం పునర్గుణవంతస్తే త్వత్ప్రసాదాభికాంక్షిణః**
**ప్రసాదం కురుదీనానాం పాండవానాం విశాంపతే 18**

**దీయంతాం గ్రామకాః కే చిత్తేషాం వృత్యర్థ మీశ్వర**
**ఏవం లోకే యశః ప్రాప్తో భవిష్యత్సి నరాధిప 19**

భరతర్షభ! సద్గుణవంతులు, నీ అనుగ్రహాన్ని కోరే పాండవుల మాట వేరుగా చెప్పనవసరం లేదు కదా! రాజా! నీవు పాండవులపై అనుగ్రహం చూపించు. వారి జీవనం కోసం కొన్ని పల్లెలనైనా ప్రసాదించు. ఆ విధంగా చేస్తే ఈ లోకంలో నీకు కీర్తి లభిస్తుంది.

**వృద్ధేన హి త్వయా కార్యం పుత్రాణాం తాత రక్షణమ్**
**మయా చాపి హితం వాచ్యం విద్ధి మాం త్వద్వితైషిణమ్ 20**

పెద్దవాడవైన నీవు నీ కొడుకులను శాసించాలి. నేను కూడా నీకు హితమే చెప్పాలి. నేను నీకు శ్రేయోభిలాషినని తెలిసికొనుము.

**జ్ఞాతిభిర్విగ్రహస్తాత నకర్తవ్యో భవార్థినా**
**సుఖాని సహ భోజ్యాని జ్ఞాతిభిర్భరతర్షభ 21**

**సంభోజనం సంకథనం సంప్రీతిశ్చ పరిస్పరమ్**
**జ్ఞాతిభిః సహ కార్యాణి న విరోధః కథంచన 22**

తన సుఖం కోరుకునేవాడు ఎప్పుడూ జ్ఞాతులతో విరోధం పెట్టుకొనకూడదు. మహారాజా! జ్ఞాతులతో కలసి సుఖాలను అనుభవించాలి. కలసి భోజనం చేయటం, కలసి సంభాషించుకొనటం, పరస్పరం ప్రీతిగా ఉండటం, జ్ఞాతులతో కలిసి చేయతగినవి. అంతేకాని వారితో ఎన్నడూ విరోధం పెట్టుకొనకూడదు.

**జ్ఞాతయస్తారయంతీహ జ్ఞాతయో మజ్జయంతి చ**
**సువృత్తాస్తారయంతీహ దుర్వృత్తా మజ్జయంతి చ 23**

జ్ఞాతులు తరింపచేస్తారు. అదే విధంగా ముంచివేయగలరు కూడా. జ్ఞాతులు మంచివారైతే కష్టాల నుంచి తరింపచేస్తారు. దుర్మార్గులైన జ్ఞాతులు ముంచివేస్తారు.

**సువృత్తో భవ రాజేంద్ర పాండవాన్ప్రతి మానద**
**అధర్షణీయః శత్రూణాం తైర్వృతస్త్వం భవిష్యసి 24**

రాజా! పాండవుల యెడ మంచిగా ఉండు. వారితో కలసి ఉంటే శత్రువులు నిన్ను తిరస్కరించలేరు. ఎదిరించను లేరు.

**శ్రీమంతం జ్ఞాతి మాసాద్య యో జ్ఞాతిరవసీదతి**
**దిగ్ధహస్తం మృగ ఇవస ఏనస్తస్య విందతి 25**

విషం పూసిన బాణంతో వేటగాడిచేత కొట్టబడిన మృగం వలె శ్రీమంతుడైన జ్ఞాతితో మరొక జ్ఞాతి చితికిపోతే, ఆ పాపం అంతా ఆ శ్రీమంతుడైన జ్ఞాతికే వస్తుంది.

**పశ్చాదపి నరశ్రేష్ఠ తవ తాపో భవిష్యతి**
**తాన్వా హతాన్సుతాన్వాపి శ్రుత్వా తదనుచింతయు 26**

నరశ్రేష్ఠా! రాబోయే కాలంలో పాండవులో, నీ కొడుకులో చనిపోయిన తరువాత నీకు దుఃఖతాపము కలుగుతుంది. ఈ నీ అకర్తవ్యతా దోషమే అందుకు కారణం. దాన్ని ఆలోచించు.

**యేన ఖట్వాం సమారూఢః పరితప్యేత కర్మణా**
**ఆదావేవ న తత్కుర్యాదధ్రువే జీవితే సతి 27**

నీవు చేసిన పని వలన మంచంలో తరువాత పరితపించవలసి వస్తుంది. అందుచేత ముందుగానే ఆలోచించి ఆ పనిని మానుకోవాలి. ఈ జీవితమే అస్థిరమైనందున ఇటువంటి ఫలం వచ్చే పనులను చేయకుండా ఉండవలెను.

**న కశ్చిన్నాపనయతే పుమానన్యత్ర భార్గవాత్**
**శేష సంప్రతిపత్తిస్తు బుద్ధిమత్స్వేవ తిష్ఠతి 28**

నీతి శాస్త్రాన్ని రచించిన శుక్రాచార్యుడు తప్ప ఇంకెవరూ తప్పు చేయరని చెప్పలేము. అందరము ఎప్పుడో ఒకప్పుడు తప్పు చేస్తాము. కానీ మిగిలిన పనిని గురించి మంచి చెడు విచారణ మాత్రం తెలివైనవారే చేస్తారు.

**దుర్యోధనేన యద్యేతత్పాపం తేషు పురా కృతమ్**
**త్వయా తత్కులవృద్ధేన ప్రత్యానేయం నరేశ్వర 29**

కురువంశంలో నీవు పెద్దవాడవు. కులంలో పెద్దవాడవైన నీవు దుర్యోధనుడు పాండవులకు పూర్వం చేసిన అపకారం సరిదిద్ది ఉపకారం చేయాలి.

**తాంస్త్వం పదే ప్రతిష్ఠాప్య లోకే విగతకల్మషః**
**భవిష్యసి నరశ్రేష్ఠ పూజనీయో మనీషిణామ్ 30**

రాజా! నీవు పాండవులను రాజ్య పదవిలో ప్రతిష్ఠిస్తే పాపరహితుడవు కాగలవు. బుద్ధిమంతులు అప్పుడు నిన్ను పూజిస్తారు.

**సువ్యవహృతాని ధీరాణాం ఫలతః ప్రవిచిన్త్యయః**
**అధ్యవస్యాతి కార్యేషు చిరం యశసి తిష్ఠతి 31**

ధీరుల మంచి మాటలను ఫలితం దృష్టితో ఆలోచించి, కార్యం నిశ్చయించేవాడు చాలా కాలం పాటు మంచి పేరు పొందుతాడు.

**అవృత్తిం వినయో హంతి హంత్యనర్థం పరాక్రమః**
**హంతి నిత్యం క్షమా క్రోధమాచారో హంత్యలక్షణమ్ 32**

వినయము అపకీర్తిని తొలగిస్తుంది. పరాక్రమము అనర్థాలను పోగొడుతుంది. క్షమ (ఓర్పు) కోపాన్ని శాశ్వతంగా తొలగిస్తుంది. సదాచారం అవలక్షణాన్ని పోగొడుతుంది.

**పరిచ్ఛదేన క్షత్రేణ వేశ్మనా పరిచర్యయా**
**పరీక్షేత కులం రాజన్భోజనాచ్ఛాదనేనచ**

రాజా! నరుని వంశమును అతడి జన్మస్థలము చేతను, గృహము చేతను ఆచార వ్యవహారముల చేతను, అన్నవస్త్రాలను బట్టి పరీక్షించాలి.

**యయోశ్చిత్తేన వా చిత్తం నైభృతం నైభృతేన వా**
**సమేతి ప్రజ్ఞయా ప్రజ్ఞా తయోర్మైత్రీ న జీర్యతే 34**

ఎవరి మనస్సుతో మనస్సు, రహస్యంతో రహస్యము, ప్రజ్ఞతో ప్రజ్ఞవంటి అన్నింటిలోను ఏకీభవిస్తుంటాయో అలాంటివారితో చేసిన ఆ ఇద్దరి స్నేహము ఎన్నటికి తరగదు.

**దుర్బుద్ధి మకృత ప్రజ్ఞం ఛన్నం కూపం తృణైరివ**
**వివర్జయీత మేధావీ తస్మిన్మైత్రీ ప్రణశ్యతి 35**

దుర్మార్గుడై, పరిపక్వం కాని ప్రజ్ఞ కల స్నేహితుని తెలివిగలవాడు విడిచిపెట్టాలి. గడ్డితో కప్పిన నూతివలె వానిని విడిచి వేయాలి. వానితో స్నేహం నశించిపోతుంది.

**అవలిప్తేషు మూర్ఖేషు రౌద్రసాహసికేషు చ**
**తథైవాపేత ధర్మేషు న మైత్రీమాచరేద్బుధః 36**

పండితుడైనవాడు గర్వితులతో, మూర్ఖులతో తటాలున కోపం తెచ్చుకొనేవారితో, తొందరపాటు కలవారితో ధర్మం విడిచినవారితోను స్నేహం చేయకూడదు.

**కృతజ్ఞం ధార్మికం సత్యమక్షుద్రం దృఢభక్తికమ్**
**జితేంద్రియం స్థితం స్థిత్యాం మిత్రమత్యాగి చేష్యతే** **37**

మిత్రుడు ఎప్పుడు కృతజ్ఞుడై ఉండాలి. ధార్మికుడు, సత్యసంధుడు కావాలి. నీచుడు కాకూడదు. దృఢమైన భక్తి కలిగి, ఇంద్రియనిగ్రహం కలిగి ఉండి, హద్దు మీరనివాడుగా ఉండాలి. ఆపదలలో విడువకుండా ఉండాలి.

**ఇంద్రియాణామనుత్సర్గో మృత్యునా న విశిష్యతే**
**అత్యర్థం పునరుత్సర్గః సాదయేద్దైవతాన్యపి** **38**

ఇంద్రియాలను జయించటం మృత్యువును జయించటం కంటే గొప్ప విషయం. ఇంద్రియాలపై నియంత్రణ లేకుండా వాటిని యధేచ్ఛగా వదలివేయడం మంచిది కాదు. అది దేవతలకు కూడా వినాశనం చేకూరుస్తుంది.

**మార్దవం సర్వభూతానామనసూయా క్షమా ధృతిః**
**ఆయుష్యాణి బుధాః ప్రాహుర్మిత్రాణాం చావిమాననా** **39**

అన్ని ప్రాణుల యెడ మృదుత్వం, అసూయ లేకపోవటం, సహనము, ధైర్యము, మిత్రులను అవమానించకపోవటం అనే ఈ అయిదు ఆయువును వృద్ధి చేస్తాయని పెద్దలు చెప్పారు.

**అపనీతాం సునీతేన యోఽర్థం ప్రత్యానినీషతే**
**మతిమాస్థాయ సుదృఢాం తదకాపురుష వ్రతమ్** **40**

అన్యాయంగా లాగుకొనబడిన అర్థాన్ని చక్కని నీతితో దృఢబుద్ధితో పొందాలనుకోవటం సత్పురుషుల వ్రతం.

**ఆయత్యాం ప్రతికారజ్ఞస్తదాత్వే దృఢనిశ్చయః**
**అతీతే కార్యశేషజ్ఞో నరోఽర్థైర్న ప్రహీయతే** **41**

రాబోయే అనర్థాలకు విరుగుడు తెలిసినవాడు, ప్రస్తుతం జరుగుతున్న (వర్తమాన) కార్యాలలో దృఢ నిశ్చయం కలవాడు, జరిగిన పనుల్లో మిగిలిపోయిన దానిని గుర్తించేవాడు అయిన మానవుడు ఏ ప్రయోజనాన్ని కోల్పోడు.

**కర్మణా మనసా వాచా యదభీక్ష్ణం నిషేవతే**
**తదేవాపహరత్యేనం తస్మాత్కల్యాణమాచరేత్ 42**

తన పనులతో, మనస్సుతో, మాటలతో మానవుడు ఎల్లప్పుడు ఏ విషయాన్ని సేవిస్తూ ఉంటాడో, అదే ఆ మానవుని లాక్కొనిపోతూ ఉంటుంది. అందుచేత మానవుడు శుభాలనే త్రికరణశుద్ధిగా ఆచరిస్తూ ఉండాలి.

**మఙ్గలాలంభనం యోగః శ్రుతముత్థానమార్జవమ్**
**భూతిమేతాని కుర్వంతి సతాం చాభీక్ష్ణదర్శనమ్ 43**

మంగళకరమైన వానిని సమకూర్చటంలో ప్రయత్నం, కాలం యొక్క ధర్మాన్ని తెలుసుకొనటం, శాస్త్రాలలోని జ్ఞానాన్ని గ్రహించటం, ప్రయత్నం, కుటిలత లేని ప్రవర్తన, పలుమార్లు సజ్జనులను దర్శించటం– అనే, ఇవి మానవునికి శుభం (ఐశ్వర్యం) కలిగిస్తాయి.

**అనిర్వేదః శ్రియో మూలం దుఃఖనాశే సుఖస్యచ**
**మహాన్భవత్యనిర్విణ్ణః సుఖం చాత్యంతమశ్నుతే 44**

నిర్వేదం చెందకుండా ఉండటం సంపదకు, లాభానికి, శుభానికి మూలం. ప్రయత్నం విడువక ఒక లక్ష్యంతో పరిశ్రమించేవాడు గొప్పవాడు అవుతాడు. అనంతమైన సుఖాన్ని కూడా పొందుతాడు.

**నాతః శ్రీమత్తరం కించిదన్యత్పథ్యతమం తథా**
**ప్రభవిష్ణోర్యథా తాత క్షమా సర్వత్ర సర్వదా 45**

తండ్రీ! అధికారము, శక్తి కలిగి ఉన్న సమర్థునికి అన్ని ప్రదేశాలలోను, అన్ని సమయాలలోను సహనం కంటె సంపత్కరం మరొకటి లేదు. అది అన్నింటికంటె చాలా హితకరమైనది.

**క్షమేదశక్తః సర్వస్య శక్తిమాన్ధర్మకారణాత్**
**అర్థనర్థౌ సమౌ యస్య తస్య నిత్యం క్షమా హితా 46**

అసమర్థుడు అన్ని విషయాలలోను క్షమ వహించాలి. సమర్థుడు కూడా ధర్మం కోసం సహనం వహించాలి. అర్థానర్థాలు అంటే లాభాలాభాలు సమానంగా చూచుకొనేవానికి ఎల్లప్పుడూ సహనమే హితంగా ఉంటుంది.

**యత్సుఖం సేవమానోఽపి ధర్మార్థాభ్యాం న హీయతే**
**కామం తదుపసేవేత న మూఢ వ్రతమాచరేత్ 47**

ధర్మానికి అర్థానికి హాని కలగని సుఖాన్ని మానవుడు తృప్తి తీరేవరకు అనుభవింప వచ్చును. అంతేకాని మూఢుని వలె అనుభవింపరాదు. అనగా ధర్మార్థ హాని విషయంలో మూఢుడు కాగూడదు.

**దుఃఖార్తేషు ప్రమత్తేషు నాస్తికేష్వలసేషు చ**
**న శ్రీర్వసత్యదాంతేషు యే చోత్సాహ వివర్జితా** 48

దుఃఖార్తుల దగ్గర, మత్తెక్కిన వారి దగ్గర, నాస్తికుల దగ్గర, సోమరుల దగ్గర, ఇంద్రియ నిగ్రహము లేనివారి దగ్గర ఉత్సాహరహితుల దగ్గర లక్ష్మి (సంపద) ఎన్నడు నిలిచి ఉండదు.

**ఆర్జవేన నరం యుక్తమార్జవాత్సవ్యపత్రపమ్**
**అశక్తిమన్తం మన్యన్తో ధర్మయంతి కుబుద్ధయః** 49

ఆర్జవము అనగా ఋజు స్వభావము, దాని వలన కలిగిన వినయము కలిగిన మానవుని దుర్మార్గులు అసమర్థుడు అనుకొంటూ బెదిరిస్తూ, ఉంటారు తిరస్కరిస్తూ ఉంటారు.

**అత్యార్యమతిదాతారమతిశూరమతివ్రతమ్**
**ప్రజ్ఞాభిమానినం చైవ శ్రీర్భయాన్నోపసర్పతి** 50

అతిమంచితనం కలవాని దగ్గరకు, అతిగా దానం చేసే వాడి దగ్గరకు, అతి పరాక్రమవంతుడి దగ్గరకు, అతిగా కఠినవ్రతాలు చేసేవాడి దగ్గరకు, తన తెలివి మీద అలవిమాలిన అభిమానం కలవాడి దగ్గరకు లక్ష్మి భయంతో చేరదు. లక్ష్మి అతి సద్గుణవంతుల దగ్గరా ఉండదు. ఏ మాత్రం సుగుణాలు లేని వారి వద్ద కూడా ఉండదు. ఆమె గుణాలను కోరదు. అంతమాత్రాన నిర్గుణుల పట్ల అనురాగం లేదు. పిచ్చిపట్టిన ఆవు వలె గుడ్డిదయిన లక్ష్మి ఎక్కడెక్కడో నిలిచిపోతూ ఉంటుంది.

**అగ్నిహోత్ర ఫలావేదాః శీలవృత్తఫలం శ్రుతమ్**
**రతిపుత్ర ఫలా దారా దత్తభుక్త ఫలం ధనమ్** 51

వేదాధ్యయనానికి ఫలం అగ్నిహోత్రాన్ని అర్చించటమే. శాస్త్రానికి ఫలం సత్ప్రవర్తన. స్త్రీ సంగమానికిఫలం సుఖము, సంతానాలు కల్గటమే. ధనానికి ఫలం దానం చెయ్యటం, అనుభవించటమే.

**అధర్మోపార్జితైరర్థైర్యః కరోత్యౌర్ధ్వ దేహికమ్**
**న స తస్య ఫలం ప్రేత్య భుంక్తేఽర్థస్య దురాగమాత్** 52

అధర్మంగా సంపాదించిన ధనంతో పరలోక సుఖానికి అవసరమైన క్రియలు (అనగా దాన ధర్మాదికాలు) చేసినవానికి, చనిపోయిన తరువాత దాని ఫలం రాదు. అందుకు కారణమేమంటే ఆ ధనం అన్యాయంగా సంపాదించినది.

**కానార వనదుర్గేషు కృచ్ఛ్రాస్వాపత్సు సంభ్రమే**
**ఉద్యతేషు చ శస్త్రేషు నాస్తిశేషవతాం భయమ్ 53**

అడవులలో కాని, దుర్గమ స్థలాలలో కాని, ఘోరమైన ఆపదలలో చిక్కినప్పుడు కాని, క్లిష్ట సమయాలలో కాని, ఆఖరకు కత్తి మీద పడుతున్నా కానీ, సత్త్వ గుణం కలవారికి భయం ఉండదు.

**ఉత్థానం సంయమో దాక్ష్యమప్రమాదో ధృతిః స్మృతిః**
**సమీక్ష్య చ సమారంభో విద్ధి మూలం భవస్య తత్ 54**

ప్రయత్నం, ఇంద్రియనిగ్రహం, సమర్థత, పొరపాటు పడకపోవటం, ధైర్యం, స్మృతి, తగిన విధంగా పరిశీలించి ప్రారంభించటం అనేది సంపదలకు మూలం అని తెలిసికొనుము.

**తపోబలం తాపసానాం బ్రహ్మ బ్రహ్మవిదాం బలమ్**
**హింసా బలమసాధూనాం క్షమాగుణవతాం బలమ్ 55**

తాపసులకు తమ తపస్సే బలము. బ్రహ్మవేత్తలకు వేదమే బలము. దుర్మార్గులకు హింసయే బలము. కాగా, గుణవంతులకు తమ సహనమే బలము అగుచున్నది.

**అష్టౌ తాన్యవ్రతఘ్నాని ఆపో మూలం ఫలం పయః**
**హ వి ర్బ్రాహ్మణ కామ్యా చ గురోర్వచనమౌషధమ్ 56**

నీరు, దుంపలు, పండ్లు, పాలు, హోమద్రవ్యము, విప్రుని ఆజ్ఞ, గురువు ఆజ్ఞ, ఔషధము - ఎనిమిది వ్రతానికి లేక దీక్షకు భంగం కలిగించవు.

**నతత్పరస్య సందధ్యాత్ప్రతికూలం యదాత్మనః**
**సంగ్రహేణైవ ధర్మః స్యాత్కామాదన్యః ప్రవర్తతే 57**

తనకు అప్రియమైనది ఇతరులకు చేయకపోవటమే సంగ్రహంగా ధర్మం అంటారు. ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించటమే అధర్మం.

**అక్రోధేన జయేత్క్రోధమసాధుం సాధునాజయేత్**
**జయేత్కదర్యం దానేన జయేత్సత్యేన చానృతమ్ 58**

క్రోధాన్ని శాంతంతో జయించాలి. దుర్మార్గాన్ని మంచితనంతోను, లోభాన్ని దానంతోను, అసత్యాన్ని సత్యంతోను జయించాలి.

**స్త్రీ ధూర్తకేఽలసే భీరౌ చండే పురుషమానిని**
**చౌరే కృతఘ్నే విశ్వాసో న కార్యో న చ నాస్తికే 59**

స్త్రీల యెడ దుడుకుగా ప్రవర్తించేవానిని, సోమరిని, పిరికివానిని, తీవ్రమైన కోపం గలవానిని, పౌరుషంతో గర్వపడే వానిని, దొంగను, కృతఘ్నుని, నాస్తికుని విశ్వసింపరాదు.

**అభివాదన శీలస్య నిత్యం వృద్ధోపసేవినః**
**చత్వారి సంప్రవర్ధంతే కీర్తిరాయుర్యశోబలమ్ 60**

పెద్దలకు గౌరవంతో నమస్కరిస్తూ, నిత్యము వారిని సేవించే స్వభావం కలవానికి కీర్తి, ఆయువు, యశస్సు, బలం అనే నాలుగు వృద్ధి పొందుతాయి.

**అతిక్లేశేన యోఽర్థాః స్యుర్ధర్మస్యాతిక్రమేణ చ**
**అరేర్వా ప్రణిపాతేన మా స్మ తేషు మనః కృథాః 61**

అతి కష్టంతో మాత్రమే సాధించగలిగేవానిని, ధర్మాన్ని అతిక్రమించి సాధింపగల్గిన వానిని, శత్రువుకు లోబడి సాధింపగలిగేవానిని పొందాలని మనసు పెట్టుకొనవద్దు.

**అవిద్యః పురుషః శోచ్యః శోచ్యం మిథునమప్రజమ్**
**నిరాహారాః ప్రజాః శోచ్యాః శోచ్యం రాష్ట్రమరాజకమ్ 62**

విద్యలేని పురుషుడు, బిడ్డలేని సంసారము (దాంపత్యము), తిండి లేని సంతానం, రాజు లేని రాజ్యము ఈ నాలుగు శోకింపదగినవి.

**అధ్వా జరా దేహ వతాం పర్వతానాం జలం జరా**
**అసంభోగో జరా స్త్రీణాం వాక్శల్యం మనసో జరా 63**

శరీరధారులకు అధిక ప్రయాణం, పర్వతాలకు ఎడతెగని నీరు, స్త్రీలకు సంభోగం లేకపోవటం,మనస్సుకు బాణపుములుకుల వంటి కఠినవాక్కులు ముసలితనం చేకూరుస్తాయి.

**అనామ్నాయమలా వేదా బ్రాహ్మణస్యావ్రతం మలమ్**
**కౌతూహలమలా సాధ్వీ విప్రవాస మలాః స్త్రియః 64**

అభ్యాసం లేకపోవటం వేదాలకు (మలం) దోషం, బ్రాహ్మణునకు వ్రతం (దీక్ష) లేకపోవటమే దోషం. భూమికి బాహ్లికులు దోషం. పురుషునికి అసత్యం దోషం. సాధ్వికి కుతూహలం దోషం. స్త్రీకి భర్తతో యెడబాటు దోషము.

**సువర్ణస్యమలం రూప్యం రూప్యస్యాపి మలం త్రపుః**
**జ్ఞేయం త్రపు మలం సీసం సీసస్యాపి మలం మలమ్ 65**

బంగారానికి మలం (కాలుష్యం) వెండి, వెండికి మలం తగరం, తగరానికి మలం సీసం. సీసానికి మలం మలమే.

**న స్వప్నేన జయేన్నిద్రాం నా కామేనస్త్రియం జయేత్**
**నేంధనేన జయేదగ్నిం న పానేన సురాం జయేత్ 66**

నిద్రను స్వప్నంతో జయించలేము. స్త్రీలను కామంతో జయించలేము. కట్టెలతో అగ్నిని జయించలేము. త్రాగుట చేత మద్యాన్ని జయించలేము.

**యస్య దాన జితం మిత్రమమిత్రా యుధినిర్జితాః**
**అన్నపానజితా దారాః సఫలం తస్యజీవితమ్ 67**

దానంతో మిత్రుని సంతృప్తిపరచినవాడు. యుద్ధంలో శత్రువును జయించినవాడు, అన్నపానీయాలతో భార్యను జయించినవాడు. ఈ ముగ్గురి జీవితము సఫలము అయినట్లే.

**సహస్రిణోఽపి జీవంతి జీవంతి శతినస్తథా**
**ధృతరాష్ట్రం మిముంచేచ్ఛాం నకథం చిన్న జీవ్యతే 68**

వేలకొలది డబ్బు ఉన్నవారూ బ్రతుకుతున్నారు. వందలు ఉన్నవారు బ్రతుకుతున్నారు. అనగా ధనం బాగా ఎక్కువగా ఉన్నవారు తక్కువ ఉన్నవారు కూడా బ్రతుకుతున్నారు. కాబట్టి ధృతరాష్ట్రా ధనం మీద ఆశ వదులుకో. ఏదో విధంగా జీవించగలము.

**యత్పృథివ్యాం వ్రీహి యవం హిరణ్యం పశవః స్రియః**
**నాలమేకస్య తత్సర్వమితి పశ్యన్న ముహ్యతి 69**

భూమి మీద ఉన్న ధాన్యం అంతా, బంగారం, పశుసంపద, స్త్రీ సంపద అన్నీ కలిపినా, ఒక్కడికి చాలవు. దీనిని తెలిసిన మానవుడు మోహం చెందదు.

**రాజన్భూయో బ్రవీమి త్వాం పుత్రేషు సమమాచర**
**సమతా యది తే రాజన్స్వేషు పాండుసుతే షుచ 70**

రాజా! నీకు మరల చెప్పుచున్నాను. నీకు నీ కొడుకుల మీద, పాండురాజు కొడుకుల మీద సమభావం ఉంటే అందరినీ సమానంగా చూడు.



## ముఖ్య విషయములు

**1. రాజు యొక్క ముఖ్య విధి :**

పాలకుడైనవాడు క్రమము తప్పక క్రింది విషయములను గమనించుచుండవలెను.

- రాజ్యమునకు బయటినుంచి వచ్చి అపాయములు
- తన రాజ్యము, ప్రజల ఆర్థిక స్థితి, 3. తన కోశము యొక్క స్థితి 4. తన సైన్యము యొక్క బలాబలాలు వీనిపై అదుపు లేనియెడల ఆ రాజు రాజ్యము నాశనమైపోవును.

**2. నాయకత్వ లక్షణాలు :**

- ఖనిజం నుంచి బంగారమును ఎన్నో ప్రక్రియల ద్వారా తయారు చేసినట్లే అన్ని పరిస్థితులలోనూ నాయకుడైనవాడు ఒక విషయముపై నిర్ణయమునకు వచ్చుటకు ముందు యథార్థమును పూర్తిగా తెలుసుకొని ఉండవలెను.
- నాయకుడైనవాడు తన వద్దపనిచేయుచూ తరచుగా వాదోపవాదములు చేయుచూ బాధ్యతలను విస్మరించి సోమరులుగా ఉండువారిని ఒక కంట కనిపెట్టి ఉండవలెను.
- రహస్యమైన ఒక విషయముపై నిర్ణయము తీసుకొనవలసి వచ్చినప్పుడు తన ఆంతరంగిక సలహాదారులతో నిర్జనమైన అరణ్యమునకు గానీ, కొండపైకిగానీ పోయి ఆ చర్చ చేయవలెను.

**3. ఒక వ్యక్తికి ఉండవలసిన లక్షణాలు :**

- ఒక వస్తువుతో సంబంధమును వదలుకొనినప్పుడు దాని లోపాలోపములు అతడిని ప్రభావితం చేయవు.
- ప్రపంచంలోని అన్నింటితోనూ సంబంధము వదలుకొనిన వాడిని ఏదియూ ప్రభావితం చేయదు.
- వ్యక్తి యొక్క గుణములు అతడు ఎవరితో కలిసి ఉండునో, ఎవరి వద్ద పని చేయునో, ఎవరిని తనకు ఆదర్శముగా తీసుకొని ఉండునో అనే విషయములపై ఆధారపడి ఉండును.

**4. విజయము – ఆనందము :**

- ఒక వ్యక్తి యొక్క విజయమును ఇతరులు నిర్ణయింతురు.
- సంతోషమును అతడే అనుభవించును.
- మనశ్శాంతి మాత్రమే సంతోషమును కల్గించగలదు.

## 40వ అధ్యాయము

**యో౽భ్యర్థితః సద్భిరసజ్జమానః కరోత్యర్థం శక్తిమహాపయిత్వా**
**క్షిప్రం యశస్తం సముపైతి సంతమలం ప్రసన్నా హి సుఖాయః సంతః 1**

విదురుడు ఇట్లు చెప్పెను : సజ్జనులు అడిగితే, గర్వపడకుండా, తన శక్తివంచన లేకుండా, కార్యం ముగించిన సుజనునికి వెంటనే కీర్తి వస్తుంది. అందుకు కారణమే మనగా సజ్జనుల అనుగ్రహం సుఖం కలిగిస్తుంది.

**మహాంతమప్యర్థ మధర్మయుక్తం యః సంత్యజత్యనుపాకృష్ట ఏవ**
**సుఖం స దుఃఖాన్యవముచ్య శేతే జీర్ణాం త్వచం సర్ప ఇవావముచ్య 2**

ఎంత గొప్పపని అయినా, ధర్మవిరుద్ధమైనది అయితే, ఇతరులు వద్దనకుండానే ఆ పనిని విడిచిపెట్టేవాడు కుబుసాన్ని విడిచిన పామువలె దుఃఖాలను వదలి సుఖంగా నిద్రిస్తాడు.

**అనృతంచ సముత్కర్షే రాజగామి చ పైశునమ్**
**గురోశ్చాలీక నిర్బంధః సమాని బ్రహ్మహత్యయా 3**

అసత్యం వలన పొందిన గెలుపు, రాజు సొమ్ము మీద దురాశ, గురువులను అనగా తల్లి, తండ్రి, గురువు మొదలగు పెద్దలను నిర్బంధించటం లేక బలవంతం చేయటం – ఈ మూడు దోషాలు బ్రహ్మహత్యతో సమానమైనవి.

**అసూయైక పదం మృత్యురతివాదః శ్రియో వధః**
**అశుశ్రూషా త్వరా శ్లాఘా విద్యాయాః శత్రవస్త్రయః 4**

అసూయ ఒక్క అంగలో దగ్గరకు వచ్చే మృత్యువు. అతిగా మాట్లాడటం సంపదను హత్య చేయటమే. గురు శుశ్రూష లేకపోవటం, తొందరపాటు, ఆత్మస్తుతి. ఈ మూడు విద్యకు శత్రువులు.

**సుఖార్థినః కుతో విద్యానాస్తి విద్యార్థినః సుఖమ్**
**సుఖార్థీ వా త్యజేద్విద్యాం విద్యార్థీ వా సుఖం త్యజేత్ 5**

సుఖం కోరేవానికి విద్య ఎక్కడిది అనగా సుఖపడే వానికి విద్య అబ్బదు. విద్యార్థికి సుఖం అబ్బదు. సుఖం కావాలనుకుంటే విద్యను వదులుకోవాలి. విద్య కావాలనుకుంటే సుఖాన్ని ఆశించకూడదు.

**నాగ్ని స్తృప్యతి కాష్ఠానాం నాపగానాం మహోదధిః**
**నాంతకః సర్వభూతానాం న పుంసాం వాదులోచనా** **6**

అగ్ని కట్టెలతో సంతృప్తి చెందదు. ఎన్ని నదులు తనలోకలిసినా సముద్రం సంతృప్తి చెందదు. ఎన్ని జీవులు ప్రాణాలను తీసినా యమునికి తృప్తి ఉండదు. పురుషులతో స్త్రీలు తృప్తి చెందరు.

**ఆశా ధృతిం హన్తి సమృద్ధిమంతకః;**
**క్రోధః శ్రియం హంతి యశః కదర్యతా**

**అపాలనం హంతి పశూంశ్చ రాజన్న**
**ఏకః కృద్ధో బ్రాహ్మణో హంతి రాష్ట్రమ్** **7**

రాజా! ఆశ ధైర్యాన్ని చంపుతుంది. యముడు పుత్రకళత్ర సమృద్ధిని చంపుతాడు. కోపం సంపదను చంపుతుంది. లోభం కీర్తిని చంపుతుంది. అపాలనం అనగా రక్షణ లేకుండటం పశువులను చంపుతుంది. కోపించిన ఒకే ఒక బ్రాహ్మణుడు రాజ్యం అంతటిని చంపుతాడు.

**అజశ్చ కాంస్యం చ రథశ్చ నిత్యం మధ్వాకర్షః శకునిః శ్రోత్రియశ్ చ**
**వృద్ధో జ్ఞాతిరవసన్నో వయస్యఏతాని తే సంతు గృహే సదైవ** **8**

మేకలు, కంచు, వెండి, తేనె, విషాన్ని హరించే మణి, పక్షి, వేదవేత్త, వృద్ధుడైన జ్ఞాతి, ధనహీనుడై కులీనుడు, ఎల్లప్పుడు ఇంటిలో ఉండాలి.

**అజోక్షా చందనం వీణా ఆదర్శో మధుసర్పిషీ**
**విషమౌదుంబరం శంఖః స్వర్ణం నాభిశ్చ రోచనా**
**గృహే స్థాపయితవ్యాని ధన్యాని మనురబ్రవీత్**
**దేవ బ్రాహ్మణ పూజార్థమతిథీనాం చ భారత** **10**

ఓ భరత! మేక, ఎద్దు, మంచిగంధం, వీణ, అద్దం, తేనె, నెయ్యి, జలం, రాగిపాత్రలు, శంఖం, సాలగ్రామం, గోరోచనం ఈ మంగళద్రవ్యాలు దేవ, బ్రాహ్మణ అతిధుల పూజ కోసం ఇంటిలో ఉంచుకోవలయునని మనువు చెప్పెను.

**ఇదం చ త్వాం సర్వపరం బ్రవీమి పుణ్యం పదం తాత మహావిశిష్టమ్**
**న జాతు కామాన్న భయాన్న లోభాద్ధర్మం త్యజేజ్జీవితస్యాపి హేతోః** **11**

తండ్రీ! ఇదిగో! అన్నింటికంటే ఉత్తమం, చాలా విశిష్టము, పుణ్యప్రదము అయిన విషయం చెప్పుతున్నాను. విను కామం వలన కానీ, భయం వలన కానీ, లోభం వలన కానీ, చివరకు ప్రాణాలు పోతున్నా కానీ, ధర్మం విడిచిపెట్టకూడదు. ఎందుకనగా ధర్మం నశించదు.

**నిత్యోధర్మః సుఖదుఃఖే త్వనిత్యే నిత్యో జీవో ధాతురస్య త్వనిత్యః**
**త్యక్త్వానిత్యం ప్రతితిష్ఠస్వ నిత్యే సంతుష్య త్వం తోషపరో హి లాభః 12**

ధర్మం శాశ్వతమైనది. సుఖదుఃఖాలు నశించిపోతాయి. జీవుడు నిత్యము. జీవుడు ఇక్కడికి రావటానికి కారణం మాత్రం అనిత్యం. అనిత్యమైన దానిని విడిచిపెట్టి, నిత్యం మీద నిన్ను నీవు ప్రతిష్ఠించుకో! సంతోషం పొందు. లాభమంటే చివరకు సంతోషమే గదా. సంతోషం అన్ని సంపదల కంటే అధికమైనది గదా!

**మహాబలాన్పశ్య మానానుభావాన్ ప్రశాస్య భూమిం ధనధాన్య పూర్ణామ్**
**రాజ్యాని హిత్వా విపులాంశ్చ భోగాన్గతాన్నరేంద్రాన్వశమంతకస్య 13**

రాజా! చూడు! ఎందరో మహా బలవంతులు, మహానుభావులు. ధన ధాన్య సంపన్నమైన భూమిని పరిపాలించి, చివరకు తమ రాజ్యాలను గొప్ప భోగాలను వదలి యమునికి వశమైపోయినారు.

**మృతం పుత్రం దుఃఖపుష్టం మనుష్యా ఉత్క్షిప్య రాజన్స్వగృహాన్నిర్హరంతి**
**తం ముక్తకేశాః కరుణం రుదంతశ్చితామధ్యే కాష్ఠమివ క్షిపంతి 14**

ఎంతో ప్రేమతో కష్టపడి పెంచిన కొడుకు చనిపోగా, మానవులు వారి శవాలను తమ ఇళ్ళలో నుండి ఎత్తి, బయటకు పారవేస్తున్నారు. ఆ పుత్రుని కోసం జుట్టు విరబోసుకుని, జాలిగా రోదిస్తూ, ఆ శవాన్ని కట్టెను వలె చితి మధ్య పడవేస్తున్నారు.

**అన్యోధనం ప్రేతగతస్య భుంక్తే వయాంసి చాగ్నిశ్చ శరీరధాతూన్**
**ద్వాభ్యామయం సహ గచ్ఛత్యముత్ర పుణ్యేన పాపేనచ వేష్ట్యమానః 15**

చనిపోయిన వానికి చెందిన ధనాన్ని మరొకడు తింటున్నాడు. వాని శరీర ధాతువులను అగ్నికానీ, పక్షులు కానీ తింటున్నారు. జీవుడు మాత్రం పుణ్యం పాపం అనే రెండింటితో చుట్టుకొని వెంటరాగా పరలోకానికి పోతున్నాడు.

**ఉత్సృజ్య వినివర్తంతే జ్ఞాతయః సుహృదః సుతా**
**అగ్నౌ ప్రాస్తం తు పురుషం కర్మాన్వేతి స్వయంకృతమ్ 16**

రాజా! పూలు, పండ్లులేని చెట్లను జనులు వదలివేసినట్లు చనిపోయిన వానిని జ్ఞాతులు, బంధువులు, కుమారులు వదలి వెనుతిరిగిపోతారు. తాను చేసికొన్న కర్మ ఒక్కటే చితిలో పడిన మానవుని, అనుసరించి వస్తుంది. అందుచేతనే మానవుడు ప్రయత్నం చేసి నెమ్మది నెమ్మదిగా ధర్మం కూడగట్టుకోవాలి.

**అస్మాల్లోకాదూర్ధ్వమముష్య చాధో మహత్తమస్తిష్ఠతి హ్యన్ధకారమ్**
**తద్వై మహామోహనమింద్రియాణాం బుధ్యస్వ మా త్వాం ప్రలభేత రాజన్17**

రాజా!ఈ లోకానికి పైన, పరలోకానికి క్రింద పెద్దచీకటి ఉన్న ప్రదేశం ఉన్నది. అదే మన ఇంద్రియాలను బాగా మోహపెడుతుందని తెలిసుకో.అది నిన్నుపొందకుండును గాక.

**ఇదం వచః శిక్ష్యసి చేద్యథావన్ నిశమ్య సర్వం ప్రతిపత్తుమేవమ్**
**యశఃపరః ప్రాప్స్యసి జీవలోకే భయం న చాముత్ర న చేహ తేఽస్తి 18**

ఈ మాట నీవు విని, ఉన్నది ఉన్నట్లు అవగాహన చేసుకొనగలిగేటట్లైతే, నీకు జీవలోకంలో గొప్ప కీర్తి కలుగుతుంది. ఇహపరాలు రెండింటిలోను ఇప్పుడు కాని, ఇకముందు కాని నీకు ఎట్టి భయం ఉండదు.

**ఆత్మా నదీ భారత పుణ్యతీర్థా సత్యోదకా ధృతిమాలా దమోర్మిః**
**తస్యాం స్నాతః పూజ్యతే పుణ్యకర్మా పుణ్యోహ్యాత్మా నిత్యమశుంభోఽంభేవ19**

భరత వంశాగ్రణీ! ఆత్మ అనేది ఒక నదిగా చెప్పబడగా, పుణ్యం దాని రేవు. సత్యం ఆ నది యొక్క నీరు. ధైర్యం దాని ఒడ్డు. దయయే ఆ నది కెరటం. ఆ నదిలో స్నానం చేసిన పుణ్యకర్ముడు పవిత్రుడు అవుతాడు. పుణ్యసహితమైన ఆత్మ అంటే ఎల్లప్పుడు లోభం లేకపోవటమే.

**కామక్రోధగ్రాహవతీం పంచేంద్రియ జలా నదీమ్**
**కృత్వా ధృతిమయీం నావం జన్మదుర్గాణి సంతర 20**

రాజా! జీవితం అనేది ఒక నది వంటిది. పంచేంద్రియాలే దాని జలం. మోహము అనగా కోర్కెలు. క్రోధం ఆ నది యొక్క మొసళ్ళు, ప్రాణాంతక చేపలు. ఆత్మ నిగ్రహాన్ని నావగా చేసికొని, పునర్జన్మలనే దాని కష్టాలను దాటుము. (లేక) కామక్రోధాలనే మొసళ్ళు, పంచేంద్రియాలనే నీరు కల నదిని ధైర్యపూర్ణమైన నావను చేపట్టి జన్మకష్టాలను దాటుము.

**ప్రజ్ఞావృద్ధం ధర్మవృద్ధం స్వబంధుం విద్యావృద్ధం వయసా చాపి వృద్ధమ్**
**కార్యాకార్యే పూజయిత్వా ప్రసాద్య యః సంపృచ్ఛేన్న స ముహ్యేత్కదాచిత్ 21**

ప్రజ్ఞ చేత, ధర్మం చేత, విద్య చేత, వయసు చేత, వృద్ధుడైన తన బంధువును పూజించి, ప్రసన్నుని చేసికొని కర్తవ్యాకర్తవ్యాలు అడిగి తెలుసుకొనేవాడు ఎప్పుడూ పొరపాటు పడడు.

**ధృత్వా శిశ్నోదరం రక్షేత్పాణిపాదం చ చక్షుషా**
**చక్షుః శ్రోత్రేచ మనసా మనో వాచం చ కర్మణా 22**

ధైర్యంతో శిశ్నాన్ని, పొట్టను రక్షించుకోవాలి అనగా భోజనమైధున కర్మలను నిర్వర్తించుకొనటానికి తగిన ప్రయత్నంతో నిర్వర్తించుకోవాలి. అలాగే కాలుచేతులను కంటితో, కన్ను చెవులనుమనసుతో, మనస్సును మాటను, సత్కర్మతోను రక్షించుకొనవలెను.

**నిత్యోదకీ నిత్యయజ్ఞోపన్నవీతీ నిత్యస్వాధ్యాయీ పతితాన్న వర్జీ**
**ఋతం బ్రువన్గురవే కర్మ కుర్వన్న బ్రాహ్మణశ్చ్యవతే బ్రహ్మలోకాత్ 23**

నిత్యము స్నాన సంధ్యాదులాచరిస్తూ, యజ్ఞోపవీతం ధరించినవాడు, నిత్యము వేదాధ్యయనం చేసేవాడు, పతితుల అన్నం తిననివాడు, సత్యమే పలికేవాడు, గురుశుశ్రూష చేసేవాడు, అనే ఈ లక్షణాలు కల బ్రాహ్మణుడు బ్రహ్మలోకం నుండి పతనం చెందడు.

**అధీత్య వేదాన్పరిసంరస్తీర్య చాగ్నీనిష్ట్వా యజ్ఞైః పాలయిత్వా ప్రజాశ్చ**
**గో బ్రాహ్మణార్థే శాస్త్రపూతాంతరాత్మా హతః సంగ్రామేక్షత్రియః స్వర్గమేతి 24**

వేదాధ్యయనం చేసి, అగ్నికి నాల్గువైపుల దర్భలు పరచి, యజ్ఞాశాలలు చేసి ప్రజలను పరిపాలించి, శస్త్రాలతో, పవిత్రమైన అంతరంగంతో గో బ్రాహ్మణుల కోసం యుద్ధంలో చనిపోయిన క్షత్రియుడు స్వర్గం పొందుతాడు.

**వైశ్యోఽధీత్య బ్రాహ్మణాన్క్షత్రియాంశ్చధనైః కాలే సంవిభాజ్యాశ్రితాంశ్చ**
**త్రేతా పూతం ధూమమాఘ్రాయ పుణ్యం ప్రేత్య స్వర్గే దేవ సుఖాని భుంక్తే 25**

వైశ్యుడు వేదశాస్త్రాధ్యయనం చేసి బ్రాహ్మణులను క్షత్రియులను, తనను ఆశ్రయించుకొని వారిని సరియైన సమయంలో ధనంతో ఆదుకొని త్రేతాగ్ని ధూమం ఆఘ్రాణించే పుణ్యమూర్తియై మరణించి స్వర్గంలో దివ్యసుఖాలు అనుభవిస్తాడు.

**బ్రహ్మక్షత్రం వైశ్యవర్ణం చ శూద్రః క్రమేణైతాన్న్యాయతః పూజయానః**
**తుష్టేష్వేతేష్వవ్యథో దగ్ధపాపస్త్యక్త్వా దేహం స్వర్గసుఖాని భుంక్తే 26**

బ్రహ్మక్షత్రియ వైశ్యులను న్యాయబద్ధంగా గౌరవిస్తూ, తృప్తిపరుస్తూ పాపప్రక్షాళన చేసికొంటూ, సుఖంగా శరీరం వదలి వెళ్ళిపోయిన శూద్రుడు స్వర్గసుఖాలు అనుభవిస్తాడు.

**చాతుర్వర్ణ్యస్యైష ధర్మస్తవోక్తో హేతుం చాత్ర బ్రువతో మే నిబోధ**
**క్షత్రాధర్మాద్ధీయతే పాండుపుత్రస్తం త్వం రాజన్రాజధర్మే నియుంక్ష్వ** **23**

నాలుగు వర్ణాల ధర్మాలు నీకుచెప్పాను. అందుకు కారణం చెప్తున్నాను విను. ధర్మరాజు క్షత్రియ ధర్మం నుండి తొలగి ఉన్నాడు రాజా! నీవు ఆతనిని రాజ ధర్మంలో నియోగించు.

**ఏవమేతద్యథా మాం త్వమనుశాసతి నిత్యదా**
**మమాపి చ మతిః సౌమ్య భవత్యేవం యథాత్థ మామ్** **28**

**సా తు బుద్ధిః కృతాప్యేవం పాండవాన్ప్రతి మేసదా**
**దుర్యోధనం సమాసాద్య పునర్విపరివర్తతే** **29**

**న దిష్టమభ్యతిక్రాన్తుం శక్యం మర్త్యేన కేన చిత్**
**దిష్టమేవ కృతం మన్యే పౌరుషం తు నిరర్థకమ్** **30**

అనగానే ధృతరాష్ట్రుడు "విదురా! నీవు నాకు సదా ఉపదేశం చేస్తూనే ఉన్నావు. నా బుద్ధికి కూడా నీవు చెప్పినట్లే అట్లే అనిపిస్తుంది. పాండవులను గురించి ఎల్లప్పుడు నాకు అదే బుద్ధి కలుగుతూ ఉంటుంది. కానీ దుర్యోధనునితో కలిసిన తరువాత నా బుద్ధి మళ్ళీ మారిపోతుంది. ఏ ప్రాణికీ కూడా దైవాన్ని దాట శక్యం కాదు. అందుచేత దైవమే స్థిరమైనది. పురుష ప్రయత్నం వ్యర్థం అయినదని నా భావన " అన్నాడు.



## ముఖ్య విషయములు

1. **తెలివైన మనుష్యుని ప్రవర్తన :**

- తెలివైనవాడు తన యెడ ఇతరులు ఎట్లు ప్రవర్తింపవలెనని అనుకొనునో తాను అట్లే నడుచుకొనవలెను.
- అతడు వనరులను వ్యర్థముగా నిరుపయోగం చేయడు. అట్లే విలువలేని పనులను చేయడు.
- వ్యర్థ ప్రసంగము చేయక నిశ్శబ్దమునకు ప్రాముఖ్యత నిచ్చును. పూర్తిగా అవసరమైనప్పుడు మాత్రమే మాట్లాడును అది కూడా సత్యమునే పలుకును తనకు గల వనరులను దాటి అధిక అవకాశములను కోరుకొనడు. విజయము పొందినప్పుడు, అపజయం చెందినప్పుడు అతిగా స్పందించడు.

2. బంగారమును ఖండించి శుభ్రము చేసి కాల్చినప్పుడు కాంతిని పొందును. అట్లే వినయము గలవారు వారి స్వభావము ద్వారా గుర్తింపు పొందుదురు. సన్యాసిని అతని ప్రవర్తన ద్వారా, ధైర్యవంతుడు కష్టములలోను, అతి బీదతనములో ఉన్నప్పుడు ఒక వ్యక్తి స్నేహితుడో, శత్రువో తెలుసుకొనవలెను.

3. వృద్ధాప్యము అందమును చెడగొట్టును. ఆశ ఓర్పును పాడుచేయును. దురాశ దుర్మార్గుని చేయును. కోపము సంపద నశింపజేయును. అహంభావము అన్నింటినీ పాడుచేయును. కామము సిగ్గును పోగొట్టును. యోగాభ్యాసముపై అధికారము పొందిన యోగి, యుద్ధము పూర్తియగునంతవరకూ యుద్ధము చేసిన యోధుడు స్వర్గమునకు చేరుకొందురు.

   మూర్ఖుడు పిలవకుండానే ఇతరుల వ్యవహారములలో జోక్యము చేసుకొని తన బాధ్యతలను విస్మరించును. అంతేగాక ఇతరులను కూడా అందుకు బాధ్యులుగా చేయును.

